అపరాధ పరిశోధన అనుబంధం—97

A తె J - 3
20-12-81

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## చట్టానికి సాక్ష్యం కావాలి

రచన : కృష్ణచైతన్య

## చుట్టాలొస్తారు

రచన : వసుంధర

## జూదగాళ్లు

రచన : వాణిశ్రీ

## పారిపోయిన హంతకుడు

రచన : టెంపోరావ్

రక్తం త్రాగే పిశాచం - ఏడవ భాగం

**అపరాధ పరిశోధన సప్లిమెంట్—97**
జనవరి, 1982
వెల: రు. 5-00
ఏడాది చందా: 60 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**ఏ. ఏ. మోహన్రావ్**
**వసుంధర**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# చట్టానికి సాక్ష్యం కావాలి!

## కృష్ణచైతన్య

వ్రాయడం ఆపి బద్ధకంగా వొళ్ళు విరుచుకున్నాడు ప్రకాశం. కాగితాలమీద వెయిట్ పెట్టి నిలబడ్డాడు.

సుమతి లోపల్నించి వచ్చింది కాఫీ గ్లాసుతో....

"ఏం కథ?" అడిగింది కాఫీ అందిస్తూ.

"చీడపురుగులు!" ప్రకాశం చెప్పాడు.

"అపనకేగా!" సుమతి అడిగింది.

ప్రకాశం తల వూపి, "అవును! ఈ మధ్య వారం రోజులుగా నగరంలో చిన్నపిల్లలు మాయం అయిపోతున్నారుగా! దాని ఆధారంగా ఓ నవల" చెప్పాడు.

సుమతి అంతక్రితం పేపర్లలో చదివింది చిన్నపిల్లలు మాయమవుతున్నారని, ఏదో ముఠా వాళ్ళను చాకచక్యంగా అపహరిస్తుందని, కాని, ఎందుకో తెలియదు. అదే విషయం భర్తను అడిగింది..

ప్రకాశం పెదిమ విరిచాడు. "ఏమో చెప్పలేం! దేనికైనా కావొచ్చు. కొందరు పసిపిల్లల్ని విదేశాలకు

శానిసలుగా అమ్మేస్తారు. ఆడపిల్లల్నయితే వ్యభిచార గృహాలకు అమ్మేస్తారు. మగపిల్లల్నయితే, సంతానంలేక బాధపడే కోటీశ్వరులకు, వాళ్ళ దాయాదులనుంచి ఆస్తి రక్షించడానికి అమ్మేస్తారు. మరి కొందర్ని పెద్ద పెద్ద హోటల్స్‌లో నౌఖర్లుగా అమ్మేస్తారు. కొందర్ని వికలాంగుల్ని చేసి వీధుల్లో ముష్టెత్తిస్తారు. అంతదాకా ఎందుకు, వీళ్ళందర్ని కొంతకాలం రహస్యంగా పోషిస్తే, వాళ్ళ కళ్ళు, గుండెలు, మూత్రపిండాలు వాళ్ళ వ్యాపారానికి బ్రహ్మాండమైన సాధనాలు" చెప్పాడు.

ఆ మాటలు వింటూనే సుమతి మొహం భయంతో పాలిపోయింది. అది గమనించిన ప్రకాశం చిన్నగా నవ్వి, "అందుకే చెప్పాను, ఇలాంటి క్రైం కథలు, క్రైం విషయాలు నీకొద్దని. అయినా వాటి వూసెత్తకుండా వుండలేవు" అన్నాడు.

భర్త వెక్కిరింపుకి మూతి మురిపెంగా మూడువంకర్లు తిప్పి, గ్లాసు అందుకొని లోపలికి వెళ్ళింది.

ప్రకాశం సిగరెట్ వెల్గించి కుర్చీలో కూర్చున్నాడు కథ వ్రాయడానికి.

"టైమెంత?" లోపల్నించి సుమతి గొంతు వినిపించింది.

"పదకొండున్నర!" టైం చూచి చెప్పాడు.

"పదకొండున్నరా! నాని ఇంకా స్కూలునుంచి రాలేదేం?" స్వగతంగానే పైకి అనేసింది.

ప్రకాశం లేచి వెళ్ళి వీధిలోకి తొంగి చూశాడు. ఎండ తీవ్రంగా వుంది. వీధి నిర్మానుష్యంగా వుంది.

"స్కూలు ఎన్ని గంటలకు వదిలేది?" అక్కడనుంచే అడిగాడు.

"పదకొండు గంటలకు!" సుమతి కూడ వాకిట్లోకి వస్తూ చెప్పింది.

"ఈ పాటికి రావాలి! పిల్లలతో ఎక్కడైనా ఆడుకుంటున్నాడేమో!" తనే సంజాయిషీ చెప్పుకున్నాడు ప్రకాశం.

"ఇంత ఎండలోనా?"

"అదీ నిజమే! స్కూలు కూడా పెద్ద దూరంకాదు. నేను వెళ్ళి చూస్తాను" చెప్పులు తొడుక్కొని లుంగీ మీదనే వీధిలోకి నడిచాడు.

## 2

ప్రకాశం స్కూలు దగ్గరకు వెళ్ళి వెదికాడు.

అప్పటికే స్కూలు మూసేసారు. పిల్లలెవ్వరూ కనిపించలేదు చుట్టుపక్కల.

స్కూలునుంచి ఇల్లు పెద్ద దూరం కూడా కాదు. పక్కవీధిలోనే ఇల్లు. దారిపొడుగునా పరీక్షగా చూసుకుంటూ ఇంటికేసి నడిచాడు. ఇల్లు దగ్గరవుతుండగా ఏదో ఆశ నాని ఇంటికి వచ్చాడేమోనని.

వాకిట్లోనే ఎదురుపడింది సుమతి. సుమతి ముఖం చూడగానే అర్థం అయింది నాని రాలేదని.

"స్కూలు దగ్గరలేడు! ఎవరైనా స్నేహితులింట్లో వున్నాడేమో చూస్తాను" అంటూ మళ్ళీ వెనక్కి తిరిగి ఆగి "నాని స్కూలుకు వెళ్ళేటప్పుడు ఎవరితో కలిసి వెళ్ళాడు?" అడిగాడు.

"ఒక్కడే వెళ్ళాడు. అలవాటేగా!" దిగులుగా చెప్పింది సుమతి.

ప్రకాశం ముందుకు కదిలాడు. నాని స్నేహితులు నలుగురైదుగురు తెల్సు. వాళ్ళందరి ఇళ్ళకూ వెళ్ళి

అడిగాడు. అక్కడెక్కడా లేదు.

స్కూలు వదిలేవరకు వున్నాడని, వదిలేక తమతో రాలేదని ఇద్దరు పిల్లలు చెప్పారు. మొత్తానికి స్కూలు వదిలాక నాని ఎవ్వరికి కన్పించలేదు.

మధ్యాహ్నం రెండుగంటలు కావొస్తుంది. ప్రకాశం స్కూలు దగ్గరకు వెళ్ళాడు. నాని ఎక్కడికి వెళ్ళింది అక్కడే తెలియాలి అనుకున్నాడు. మళ్ళీ స్కూలు టైం కావడంవల్ల ఒక్కొక్కరే పిల్లలు వొస్తున్నారు. వాళ్ళెవ్వరూ తెలియదు ప్రకాశానికి.

అంతలోనే ఓ ముసలావిడ జీళ్ళు తెచ్చుకొని కూర్చుంది అమ్మకోడానికి. ఆమెను చూడగానే మెరుపు లాంటి ఆలోచన వచ్చింది ప్రకాశానికి. చకచకా ఆమె దగ్గరకు నడిచాడు.

"అవ్వా! ఉదయం స్కూలు వదిలేవరకు నువ్వు ఇక్కడే వున్నావా?" అడిగాడు ఆత్రుతగా.

"అవున్నాయనా! ఏం?" అడిగిందామె.

"స్కూలు వదిలాక ఎవరైనా ఆరేళ్ళబ్బాయి ఇక్కడ తారట్లాడుతుండడం చూశావా?" అడిగాడు.

ఆమె తల అడ్డంగా వూపింది లేదన్నట్లు.

"బాగా గుర్తుతెచ్చుకో అవ్వా! ఉదయంనుంచి మా అబ్బాయి కన్పించడంలేదు. ఎర్ర చొక్కా తెల్ల నిక్కరు వేసుకున్నాడు. పసుపు రంగు సంచీ ఉంటుంది చేతిలో" వర్ణించాడు.

ఆమె ఓ నిముషం ఆలోచించి, "సరిగ్గా గుర్తులేదు నాయనా! ఎర్ర చొక్కా అనుకుంటాను, స్కూలు వదలగానే ఆ అబ్బాయి అదిగో....ఎదురుగా వున్న చెట్టు క్రింద ఓ అమ్మాయి చెరుకుముక్కలు అమ్ముతుంటే

ఆమెతో మాట్లాడుతూ కన్పించాడు. ఆ తర్వాత పిల్లలంతా వెళ్ళిపోయాక నేనూ వెళ్ళిపోతూ చూశాను. వాళ్ళిద్దరూ ఆ వీధిగుండా పోవడం.... తెల్సినవాళ్ళేమో అనుకున్నాను" అంది నెమ్మదిగా.

"ఎవరామె? ఎలా వుంటుంది? నీకు తెలుసా?" ఆతృతగా అడిగాడు ప్రకాశం.

"లేదు నాయనా! ఆమె నీరోజే చూడడం!"

ఈమధ్య పేపర్లలో చదివిందాన్నిబట్టి జరిగిందేమిటో అర్థం అయింది. కంగారులో, భయంలో ప్రకాశం గుండె వేగం హెచ్చింది. చకచక ఆ వీధిలోకి నడిచాడు.

ఆ వీధిలోగుండా వెడితే బస్టాండ్ వస్తుంది. దారి పొడుగునా పరీక్షగా చూసుకుంటూ చకచక బస్టాండు దగ్గరకు వెళ్ళాడు.

బస్టాండు పెద్ద రద్దీగా లేదు. నాలుగైదు బస్సులు వున్నాయి స్టాండులో. స్టాండు లోపల, చుట్టుపక్కల చూశాడు ప్రకాశం. నాని జాడ కన్పించలేదు. ఆలోచిస్తుంటే నాని కూడ మిగతా వాళ్ళలాగ అపహరించబడ్డాడని అనుమానం కల్గింది.

నానిని తీసుకెళ్ళిన ఆ స్త్రీ ఎవ్వరు? ఆ ముఠా మనిషేనా? నానిని తీసుకొని ఇక్కడిదాకా వచ్చిందా? లేక మధ్యలో ఎక్కడైనా ఇంట్లోకి వెళ్ళిందా? ఎలా తెల్సుకోవడం? ఒకవేళ ఇక్కడికి వస్తే ఏ బస్సులో వెళ్ళింది?....

చటుక్కున ఓ ఆలోచన వచ్చింది. చకచక ఎంక్వైరీ కౌంటర్ దగ్గరకు వెళ్ళి మధ్యాహ్నం పదకొండు పన్నెండు మధ్య ఏఏ వూరి బస్సులు బయలుదేరాయో వివరాలు రాసుకున్నాడు.

ఆ మధ్య సమయంలో ఆరు బస్సులు బయలుదేరాయి. అందులో రెండు సూపర్ ఎక్స్‌ప్రెస్‌లు, నాల్గు ఆర్డినరీ బస్సులు. సూపర్ ఎక్స్‌ప్రెస్‌లు రెండూ లాంగ్ రూట్ బస్సులు. సీట్లన్నీ రిజర్వ్ అయిపోయాయి. వాటిల్లో స్టాపింగ్ అనుమతించరని ఎంక్వయిరీలో చెప్పారు.

ఇకపోతే నాలు ఆర్డినరీ బస్సులు. అందులో రెండు మద్రాసు వైపు వెళ్ళేవి. రెండు కడప వైపు వెళ్ళేవి. ఆ నాలుగు బస్సులు సాయంత్రంలోగా ఇన్ ట్రిప్పుకు ఇక్కడకు రావాలి.

ప్రకాశం చాలా సేపు ఆలోచించాక, ఎదురుగావున్న మెడికల్ స్టోర్‌లోకి వెళ్ళి, పక్కింటికి ఫోన్ చేసి, సుమతిని పిలిపించి నాని ఇంటికి వచ్చాడేమో కనుక్కొని తను ఆలస్యంగా వస్తానని, కంగారుపడవద్దని చెప్పి, అక్కడనుంచి నేరుగా పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి రిపోర్టు ఇచ్చి, తన అనుమానాలు వివరించి, చుట్టుపక్కల పోలీస్ స్టేషన్‌లకు ఈ విషయం చెప్పి, మళ్ళీ బస్టాండుకు వచ్చాడు.

సాయంత్రం నాలుగంటలు కావొస్తుంది అప్పటికి.

పదినిముషాల తేడాలో, తనకు కావలసిన బస్సుల్లో రెండు బస్సులు వచ్చాయి. ఆ రెంటిల్లో కండక్టర్లను అడిగాడు. వాళ్ళేమీ చెప్పలేకపోయారు.

మరో పావుగంట తర్వాత ఇంకో బస్సు వచ్చింది. ఆ బస్సు కండక్టర్ని అడిగాడు ప్రకాశం. అతను ఓ నిముషం ఆలోచించి, "అవును మీరు చెబుతుంటే జ్ఞాపకం వచ్చింది. నిజానికి గుర్తుండేవాళ్ళు కాదు. కాని పిల్లవాడికి టికెట్ దగ్గర పేచీ వచ్చింది. అందువల్ల గుర్తుంచుకున్నాను. వాళ్ళు ఆత్మకూరులో దిగిపోయారు"

చెప్పాడతను. ప్రకాశం మనసు ఆనందంతో, ఉద్వేగంతో ఎగిసి పడుతుంది.

"మళ్ళీ బస్సు ఎన్ని గంటలకు బయల్దేరుతుంది?" ఆతృతంగా అడిగాడు.

"ఇంకో అరగంటలో!"

అరగంట ఆరు యుగాలుగా గడిచింది ప్రకాశానికి.

బస్సు బయల్దేరింది.

ఒకటిన్నర గంట తర్వాత ఆత్మకూరులో ఆగింది బస్సు. బస్సు దిగి పిచ్చివాడిలా ఊరంతా గాలించాడు ప్రకాశం. నాని ఎక్కడా కన్పించలేదు. దాదాపు ఎనిమిది గంటల ప్రాంతంలో పోలీస్ స్టేషన్ కు వెళ్ళి వివరాలు చెప్పాడు.

ఇన్స్పెక్టర్ అంతా విని, "మాకూ రెండుగంటల క్రితమే ఆ ఇన్ఫర్మేషన్ వచ్చింది. వెంటనే మా మనుషుల్ని ఊర్లోకి పంపాను. అలాంటి వాళ్ళెవరూ తారసపడలేదు" అని ఓ నిముషం ఆగి "నాదో అనుమానం—మనల్ని తప్పుదారి పట్టించడానికి ఇక్కడ దిగి, ఇంకేదైనా బస్సు వస్తే అందులో వెళ్ళిపోయిందేమో!" అన్నాడు.

ప్రకాశానికి కూడా ఆ ఆలోచన సమంజసమే అన్పించింది. చేసేదేమీ లేక మరోసారి రిక్వెస్టుచేసుకొని, తిరుగు ప్రయాణం అయ్యాడు.

ఆ రాత్రి భార్యాభర్తలిద్దరూ భోజనం చెయ్యలేదు, నిద్రపోలేదు. సుమతిని పలకరిస్తేనే ఏడ్చేలా వుంది. అందుకే ప్రకాశం మాట్లాడించలేదు.

తెల తెలవారుతుండగా సుమతే అంది. "పోలీసులతో ఈ వ్యవహారం తేలేలోగా వాళ్ళు బాబును ఏం చేస్తారో?

ఒకసారి డిటెక్టివ్ కపర్థి గారితో మాట్లాడకూడదూ!"

ప్రకాశం తల వూపి బట్టలు మార్చుకొని బయటకు నడిచాడు.

# 3

"నీ పేరు?" అడిగాడతను.

"చెప్పను!"

నవ్వాడతను. "నీ పేరుతో నా కవసరంలేదు. అయినా తెల్సుకోవడం నా హాబీ. తెల్సుకోగలను కూడ!" అంటూ చకచక టెలిఫోన్ దగ్గరకు వెళ్ళి రిసీవర్ ఎత్తి, "జాన్! మన ఫ్రెండ్‌కు కనెక్షన్ ఇవ్వు!" అన్నాడు.

రెండు నిమిషాల తర్వాత ఫోన్‌లో మాట్లాడి వచ్చి అతనికెదురుగా నిలబడ్డాడు.

"జయంత్! సి. ఐ. డి. ఇన్స్‌పెక్టర్ జయంత్! అవునా? అంతేకాదు. నీకో తల్లి చెల్లెలు వున్నారు. నువ్వు దరిద్రంతో మాడుతున్నా వృత్తికి కట్టుబడిన గొప్ప నిజాయితీపరుడివి. నీ సేవానిరతకి మెచ్చి రాష్ట్ర ప్రభుత్వం రెండుసార్లు రాష్ట్రపతి పతకానికిగాను నీ పేరు సూచించింది."

"ఆపు!" అరిచాడు ఇన్స్‌పెక్టర్ జయంత్. "ఇవన్నీ నీ కెవరు చెప్పారు?"

నవ్వాడతను. "అది దేవ రహస్యం. ఆ విషయం అలా వుంచు. ప్రస్తుతం నీ పరిస్థితి ఏమిటో నీకు అర్థమై వుంటుందనుకుంటాను. ఆ కుర్చీలోంచి ఓ అంగుళం కూడ కదలలేవు. నిన్నెన్ని చిత్రహింసలు చేసినా బయట వాళ్ళకు ఎవ్వరికీ తెలియదు. నీ శవం కూడా ప్రపంచానికి కన్పించకుండా చేయగల సామర్థ్యత నాకు వుంది. కాబట్టి మర్యాదగా నువ్విప్పటివరకు మా గురించి సేకరించిన

విషయాలు చెబితే, దయతలచి వదిలేస్తాను. నిజం ఎందుకంటె .... నిన్ను వదిలినా నువ్వు నష్టం చేయలేవు గనుక చెప్పు. ఆ వివరాలేమిటి?"

జయంత్ అతనివైపు ఓసారి తీక్షణంగా చూశాడు. యాభైయేళ్ళుంటాయి అతనికి. హుందాగా, అధికారం, ధన గర్వంతో మదమెక్కినవాడిలా వున్నాడు.

జయంత్ అప్పటికీ మాట్లాడలేదు.

"శ్రీలతా!" అరిచాడతను. ఆ క్షణంలో అతని మొహం క్రూరంగా మారిపోయింది.

ఓ పాతికేళ్ళ యువతి చిన్న పెట్టెతో గదిలోకి వచ్చింది. ఆమెవైపు చూచి "ఊ!" అన్నాడతను.

జయంత్ కిలాంటివి కొత్త కాదు. ఊపిరి బిగబట్టి ఆమె చేయబోయే దానికోసం యెదురుచూడసాగాడు.

బాక్స్ తెరిచి, రెండు క్లిప్పులు, బ్లెయిడు బయటకు తీసింది. రెండు బుగ్గలకు క్లిప్పులు అతికించింది. చర్మం వొరుసుకొని క్లిప్పుకు రెండువైపులా చర్మం ఎత్తుగా లేచింది. ఆ తర్వాత బ్లెయిడ్ అందుకొని పెన్సిలు చెక్కుతున్నంత నిబ్బరంగా, నిదానంగా ఉబ్బిన బుగ్గ కండలు నిలువునా కోసింది.

భయంకరమైన మూలుగు. పెదాలు, ఊపిరి, బిగబట్టి కళ్ళు గట్టిగా మూసుకున్నాడు జయంత్. రక్తం ధారగా కారి పెదాల చివర ఉప్పగా తగిలింది. రెండో బుగ్గ మీద కూడ అలాగే చేసాక టింక్చర్ అంటించింది గాయంపైన.

పగవాడికి కూడా ఊహించకూడని నరకం అది. జయంత్ కి స్పృహ తప్పింది.

# 4

పోలీస్ జీపు వచ్చి రోడ్డు పక్కగా ఆగింది. ఇన్స్పెక్టర్ కాళి జీపులోంచి క్రిందకు దిగి టైం చూసుకున్నాడు. ఉదయం ఆరుగంటలు కావొస్తోంది.

ఇన్స్పెక్టర్ని చూడగానే అప్పటివరకు అక్కడ గుమిగూడిన జనం తప్పుకున్నారు. సార్జెంట్ ఎదురొచ్చి ఇన్స్పెక్టర్కు సెల్యూట్ చేసి దారి చూపించాడు.

కాళి ముందుకు నడిచాడు. ఎదురుగా ఓ శవం నేల మీద పడివుంది. శరీరమంతా గాయాలతో రక్తసిక్తమై ఉంది. పొట్టమీద నాలుగు కత్తిపోట్లు స్పష్టంగా కనిపిస్తున్నాయి. నేలమీద పచ్చిక రక్తంతో తడిసి గడ్డ కట్టింది.

ఆ శవం యెవరిదో చూడగానే తెల్లపోయింది. హాట్ తీసి చేతో పట్టుకొని ఓ క్షణం మౌనంగా నిలబడ్డాడు. అంతలోనే మరో వ్యాన్లో పోలీస్ డాక్టరు, వేలి ముద్రల నిపుణులు, ఫోటోగ్రాఫరూ దిగారు.

మామూలు తతంగం చకచక జరిగిపోయింది. శవాన్ని పోస్టుమార్టంకి తరలించాక ఇన్స్పెక్టర్ కాళి జీపెక్కాడు.

కాళికి తెలుసు ఇన్స్పెక్టర్ జయంత్ చిన్నపిల్లల అపహరణ కేసులో నిమగ్నమై వున్నాడని—ఆతను ఎలాంటి సహాయం అడిగినా తక్షణం అందివ్వమని కమీషనర్ దగ్గర్నుంచి ఆర్డర్స్ వచ్చాయి. కాని అంతలోనే ఈ ఘోరం. జయంత్ చాల సమర్ధుడని కాళికి తెలుసు. ఈ సంఘటనతో ప్రత్యర్ధులు ఎంతటి బలవంతులో అర్ధం అవుతోంది.

"అయామ్ డిటెక్టివ్ కపర్ది! మీ సహాయం కావాలి!" అడిగాడు కపర్ది.

"చెప్పండి!" అన్నాడతను కపర్దికి కుర్చీ చూపిస్తూ.

కపర్ది కుర్చీలో కూర్చొని అతనివైపు పరీక్షగా చూచాడు. యాభై యేళ్ళ పైనే ఉంటాయి. ఎర్రగా, ఎత్తుగా వున్నాడు.

"ఇఫ్ యు డోంట్ మైండ్, మే ఐ నో యువర్ నేమ్ ప్లీజ్!" కపర్ది అడిగాడు.

"నందనరావు. రిటైర్డు డిప్యూటీ కలెక్టర్!" చెప్పాడు.

కపర్ది తల వూపి, "మీ రీ మధ్య పేపర్లలో చదివే వుంటారు....నగరంలో పిల్లల అంతర్ధానం గురించి. ఆ విషయంలో మీ సాయం కావాలి!" అన్నాడు.

"తప్పకుండా! నే నేం చెయ్యాలో చెప్పండి!"

"ప్రస్తుతానికి మీ రేమీ చేయనవసరం లేదు. కొద్ది రోజులపాటు నాలుగయిదు గంటలసేపు మీ మేడమీద గదిలో నేను ఉండగలిగేందుకు యేర్పాట్లు చేయగలరా?" అడిగాడు కపర్ది.

"తప్పకుండా! కాని ఎందుకో తెలుసుకోవచ్చా?"

"సారీ! ప్రస్తుతం ఆ విషయం చెప్పలేను. నా అంచనా తప్పు కాకపోతే అన్ని వివరాలూ మీకు అప్పుడు చెబుతాను."

"నెవర్ మైండ్! ఏదో ఉత్సాహంకొద్దీ అడిగాను. ఓ పదినిమిషాలు కూర్చోండి. గది ఏర్పాటు చేయిస్తాను" అంటూ లోపలికి వెళ్ళాడు నందనరావు.

రెండు నిమిషాల తర్వాత కాఫీ వచ్చింది. కపర్ది కాఫీ

త్రాగి సిగరెట్ వెలిగించాడు. పది నిమిషాల తర్వాత నందనరావు వచ్చాడు.

"ప్లీజ్ కమ్!" అన్నాడు మేడమీదకు దారి తీస్తూ.

కపరి అనుసరించాడు.

చిన్న గది అది. శుభ్రంగా కడిగి ముగ్గులు వేసి వుంది నేలమీద. గదిలో ఒక పక్కగా షెల్ఫ్‌లో పుస్తకాలు వున్నాయి. గదిలో వీధివైపు కిటికీ ఉంది.

"ఇది మా అబ్బాయి చదువుకునే గది. మీ కోసం అతన్ని వేరే గదిలోకి పంపాను!" చెప్పాడు నందన రావు.

"థాంక్స్!"

నందనరావు వెళ్ళిపోయాక, కపరి తలుపులు మూసి కిటికీ దగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు. అక్కడ నుంచి వీధి స్పష్టంగా కనిపిస్తోంది. కిటికీ ఎదురుగా, వీధిలోనే కాన్వెంట్ స్కూల్ ఉంది.

కిటికీ తలుపులు కొద్దిగా మూసి ఆ సందులోంచి బయటకు చూస్తూ ఆలోచనలో పడ్డాడు కపరి.

ప్రకాశం తన దగ్గరకు వచ్చి సాయం కోరాక అతను చెప్పిందంతా విని, కమీషనర్‌తో మాట్లాడి ఈ పథకం రూపొందించాడు. ఎందుకంటే, ప్రకాశం చెప్పిన యువతి కోసం ఆత్మకూరు వెళ్ళి కూడా అంత ప్రయోజనం వుండక పోవచ్చు.

అంతే కాదు. ముఖ్యంగా నగరంలోని పిల్లలే మాయ మవుతుండడంవల్ల వాళ్ళ స్థావరం యిక్కడే వుంటుందనే అభిప్రాయం కలుగుతోంది. ఆమె కేవలం పోలీసులను తప్పుదారి పట్టించడానికే ఆత్మకూరు వెళ్ళి మళ్ళీ వెంటనే తిరిగి వచ్చివుండాలి.

అందుకే బాగా ఆలోచించి ఈ పథకం వేశాడు. తన లాగే ఓ ఇరవైమంది సి. ఐ. డి.లు ప్రతి ఎలిమెంటరీ స్కూలు, కాన్వెంటు దగ్గర ఇలాంటి ఏర్పాటు చేసుకొని గమనిస్తూ ఉంటారు. ఎవరైనా అనుమానాస్పద పరిస్థితులలో పిల్లలతో వెళుతూ కనిపిస్తే, వెంటనే ఆ విషయం టెలిఫోన్ ద్వారా గాని, మరేవిధంగానైనా సరే స్టేషనుకు తెలియజేసి ఆ వ్యక్తిని వెంబడిస్తాడు. ఇదీ పథకం.

కపరి వాచి చూచుకున్నాడు. శుక్రవారం ఉదయం తొమ్మిది గంటలయింది. సిగరెట్ త్రాగుతూ ఓపిగ్గా నిలబడ్డాడు.

గంట .... రెండు గంటలు .... స్కూలు వదిలారు. పిల్లలు ఒక్కొక్కరుగా, జట్లు జట్లుగా ఇళ్ళకు వెళుతున్నారు. అనుమానించదగిన రీతిలో అక్కడెవరూ కనిపించలేదు. పావుగంట తర్వాత అంతా వెళ్ళిపోయాక కపరి కదిలొంచి బయటకు వచ్చాడు.

నందనరావు హాల్లో కూర్చొని పేపరు చదువుతున్నాడు.

నందనరావుకు థాంక్స్ చెప్పి, మళ్ళీ రెండు గంటలకు వస్తానని చెప్పి, సెలవు తీసుకొని బయటకు వచ్చాడు కపరి.

కపరి స్టేషన్‌కు వచ్చేసరికి పదకొండున్నర అయింది. కాళీ వొక్కడే కుర్చీలో కూర్చొని ఫైలు తిరగేస్తున్నాడు.

"జయంత్ పోస్టుమార్టం రిపోర్టు వచ్చిందా?" కపరి అడిగాడు.

కాళీ తల వూపి రిపోర్టు అందించాడు.

శవపరీక్షకు నాలుగయిదు గంటలముందు హతుడి మరణం సంభవించి వుండవచ్చని, కడుపులో పదునైన కత్తితో పొడిచిన గాయాలు వుండడంవల్ల, హతుడు బలిష్టుడైనా రక్తం యెక్కువగా పోవడంవల్ల, గాయాలు తగిలిన కొద్ది నిమిషాలలోనే ప్రాణం పోయి వుండవచ్చని, మరణానికి ముందు హతుడు చిత్రహింసలకు గురైనట్లుగా ఉంది రిపోర్టులో.

కపర్ది రిపోర్టు తిరిగి ఇచ్చేస్తూ "మీ 'స్క్వాడ్'అంతా వచ్చారా?" అడిగాడు.

"ఒక్క 'రవికాంత్' తప్ప మిగతా అంతా రిపోర్టు యిచ్చి వెళ్ళారు. విశేషాలు యేమీ లేవు!" చెప్పాడు కాళి.

కపర్ది టైం చూచుకున్నాడు. పదకొండూ నలభై. ఒక్క క్షణం ఆలోచనతో కపర్ది భృకుటి ముడిపడింది.

"రవికాంత్! ఎందుకు రాలేదతను? మన ఇన్‌స్ట్రక్షన్స్ ప్రకారం పదకొండుంబావు లోపల రిపోర్టు యివ్వాలి. అనుమానాస్పద పరిస్థితులలో టెలిఫోన్ చెయ్యాలి. ఈ రెండూ ఎందుకు చేయలేదతను?" ఓ క్షణం ఆగి "అతని స్పాట్ ఎక్కడ?" అడిగాడు

కాళి టేబులు సొరుగులోంచి ఓ కాగితం తీసి చదివి "గాంధీ స్టాట్యూ! ఇక్కడికి దగ్గరే! అయిదు నిమిషాల నడక" అన్నాడు.

కపర్ది లేచి నిలబడ్డాడు. "మనం ఓసారి వెంటనే అక్కడికి వెళ్ళాలి!"

"మీరేదైనా అనుమానిస్తున్నారా?" కాళి లేచి నిలబడుతూ అడిగాడు.

"అవును. నేను వాళ్ళందరికీ స్ట్రిక్ట్ ఇన్‌స్ట్రక్షన్స్

ఇచ్చాను. రవికాంత్ అనుభవం లేనివాడు కాదు. ఏదో జరిగి ఉండాలి. అందుకే అతను రిపోర్టు యివ్వలేక పోయాడు" చక చక బయటకు నడుస్తూ చెప్పాడు కపర్ది.

ఇద్దరూ జీపులో 'గాంధీ స్టాట్యూ' దగ్గరకు వచ్చారు. అక్కడ ఓ మున్సిపల్ ఎలిమెంటరీ స్కూల్ ఉంది.

రవికాంత్ తన పరిశోధనకు ఏ యింట్లోకి వెళ్ళింది వాళ్ళకు తెలియదు. అది వాళ్ళ అనుకూలతనుబట్టి యేర్పాటు చేసుకోవాలని నిర్ణయం. కాని ఓ చిన్న గుర్తుంది.

కపర్ది, సెంటర్లో నిలబడి చుట్టూ చూశాడు. చుట్టూ ఎత్తైన బిల్డింగులు. స్కూలు గేటునుంచి రెండువైపుల దగ్గర్లో ఎత్తైన బిల్డింగులు ఉన్నాయి. మూడోవైపు రహదారి. అటువైపు అవకాశం లేదు.

కపర్ది ఒక్కో యిల్లూ పరీక్షగా చూస్తూ నడవ సాగాడు. కాళీ మౌనంగా అనుసరించసాగాడు. కపర్ది ఓ యింటి ముందు ఆగి సింహద్వారం గోడను పరీక్షగా చూచి, "ఇదే మనకు కావలసిన యిల్లు. రవికాంత్ యిందులోకే వెళ్ళాడు" అన్నాడు లోపలికి దారితీస్తూ.

"ఎవరు కావాలి?" తోటమాలి కాబోలు అడిగాడు.

"మీ అయ్యగారు లోపల ఉన్నారా?" అడిగాడు కాళీ.

"ఉన్నారు! వెళ్ళండి!" అన్నాడు తన పనిలో నిమగ్నమౌతూ.

ఇద్దరూ లోపలికి నడిచారు. విశాలమైన హాలు. హాలు

రెండువైపుల నుంచి మేడమీదకు మెట్లు. కలర్ పెయింటింగ్స్‌తో, ఖరీదయిన ఫర్నిచర్‌తో అధునాతనంగా అందంగా ఉంది.

హాల్లో మెట్లదగ్గర ఓ వ్యక్తి సోఫాలో కూర్చొని ఏదో పుస్తకం చదువుతున్నాడు.

"ఎవరు కావాలి?" అడిగాడతను యిద్దర్నీ చూడగానే.

కపరి విష్ చేసి, "మీతో కొంచెం మాట్లాడాలి!" అన్నాడు.

"రండి! కూర్చోండి!" ఆహ్వానించాడు.

ఇద్దరూ అతని కెదురుగా కుర్చీల్లో కూర్చున్నారు.

"నా పేరు కపరి! ఈయన ఇన్‌స్పెక్టర్ కాళీ" పరిచయము చేసుకొని "మీ పేరు?" అడిగాడు.

"భయంకర్!" చెప్పాడతను.

"వెల్ మిస్టర్ భయంకర్! ఈ రోజు ఉదయం ఎనిమిది, తొమ్మిది మధ్య ఎవరైనా వచ్చి మీ యింట్లో ఆశ్రయం అడిగారా?" అడిగాడు కపరి.

"సారీ! మీరు చెప్పేది నాకు అర్థం కావడంలేదు. ఎవరో వచ్చి నా యింట్లో ఆశ్రయం అడగడం ఏమిటి? ఉదయం నుంచి ఇక్కడికి ఎవరూ రాలేదు" చెప్పాడు భయంకర్ గంభీరంగా.

కపరి మొహం బిగుసుకుంది. "ఓ.కె! మీ కేటువంటి అభ్యంతరం లేకపోతే మీ మేడమీద గది ఓసారి పరిశీలించవచ్చా!" అన్నాడు మర్యాదగా.

"నాన్సెన్స్! ఏమిటి మీరనేది? నా ఇల్లు సెర్చ్ చేస్తారా? ఎందుకు? వారెంట్ వుందా?" ఆవేశంగా అరిచి ఓ నిమిషం తర్వాత "ఇలాంటి అర్థంలేని ప్రశ్నలతో

నా టైం వేస్టుచేయకండి! ప్లీజ్ గెటవుట్!" సౌమ్యంగా అన్నాడు.

కపరి కోపంగా కాలిని నేలకేసి కొట్టి లేచి నిలబడ్డాడు. ఇద్దరూ బైటకు వచ్చారు.

"రవికాంత్ ఏ ఇంట్లోకి వెళ్ళాడో ఎలా తెలుస్తుంది?" కాళి అడిగాడు.

"రవికాంత్ ఈ ఇంట్లోకే వెళ్ళాడు. అదిగో ఆ గోడమీద గోరుతో గీచిన × గుర్తు వుంది చూశారా? అది మాకు సంకేతం. ఇలాంటి పరిస్థితి ఏదైనా సంభవిస్తే ఎవరు ఏ ఇంట్లోకి వెళ్ళింది తెల్సుకోడానికి వీలుగా ఇలాంటి గుర్తు ఒకటి వుండాలని రవికాంత్ ప్రతిపాదించాడు. రవికాంత్ నిస్సందేహంగా ఈ ఇంట్లోకి వెళ్ళాడు. భయంకర్ అబద్ధం చెబుతున్నాడు!" అన్నాడు కపరి.

"మరి ఎలా తెల్సుకోవడం. ఇల్లు వెదకాలంటే సెర్చ్ వారెంట్ కావాలి. మేజిస్ట్రేట్ కు ఏం కారణం చెబుతాం! అదీగాక చాల టైం పడుతుందేమో!" అన్నాడు కాళి అనుమానంగా.

కపరి సిగరెట్ వెల్గించి ఓ నిమిషం ఆలోచించి, "ఓ. కె! ఆ విషయం నేను చూసుకుంటాను. నువ్వెళ్ళి జీపు దగ్గర వుండు. ఓ పావుగంటలో వస్తాను" అన్నాడు.

కాళికి అర్థం అయింది. మాట్లాడకుండా వెళ్ళి జీపు దగ్గర నిలబడ్డాడు.

కపరి సిగరెట్ విసిరేసి లోపలికి నడిచాడు.

"మీరా? మళ్ళీ ఎందుకొచ్చారు?" కోపంగా అడిగాడు భయంకర్.

కపర్థి నవ్వి "ఇప్పటికైనా నిజం చెబుతారని!" అన్నాడు.

భయంకర్ కోపంగా లేచి నిలబడి ఏదో అరవబోయాడు. నోట మాటరాలేదు. ఎదురుగా కపర్థి చేతిలో రివాల్వర్ మెరుస్తుంది.

"ఏమిటిది?" కోపంగా అడిగాడు.

"సెర్చ్ వారెంట్! మాట వినకపోతే ఇదే డెత్ వారెంట్ అవుతుంది. వెకిలి వేషాలు వెయ్యకుండా చెప్పినట్లు చెయ్యి. ఇంకా ఇంట్లో ఎవరెవరున్నారు? అందర్నీ పిలువ్!"

"ఇంకెవ్వరూ లేరు. నేనొక్కడ్నే! భార్యా పిల్లలు ఊరెళ్ళారు!" నెమ్మదిగా అన్నాడు.

కపర్థి తలుపులు మూసి, "గుడ్! మేడమీదకు పద!" ఆజ్ఞాపించాడు.

భయంకర్ మౌనంగా మేడమీద గదిలోకి దారి తీసాడు. గదిలో దుమ్ము పేరుకొని వుంది. గదిలో కిటికీ దగ్గర బూటు ముద్రలు వున్నాయి. కపర్థి పరీక్షగా చూశాడు. అక్కడ ఇంకా రెండు మూడు జతల అడుగులు గజిబిజిగా వున్నాయి.

"ఇప్పుడు చెప్పు! రవికాంత్ అనే వ్యక్తి నీ ఇంటికి వచ్చి ఈ గదిలో వుంటానని అడిగాడు. ఇక్కడ కొంతసేపు వున్నాడు కూడ. అతనెక్కడికి వెళ్ళాడు? చెప్పు!" గద్దించాడు కపర్థి.

"నిజం! నాకేమీ తెలియదు. అతనికి తెల్సు" చేత్తో చూపించాడు.

కపర్థి వెనక్కి తిరిగి చూసి మరుక్షణం అదిరిపడి తల తిప్పాడు. అతను టెర్రస్ వైపు పరుగెత్తుతున్నాడు.

"భయంకర్! ఆగు! లేదా కాల్చేస్తాను!" అరిచాడు.

భయంకర్ ఆగలేదు. వేగంగా పరుగెత్తి టెర్రస్ మీద ఎక్కి క్రిందకు దూకాడు. మరుక్షణం బ్రహ్మాండమైన ఆర్తనాదం.

కపరి పరుగెత్తుకొచ్చి క్రిందకు చూశాడు. రక్తపు మడుగులో వెల్లకిలా నడిరోడ్డులో పడివుంది శవం. ఇన్స్పెక్టర్ కాళి శవం దగ్గరకు పరుగెత్తుతున్నాడు.

కపరి చకచక క్రిందకు దిగి వచ్చాడు.

"ఏమయింది? ఎందుకితను క్రిందకు పడ్డాడు? రవికాంత్ దొరికాడా?" ఆతృతగా అడిగాడు కాళి.

కపరి పెదవు విరిచి, "రవికాంత్ ఈ ఇంట్లోనుంచే అంతర్ధానమయ్యాడు. ఆ విషయం అడుగుతుంటే నిజం చెప్పడానికి భయపడి ఇలా ప్రాణాలు తీసుకున్నాడు" నిట్టూర్చాడు.

కాళి శవంవైపొకసారి చూసి టెలిఫోన్ బూత్ వైపు నడిచాడు.

# 6

అతను గదిలో అసహనంగా పచార్లు చేస్తున్నాడు. అతని మొహంలో విసుగు కోపం కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి.

"డామిట్! ఆ కపరిగాడివల్ల మన భయంకర్ చనిపోయాడు. వాడ్నిక ప్రాణాలతో వుంచకూడదు" అంటూ వెనక్కి తిరిగి "లతా! జాగ్రత్త! ఆ కపరి కంటపడ్డావా నిన్నూ పరలోకానికి పంపిస్తాడు. నేను జానీ, డేవిడ్‌లను పంపిస్తాను. వాళ్ళు కపరిని ఏదో చేసేలోగా నువ్వు కాస్త జాగ్రత్తగా వుండు" హెచ్చరించాడు.

శ్రీలత తల వూపి బయటకు వచ్చింది. కారు డ్రైవర్

డోర్ తెరిచిపట్టుకున్నాడు. శ్రీలత కూర్చుని "అలంకార్ పాస్" అంది.

కారు కదిలింది. పదినిమిషాల తర్వాత కారు అలంకార్ థియేటర్‌కు కొద్ది దూరంలో వీధి మలుపులో చీకట్లో ఆగింది. ఆమె క్రిందకు దిగి చకచక థియేటర్‌లోకి నడిచింది.

ఏడు గంటలు కావొస్తుంది. పౌరాణిక సినిమా, అందులోనూ పెద్దది కావడంవల్ల మొదటి ఆట అప్పుడే మొదలుపెట్టారు. శ్రీలత ఓ పక్కగా నిలబడి అందర్నీ గమనిస్తుంది.

టిక్కెట్లు అయిపోయినట్లున్నాయి. కొందరు వెనక్కి తిరిగి పోతున్నారు.

పదేళ్ళ కుర్రాడు వెనక్కి తిరిగిపోతూ కన్పించాడు.

"బాబూ!" పిలిచింది నెమ్మదిగా.

ఆ కుర్రాడు దగ్గరకు వచ్చాడు.

"నాకో టిక్కెట్టు తెచ్చిపెడతావా?" అడిగింది డబ్బులు తీస్తూ.

"లేవు. అన్నీ అయిపోయాయి!" చెప్పాడు కుర్రాడు.

శ్రీలత నిట్టూర్చి "పక్క హాలులో ఏ సినిమా?" అడిగింది.

"దొంగలకు దొంగ."

"నీకూ టిక్కెట్టు దొరకలేదుగా! అక్కడికే వెళుతున్నావా?"

తల వూపాడు కుర్రాడు.

"అయితే రా! నేనూ ఆ సినిమాకే వెళుతున్నాను. నా కారులో వెళదాం! ఇప్పటికే టైం అయిపోయింది" గబగబా నడుస్తూ అంది.

కారులో వెళదాం అనేసరికి కుర్రాడికి సరదా వేసింది. ఆనందంగా ఆమెను అనుసరించాడు. అంతలో వినిపించింది "శ్రీలతా!" అని.

ఆమె ఉలిక్కిపడి వెనక్కి తిరిగింది. అది ఆమె ఊహించుకోలేదు. కొద్ది దూరంలో ఓ యువతి వస్తూ కన్పించింది. ఆ సమయంలో ఎవరో తెల్సినవాళ్ళు కన్పించడం ఆమెకి భయం కల్గించింది. మాట్లాడకుండా చకచక కారు దగ్గరకు నడిచింది.

ఆ యువతి కారు దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చింది. అప్పటికే ఆమె కుర్రాడితో కారులో కూర్చుంది.

"శ్రీలతా! రాంజీ కంపెనీలో నీకా ఉద్యోగం వచ్చిందా?" ఆత్రుతగా తల లోపలికి పెట్టి అడుగుతూ, పక్కనే వున్న కుర్రాడ్ని చూసి ఆశ్చర్యపోయి, "నువ్వా! నారాయణా!" అంది ఆశ్చర్యంగా.

శ్రీలత ఆలోచించలేదు. హాఠాత్తుగా బ్యాగ్ లోంచి రివాల్వర్ తీసి కాల్చింది. దానికి సైలెన్సర్ ఉండడంవల్ల పెద్దగా శబ్దంకాలేదు.

పెద్ద కేకతో వెనక్కి పడిపోయిందా అమ్మాయి. కారు వేగంగా ముందుకు కదిలింది.

అప్పుడే అటుగా వెళ్తున్న కుర్రాడు అరుపు వినిపించి అక్కడికి వచ్చాడు. మసక చీకట్లో ఓ యువతి కొన వూపిరితో మూల్గుతుంది.

"ఏమండీ! ఎవరు మీరు? ఏమైంది!" ఆత్రుతగా అడిగాడు.

"శ్రీలత....నారాయణ!" చిన్నగా చెప్పింది అంతే! ఆ తర్వాత మాట్లాడలేదు. తల వాల్చేసింది.

ఆ కుర్రాడు భయంతో లేచి నిలబడ్డాడు. చేతుల

కంటిన రక్తం జిగటగా తగిలింది. చేతులపై వొకసారి చూసుకొని, చకచక టెలిఫోన్ బూత్ వైపు నడిచాడు.

7

"మా అబ్బాయి విషయం ఏమీ తెలియలేదా?" ప్రకాశం అడిగాడు కుర్చీలో కూర్చుంటూ.

కపర్థి పెదిమ విరిచి "లేదు. అదే ప్రయత్నం మీద వున్నాం. ఇంతవరకు ఎలాంటి ఆచూకీ దొరకలేదు" చెప్పాడు.

"ఇందులో విదేశీయుల హస్తం వుందేమో?" భయంగా అడిగాడు. అందుకు కారణం వుంది. ఇది విదేశీయుల పనే అయితే ఈ పాటికి పిల్లలందర్నీ విదేశాలకు పంపి వుంటారని ప్రకాశం భయం.

కపర్థి నవ్వి "పేపర్లలో వాళ్ళు వీళ్ళు చెప్పే మాటలు విని కంగారు పడకండి! ప్రస్తుత పరిస్థితుల మీదనుంచి మన దృష్టి మళ్ళించడానికి ఎంతో మంచి ఇలాంటి మాటలు చెప్పడం అలవాటయిపోయింది. స్వదేశీయులకు ధనాశ స్వార్థం లేకపోతే కదా విదేశీయులకు ప్రమేయం వచ్చేది!" అన్నాడు.

ప్రకాశం నిట్టూర్చి "మీమీద కొండంత ఆశ పెట్టుకున్నాను!" మెమ్మదిగా.

"నేనూ మనిషినే! నేను చేయగల్గింది శక్తివంచన లేకుండా చేస్తాను. ఆపైన ధర్మం మనవైపు వుంది. ధర్మానికి, న్యాయానికి ఎప్పుడూ అపజయం కలగదు" ధైర్యం చెప్పాడు కపర్థి.

ప్రకాశం ఏదో మాట్లాడబోయాడు. టెలిఫోన్ మ్రోగింది.

కపర్థి రిసీవర్ అందుకొని రెండు నిముషాలపాటు

అవతలివైపునుంచి మాటల్ని విని రిసీవర్ పెట్టేసి లేచి నిలబడ్డాడు.

"ఏదైనా విశేషం తెల్సిందా?" ఆతృతగా అడిగాడు ప్రకాశం.

"లేదు. శవం మాత్రం దొరికింది. అయినా నిరుత్సాహపడకూడదు. ఒక్కోసారి శవాలు కూడ దారి చూపిస్తాయ్!" బయటకు నడుస్తూ అన్నాడు.

ప్రకాశం, కపర్థి దగ్గర సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

పావు గంట తర్వాత అలంకార్ థియేటర్ దగ్గర కారాపి క్రిందకు దిగాడు కపర్థి. ఇన్ స్పెక్టర్ కాళి ఎదురొచ్చి, "మా కార్యక్రమాలన్నీ పూర్తయ్యాయి. మీకోసమే ఎదురుచూస్తున్నాం" చెప్పాడు.

కపర్థి కారు దిగి శవం దగ్గరకు నడిచాడు.

సెర్చిలైట్ల కాంతిలో భయంకరంగా వుంది శవం. ఛాతీ మీద గాయాలతో కారిన రక్తం క్రింద గడ్డ కట్టింది.

"ఎవరీమె?" అడిగాడు.

ఇన్ స్పెక్టర్ పెదిమ విరిచి "తెలియదు. ఇంతవరకూ యెవ్వరూ శవాన్ని గుర్తుపట్టలేదు. ఇక ఈ రాత్రికి లాభం లేదు. ఉదయం పేపర్లలో ప్రకటన వేయించాలి" అని ఓ కుర్రాడివైపు చూపిస్తూ "ఇతని పేరు రమేష్! ఇతనే మాకు ఇన్ఫర్మేషన్ ఇచ్చింది!" చెప్పాడు.

కపర్థి అతనివైపు తిరిగి, "అసలు జరిగిందేమిటో విపులంగా చెప్పండి" అన్నాడు.

రమేష్ అంతా చెప్పి, "ఎవరు మీరు?" అని అడిగితే, "శ్రీలత.... నారాయణ" అని చెప్పి తల వాల్చేసింది అన్నాడు.

"అంటే ఆమె పేరు శ్రీలత అయివుంటుందని, ఆమెను హత్య చేసినతను 'నారాయణ' అయివుంటాడని అనుకోవచ్చు!" అన్నాడు శాలి.

కపర్ధి తల ఊపి, "మీరు స్టేషన్ కు వెళ్ళగానే అన్ని పోలీస్ స్టేషన్స్ కు ఫోన్ చేసి, వాళ్ళ అమ్మాయి కన్పించడం లేదని ఎవరైనా కంప్లైంట్ ఇచ్చారేమో తెల్సుకోండి! అందువల్ల ఈమె వివరాలు మరింత త్వరగా తెలిసే అవకాశం ఉంది" అన్నాడు ముందుకు నడుస్తూ.

ఇన్ స్పెక్టర్ శాలి సిబ్బందికి సైగ చేశాడు. శవాన్ని పోస్టుమార్టంకి తరలించసాగారు.

## 8

"ఇంత దారుణం ఎలా జరిగిందో నాకు అర్థంకావడం లేదు ఇన్ స్పెక్టర్! నిన్న సాయంత్రం స్నేహితురాలి ఇంటికి వెళ్ళి వస్తానని వెళ్ళింది. కాని వాళ్ళింటికి వెళ్ళనే లేదట. ఉదయం ఆరు దాటినా రాకపోయేసరికి కంగారు పడి పోలీసు రిపోర్టు యివ్వడానికి వెళ్ళే వాళ్ళు యిక్కడికి పంపారు....ఉదయానే యింత ఘోరం చూడవలసి వస్తుందని, నిన్న సాయంత్రం నవ్వుతూ వెళ్ళిన నా బిడ్డ తెల్లవారేసరికి ఇలా అవుతుందని కలలో కూడా అనుకోలేదు!" దుఃఖంతో అతని కంఠం రుద్ధమయింది.

ఇన్ స్పెక్టర్ శాలి రెండు నిమిషాలు మాట్లాడలేదు. అతను శాస్త కురుటపదేవరకు మౌనంగా ఉండి అడిగాడు "మీ అమ్మాయి పేరు 'సునంద' అని చెప్పారు కదా! మరి శ్రీలత ఎవరు?"

అతను తల ఊపి, "నాకు తెలియదు! నాకు తెల్సినంత వరకు ఆ పేరుగల స్నేహితురాలు కూడ మా అమ్మాయికి లేదు!" అన్నాడు.

అంతలోనే కపరి చక చక లోపలికి వచ్చాడు.

"ఈయన డిటెక్టివ్ కపరి!"

"ఈయన నారాయణరావు. రాత్రి మనం చూచిన శవం వీళ్ల అమ్మాయి సునందది" పరిచయం చేశాడు శాలి.

"మీ అమ్మాయి పేరు సునందా?" ఆశ్చర్యంగా అడిగాడు కపరి.

నారాయణరావు తల వూపాడు.

"శ్రీలతను గురించి అడిగాను. ఆమె ఎవరో తెలియదట" శాలి చెప్పాడు.

కపరి తల ఊపి, "నారాయణ! నారాయణ ఎవరు?" అడిగాడు.

నారాయణరావు ఆశ్చర్యపోయి, "నా పేరు నారాయణరావు. మరి ఇంక నారాయణ ఎవరు?" ఓ నిమిషం ఆలోచించి "అవును. మా యింటి పక్కనే గోవిందరావని ఉంటున్నాడు. వాళ్లబ్బాయి పేరు కూడ నారాయణ. ఏం?" అడిగాడు.

కపరి లేచి "పదండి. అతనితో మాట్లాడుదాం!" అన్నాడు.

ముగ్గురూ జీపులో గోవిందరావు యింటి ముందు దిగారు.

నారాయణరావు తూలుతున్నవాడిలా వడివడిగా తన యింట్లోకి నడిచాడు.

కపరి వారించలేదు.

ఓ నిమిషం తర్వాత నారాయణరావు ఇంట్లోంచి పెద్దగా ఏడుపులు వినిపించాయి.

ఇద్దరూ చిన్నగా నిట్టూర్చి గోవిందరావు ఇంట్లోకి

నడిచారు.

నలభై ఏళ్ళ వ్యక్తి ఎదురొచ్చి, "ఇన్‌స్పెక్టర్ గారా! రండి! రండి! యేం జరిగింది?" ఆదుర్దాగా అడిగాడు.

"మీ అబ్బాయి పేరు నారాయణా?" కపర్థి అడిగాడు.

"అవును! ఏం? వాడేదయినా తప్పు పని చేశాడా?" కంగారుగా అడిగాడు.

"ఓసారి అతన్ని పిలవండి!" కాళీ అన్నాడు.

గోవిందరావు ఆశ్చర్యపోయి "వాడా! వాడింకా ఇంటికి రాలేదు. నేను వాడికోసం ఆదుర్దాపడుతుంటే మీరు వచ్చారు. మిమ్మల్ని చూచి, వాడేదైనా తప్పుడు పని చేస్తే జైల్లో పెట్టారేమో అని భయపడుతున్నాను" అన్నాడు.

కాళీ ఆశ్చర్యపోయి "మీ అబ్బాయి ఎప్పటినుంచి కనిపించడంలేదు?" అడిగాడు.

"నిన్న సాయంత్రం సినిమాకు వెళతానని వెళ్ళాడు. ఇంతవరకూ రాలేదు. వాడికి కాస్త చెడు సావాసాలు ఎక్కువ. అందుకే మిమ్మల్ని చూచి ఆశ్చర్యపోయాను. ఇంతకీ అసలు ఏం జరిగింది?" ఆదుర్దాగా అడిగాడు.

"అదే ఇప్పుడు తెలుసుకోవాలి!" అన్నాడు కపర్థి లేచి నిలబడుతూ.

"అంటే?"

కాళీ జరిగిందంతా వివరించాడు.

గోవిందరావు దంపతులు ఏడుపు లంకించుకున్నారు.

ఇద్దరూ వాళ్ళకు ధైర్యం చెప్పి బయటకు వచ్చి నారాయణరావు ఇంటివైపు నడిచారు.

అప్పటికే చుట్టుపక్కలవాళ్ళు చాలమంది మూగారు. నారాయణరావు దంపతుల దుఃఖం ఆప శక్యం కావడం లేదు. చెట్టంత కూతురు దారుణంగా మరణిస్తే ఆ తల్లి తండ్రుల దుఃఖం ఎవరాపగలరు?

చాలా సేపు యిద్దరూ మౌనంగా వుండిపోయారు. ముందుగా నారాయణరావే తేరుకున్నాడు. ఇద్దరికి కుర్చీలు చూపించి "కూర్చోండి!" అన్నాడు భారంగా.

"మిమ్మల్నీ పరిస్థితులలో ప్రశ్నించడం భావ్యం కాదు. కాని మీ అమ్మాయిని అంత దారుణంతా హత్య చేసిన హంతకులను పట్టుకోవాలంటే మీరు సహకరించక తప్పదు. అంతేకాదు. గోవిందరావుగారి అబ్బాయి కూడా అపహరించబడ్డాడని అనుమానంగా వుంది. అంటే యీ మధ్య జరుగుతున్న పిల్లల అపహరణకు—మీ అమ్మాయి హత్యకు యేదో సంబంధం వుండి వుండాలనిపిస్తోంది. దయచేసి, మీ అబ్బాయిని ఓసారి పిలవండి!" అన్నాడు కపర్థి.

నారాయణరావు మాట్లాడకుండా లోపలికి వెళ్ళి కొడుకును వెంటబెట్టుకొచ్చాడు. పదిహేడు సంవత్సరా లుంటాయి ఆ అబ్బాయికి. బాగా ఏడ్చి ఏడ్చి మొహం ఉబ్బిపోయింది.

"అలా కూర్చో!" అని "నీ పేరేమిటి?" అడిగాడు కపర్థి.

"శేఖరం!" చెప్పాడా కుర్రాడు.

"మీ అక్కయ్య స్నేహితురాళ్ళందరూ నీకు తెలుసా?"

"ఎంతమంది ఉన్నారో తెలియదు. ఏడెనిమిదిమంది మాత్రం తెలుసు!" చెప్పాడు శేఖరం.

"శ్రీలత అనే స్నేహితురాలు గురించి మీ అక్కయ్య చెప్పగా ఎప్పుడైనా విన్నావా?"

"శ్రీలతా?....అలాంటి పేరు నేను యింతకు ముందు వినలేదు. మా అక్కయ్యకు శ్రీలత అనే స్నేహితురాలు లేదనుకొంటాను!"

"బాగా గుర్తు తెచ్చుకో!"

శేఖరం చాలాసేపు ఆలోచించి, "లేదు! నాకు గుర్తున్నంతవరకూ ఆ పేరు వినడం యిదే మొదలు!" అన్నాడు.

కపర్థి తల ఊపి, "మీ అక్కయ్య....నారాయణ కలిసే వెళ్ళారా?"

"లేదు. మా అక్కయ్య సాయంత్రం అయిదుగంట లప్పుడు వెళ్ళింది. ఆరుగంటలు దాటాక సినిమాకు వెళతా నని వెళ్ళాడు!" అన్నాడు శేఖరం.

"నారాయణ కెన్నేళ్ళు?"

"పదేళ్ళు!" చెప్పాడు శేఖరం.

కపర్థి ఇంకేం అడగలేదు. నారాయణరావు దంపతు లకు ధైర్యం చెప్పి బయటకు వచ్చారు.

జీపు దగ్గరకు వచ్చాక జ్ఞాపకం వచ్చింది కపర్థికి. వెంటనే శేఖరాన్ని పిలిచి, సునంద స్నేహితురాళ్ళ పేర్లు, వాళ్ల అడ్రస్సులు వ్రాయించి తీసుకున్నాడు.

"ఇప్పుడెక్కడికి?" కాళి అడిగాడు.

"స్టేషన్‌కు!" కపర్థి జీపెక్కాడు.

# 9

"మీరు చెప్పినట్లే మా మనుష్యుల్ని పంపించి సునంద స్నేహితురాళ్ళందరి దగ్గర శ్రీలత గురించి ఎంక్వైరీ చేయించాను. సునందకు అలాంటి పేరు గల స్నేహితు

రాళ్ళెవ్వరూ లేరని తేలింది!" చెప్పాడు ఇన్ స్పెక్టర్ కాళి.

కపర్ది తల వూపి, "మనం పొరపడ్డామేమో! సునందకు శ్రీలత స్నేహితురాలు కాకపోవచ్చు. కాస్త ముఖ పరిచయం వున్న మనిషి కావచ్చు. లేదా శ్రీలత కూడా నారాయణలాగా అపహరించబడ్డ అమ్మాయి కావచ్చు!" అన్నాడు.

"కాని నిన్నటి నుంచి అలాంటి రిపోర్టు మా కేమీ అందలేదు" పాలోచనగా అన్నాడు ఇన్ స్పెక్టర్.

"సునంద యేదైనా ఉద్యోగం చేస్తుందేమో?" హాఠాత్తుగా అడిగాడు కపర్ది.

"ఎందుకు?"

"ఉద్యోగరీత్యా శ్రీలత సునందకు పరిచయం అయి వుండవచ్చు కదా? ఆ విషయం ముందు తెలుసుకో! ఎందుకంటే, శ్రీలత సునందకు ముఖ పరిచయం వున్న మనిషైతే, ఉద్యోగరీత్యా పరిచయమో, లేక ఎక్కడైనా షాపింగులోనో, ఎగ్జిబిషన్ లోనో పరిచయం అయి వుండవచ్చు. ఏమంటావ్?" అడిగాడు కపర్ది.

కాళి తల ఊపి, టెలిఫోన్ డైరెక్టరీ తీసి, గోవిందరావు నెంబరు తెల్సుకొని, ఫోన్ చేసి, నారాయణరావును పిలిపించమని చెప్పాడు.

రెండు నిమిషాల తర్వాత నారాయణరావు స్వరం వినిపించింది అవతలినుంచి.

"హల్లో! నారాయణరావుగారా! నేను ఇన్ స్పెక్టర్ కాళిని మాట్లాడుతున్నాను. మీ అమ్మాయి ఏదయినా ఉద్యోగం చేస్తూ ఉందేదా?" అడిగాడు.

"ఉద్యోగమా? అలాంటిదేం లేదు! అసలు మా

అమ్మాయి ఉద్యోగం చేయడం నా కిష్టం లేదు. బి. ఏ. పూర్తిచేసింది కదా! త్వరలోనే పెళ్ళి చేద్దాం అనుకున్నాను. కాని ఈమధ్య నేను క్యాంపు వెళ్ళినప్పుడు నాకు తెలియకుండా ఏదో ఇంటర్వ్యూకు వెళ్ళివచ్చిందట. నాకు తెలిసి చీవాట్లు పెట్టాను. అప్పటినుంచి ఆ ప్రయత్నం మానుకుంది!" నారాయణరావు చెప్పాడు.

కాళి మౌత్ పీస్ చేతో మూసి ఆ విషయం కపర్దికి చెప్పాడు. కపర్ది ఆసక్తిగా ముందుకు వంగి, "ఆమె ఇంటర్వ్యూకి వెళ్ళిన కంపెనీ ఏదో అడుగు!" అన్నాడు.

కాళి అడిగాడు.

"సారీ! ఆ కంపెనీ పేరు నాకు తెలియదు. మా శేఖరానికి తెలిసి వుండవచ్చు. అడిగి చెబుతాను" అన్నాడు.

రెండు నిముషాల తర్వాత నారాయణరావు చెప్పాడు 'రాంజీ కంపెనీ' అట అని.

కాళి థాంక్స్ చెప్పి ఫోన్ పెట్టేశాడు.

# 10

"పసిపిల్లల అపహరణ కేసులో పోలీసులు ఏమీ చెయ్యలేకపోతున్నారని పత్రికలు దుమ్మెత్తి పోస్తున్నాయి!" చెప్పాడు ఇన్‌స్పెక్టర్ కాళి.

"మంచిదే! పత్రికలు ప్రజలకు ప్రతిబింబాలు. అవి దుమ్మెత్తిపోస్తేగాని యెవ్వరూ సమర్ధవంతంగా, నిజాయితీగా పని చెయ్యలేరు. అవి దుమ్మెత్తి పోస్తున్నాయని కోపగించుకుంటే అది మన అసమర్ధతను, అవివేకాన్ని చాటుతుంది" కపర్ది అన్నాడు.

"కమీషనర్ దగ్గర్నుంచి వార్నింగ్ వచ్చింది!"

"అవన్నీ పట్టించుకోకూడదు. చిత్తశుద్ధితో పని చెయ్య

డమే మన లక్ష్యం. పద! రాంజీ కంపెనీకి వెళ్ళివద్దాం!"
అన్నాడు కపర్థి లేస్తూ.

పావుగంట తర్వాత రాంజీ కంపెనీలోని అడుగు పెట్టారిద్దరూ. మేనేజర్ యిద్దర్నీ సాదరంగా ఆహ్వానించాడు.

"ఒక కేసు విషయంలో మీ సహాయం కావాలి!" చెప్పాడు కపర్థి.

"చెప్పండి!"

"ఈ మధ్య మీరు ఉద్యోగాలకు ఇంటర్వ్యూ నిర్వహించారా?"

మేనేజర్ తలవూపి, "దాదాపు రెండు నెలల క్రితం! ఏం?"

"ఆ ఇంటర్వ్యూకు వచ్చిన వాళ్లందరి పేర్లూ మీ దగ్గర ఉన్నాయా?"

మేనేజర్ తల ఊపి "సారీ! ఆ ఉద్యోగం మా మేనేజింగ్ డైరెక్టరుగారి మేనల్లుడికి యిచ్చేసాం!" అన్నాడు.

"అందులో విశేషం యేమీ లేదు. మామూలుగా జరిగేదే! కాని మేము వచ్చింది ఆ ఉద్యోగం గురించి కాదు. ఆ ఇంటర్వ్యూకు వచ్చిన వాళ్ళ పేర్లు కావాలి!" అన్నాడు కపర్థి.

"అలాగా! ఇప్పుడే తెప్పిస్తాను" అని ప్యూన్‌ను పిలిచి చెప్పాడు. కాస్సేపటి తర్వాత ఓ వ్యక్తి ఫైలు తెచ్చి అందించాడు. మేనేజర్ ఫైల్లో ఓ కాగితం తీసి, "ఇదే ఆ లిస్టు! అందులో వాళ్ళ అడ్రసులు కూడా ఉన్నాయి!" అన్నాడు.

కపర్థి చకచక పేర్లు చదవసాగాడు.

........'శ్రీలత' ఆ పేరు చదవగానే కపర్థి కళ్ళు మెరిసాయి. సునందది పదో నెంబరు. శ్రీలత అడ్రస్సు కాగితంమీద వ్రాసుకొని, మేనేజర్‌కు థాంక్స్ చెప్పి ఇద్దరూ బయటకు వచ్చారు.

"శ్రీలత అడ్రస్సు దొరికిందిగా. వెంటనే అరెస్టు చేసి బెదిరిస్తే నిజం కక్కదూ?" కాళి అన్నాడు.

"వద్దు! అలా చేస్తే అసలు వ్యక్తి దొరకడు. అదీగాక శ్రీలత అసలు ఆ ముఠాలో మనిషో కాదో తెలియదు. ఒకవేళ ఆ ముఠాలో వ్యక్తి అయినా బెదిరిస్తే నిజం చెప్పదు. భయంకర్ లాగే ఆత్మహత్య చేసుకుంటుంది. అది వాళ్ళకు మొదటగా ఇచ్చే తర్ఫీదు. శ్రీలతను జాగ్రత్తగా కనిపెట్టి అసలు స్థావరం తెలుసుకోవాలి! పద వెళదాం!"

# 11

శ్రీలత యింటికి కొద్ది దూరంలో వీధి మలుపు దగ్గర ఒక ఆటో ఆగి వుంది. కాకీ డ్రస్సులో వున్న కపర్థి అందులో కూర్చొని సిగరెట్ తాగుతూ శ్రీలత ఇంటివైపు చూస్తున్నాడు.

ఓ మాదిరి పెంకుటిల్లు. చుట్టూ ప్రహరీ. కొయ్య గేటు.

గంట.... రెండు గంటలు.... నెమ్మదిగా చీకటి పడుతోంది.

శ్రీలత యింట్లో వుందో, లేదో తెలియదు. మరీ చొరవ తీసుకొని యింట్లో కెళ్ళి ఉందో లేదో తెలుసుకొనేంత రిస్కు తీసుకోదల్చుకోలేదు. తన సహనానికి, ఓపికకు ఇది పరీక్ష.

శ్రీలత యింట్లో లైట్లు వెలిగాయి. యెవరో ఉన్నారు.

ఏడు గంటలు దాటాక ఓ అయిడియా వచ్చింది. చక చక దగ్గర్లో వున్న టెలిఫోన్ బూత్ దగ్గరకు వెళ్ళి ఇన్‌స్పెక్టర్ కాళికి చేయవలసింది చెప్పి వచ్చి, ఆటోలో కూర్చున్నాడు.

పావుగంట తర్వాత దూరంగా పోలీస్ సైరన్ విని పించింది. వెనుక పెట్రోల్ వ్యాన్‌లో హెచ్చరిక చేస్తు న్నారు.

"పురజనులందరికీ హెచ్చరిక. కొద్ది రోజులుగా నగ రంలో పసిపిల్లలను అపహరించే ముఠా గురించి పోలీసులు కొంత సమాచారం తెల్సుకోగలిగారు. డిటెక్టివ్ కపర్థి రేపు సాయంత్రంలోగా ఆ ముఠాను పట్టివ్వగలనని పోలీసులకు హామీ యిచ్చారు. కాబట్టి ప్రజలంతా రేపు సాయంత్రంవరకూ జాగ్రత్తగా ఉండాలని, పసిపిల్లల్ని ఒంటరిగా యెక్కడికీ పంప వద్దని పోలీసు హెచ్చ రిక........"

వ్యాన్ దాటి వెళ్ళిపోయింది. కపర్థి నరాలు టెన్షన్‌తో బిగుసుకున్నాయి.

అయిదు....పది....పదిహేను నిముషాలు. శ్రీలత ఇంటి వరండాలో లైటు ఆరిపోయింది. కపర్థి సిగరెట్ విసి రేసాడు.

పాతికేళ్ళ యువతి బయటకు వచ్చి వీధి గేటు మూసి చక చక ముందుకు నడవసాగింది. ఆమె శ్రీలత అయి వుండాలనుకొన్నాడు. ఆటో శబ్దం విన్పించనంత దూరం పోనిచ్చి నెమ్మదిగా ఆటో స్టార్టు చేశాడు.

శ్రీలత బస్సులోనో, టాక్సీలోనో వెళితే?....అందుకే

ఏదైనా వాహనం అవుసరం అని కాళికి చెప్పి ఓ ఆటో తెప్పించుకొన్నాడు.

శ్రీలత బస్‌స్టాప్‌లో నిలబడి బస్సు రాగానే యెక్కింది. కపర్థి ఆటోను బస్సువెనకే పోనిమ్మన్నాడు. రెండు మూడు చోట్ల బస్సు ఆగి కదిలింది. కపర్థి కళ్ళు చిట్లించుకొని మరీ చూస్తున్నాడు ఎక్కడైనా శ్రీలత దిగుతుందేమోనని.

మున్సిపల్ స్టేడియం దగ్గర బస్సు ఆగింది.

శ్రీలత బస్సు దిగి, ఓ రెండు నిమిషాలు అక్కడే నిలబడి చకచక ఎదురుగా వున్న వీధిలో నడిచింది. కపర్థి ఆశ్చర్యపోయాడు. ఆ వీధిలోగుండా వెళితే కాస్త ముందుగా ఇదే రోడ్డులోకి కలుస్తుంది. ఆటో అక్కడే వదలి చక చక ముందుకు నడచి, ఆ వీధి కలిసే చోట కొద్ది దూరంలో ఆగాడు. కపర్థి ఊహ తప్పలేదు.

శ్రీలత రోడ్డుమీదకు వచ్చింది.ఇప్పుడు మామూలుగా నడుస్తోంది. పావుగంట తర్వాత ఓ పెద్ద భవంతిలోకి వెళ్ళింది. కపర్థి కి ఆ మేడ యెవరిదో తెలుసు. కాస్సేపు అక్కడే నిలబడి, శ్రీలత ఇక రాదని నిర్ణయించుకొని వెనక్కి తిరిగాడు. కపర్థి మొహం కోపంతో జేవురించి ఉంది.

# 12

"హరిశ్చంద్రరావా? ఇంపాసిబుల్! మీరు చెప్పేది నేను నమ్మను!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ కాళి, కపర్థి చెప్పింది విన్నాక.

కపర్థి నవ్వి, "నిజమే! నేనూ నమ్మలేకపోతున్నాను. కాని శ్రీలత మన హెచ్చరిక విన్నాక నేరుగా, హరిశ్చంద్రరావు యింటికి వెళ్ళవలసిన అవసరం ఏమిటి?"

అడిగాడు.

"ఏమో! ఇంకేదైనా కారణం వుండవచ్చు. కాని హరిశ్చంద్రరావుకు ఈ నేరాలతో సంబంధం వుందంటే నమ్మలేను. కోటీశ్వరుడు, పెద్ద బిజినెస్ మాగ్నెట్ అయివుండీ, ప్రభుత్వంలో గొప్ప పలుకుబడి కలిగిన వ్యక్తి ఇంత నీచానికి దిగజారుతాడని, ఇంత ఘోరంచేస్తాడని నేను ఊహించలేకపోతున్నాను" కాళి అన్నాడు.

"చూద్దాం! అతనిమీద నేరం ఇంకా నిర్ధారణ కాలేదుగా! ముందు ఆ విషయం తేల్చుకోవాలి!" అన్నాడు కపర్థి లేస్తూ.

అప్పటికి రాత్రి పదిగంటలు దాటింది.

నేరుగా యింటికి వెళ్ళి భోజనంచేసి, అద్దం ముందు కూర్చుని చకచక రూపం మార్చుకున్నాడు. పావుగంట తర్వాత లేచి, రివాల్వర్ పాకెట్‌లో వుంచుకొని, బయటకు వచ్చి కారెక్కాడు.

హరిశ్చంద్రరావు ఇంటికి కొద్ది దూరంలో కారాపి, దిగి ముందుకు నడిచాడు. మేడమీద గదిలో లైట్లు వెల్గుతున్నాయి. క్రింద వరండాలో దీపం వెల్గుతుంది. మిగతా గదులు చీకటిగా వున్నాయి.

ఇంటి వెనకవైపుకు వెళ్ళి, ఎవ్వరూ చూడడంలేదని నిశ్చయించుకున్నాక అతికష్టంమీద ప్రహరీ దాటి లోపలికి వచ్చాడు.

ఇంటి చుట్టూ విశాలమైన ఖాళీస్థలం. ఇంటిముందు పూలమొక్కలు వున్నాయి. వెనకవైపు ఔట్ హౌస్ కట్టి వుంది. ఔట్ హౌస్‌లో దీపం వెల్గుతుంది.

కపర్థి కిటికీ దగ్గరకు వెళ్ళి తొంగి చూశాడు. లోపల ఎవ్వరూ లేరు. తలుపు వేసివుంది. ఓ నిముషం ఆటూ

ఇటూ చూసి నీటిగొట్టం పట్టుకొని పైకి పాకాడు. మేడ మీద ఆ గదిలో లైటు వెల్గడంలేదు. కిటికి అంచు పట్టుకొని లోపలికి దూకాడు.

హఠాత్తుగా లైటు వెల్గింది. ఎదురుగా వున్న వ్యక్తి చేతిలో రివాల్వర్ మెరుస్తుంది. అతనెవరో కపర్థికి తెల్సు. హరిశ్చంద్రరావు.

"వెల్ కం కపర్థీ! వెల్ కం!" వెటకారంగా నవ్వుతూ ఆహ్వానించాడు.

కపర్థి ఆశ్చర్యపోయాడు. ఇన్ స్పెక్టర్ కాళీ కూడ కనుక్కో-లేనంతగా రూపం మార్చుకున్నాడు. అయినా హరిశ్చంద్రరావు కనిపెట్టేసాడు. ఎలా?

కపర్థి ఆలోచన పసికట్టినట్లుగా నవ్వి, "నువ్వు వస్తావని ఊహించాను. అందుకే సాయంత్రం నుంచి నా మనుషుల్ని నియమించానిక్కడ. నువ్వు కారు దూరంగా ఆపి రావడం, వెనకవైపు గోడదూకడం అంతా బైనాక్యులర్స్ లో చూచి, నాకు చెప్పారు. నీకు స్వాగతం చెప్పడానికే ఇలా వచ్చాను. ఏమిటి విశేషం?" హరిశ్చంద్రరావు గొంతు కఠినంగా మారింది.

కపర్థి కూడ నవ్వి, "నేను వస్తానని ఊహించినవాడివి నేను ఎందుకు వచ్చానో ఊహించలేవా? నా చేత చెప్పించడం ఎందుకు?" అన్నాడు.

హరిశ్చంద్రరావు పళ్ళు కొరికాడు. "నాకు తెల్సు, నువ్విలాంటి మొండిఘటానివని! నిన్ను ఇక్కడే సమాధి చేసినా అడిగేవాళ్ళు లేరు. అసలిదంతా ఆ శ్రీలతవల్ల వచ్చింది. నీ హెచ్చరికకు అనవసరంగా కంగారుపడిపోయి ఇక్కడకు వచ్చింది. నగరంలో ఇంకెక్క-డా చెయ్యని హెచ్చరిక శ్రీలత ఇంటిముందే చేసారని శ్రీలతను

ట్రాప్ చెయ్యడానికే ఈ ప్లాను వేశారని ఊహించాను. ఇంత చేశాక శ్రీలతను అనుసరించి నా ఇల్లు తెల్సుకొని వుంటావని ఊహించాను. కాని, నువ్వింత చేసినా ఏమి సాధించగలవ్? నీ శవం కూడ బయటకుపోకుండా చేయగల సామర్థ్యం వుంది నాకు! అర్థమైందా?" కఠినంగా అన్నాడు.

"నాకు తెల్సు. నీ అంతటివాడి ఇంటికి వచ్చేముందు నేనెలాంటి జాగ్రత్తలు తీసుకొని వుంటానో కూడ ఊహించగలగాలి! శ్రీలతను వెంటాడడం మొదలు ప్రతి విషయమూ ఇన్‌స్పెక్టర్ కాళికి తెల్సు. నేను ఇంక పావుగంటలో ఇంటికి వెళ్ళకపోతే, తెల్లవారేసరికి నీ ఇల్లు నేలమట్టమైపోతుంది. అలాంటిదేమీ జరగదనే గ్యారంటీ నీకు వుంటే, నీ ఇష్టం!" అన్నాడు కపర్థి.

"డామిట్! అసలు నువ్వింతవరకు వచ్చేంతవరకు మౌనంగా వుండడమే తప్పు! పిచ్చిపిచ్చి వేషాలు వెయ్యకుండా ఇలా రా!" ఆజ్ఞాపించాడు.

కపర్థి మౌనంగా ముందుకు నడిచాడు.

రివాల్వర్ గురిపెట్టి వుంచి కపర్థి జేబులు వెదికాడు.

"గుడ్! టేప్ రికార్డర్ లాంటిది ఏదీ లేదు." అని నవ్వి, "నీకూ, నాకూ ఇది ఛాలెంజ్! నీకు శక్తి సామర్థ్యాలు వుంటే నన్ను అరెస్టు చేయించే ప్రయత్నం నిరభ్యంతరంగా చేసుకో! వెళ్ళు!" అన్నాడు హరిశ్చంద్రరావు.

డిటెక్టివ్ కపర్థి చేసేదిలేక మౌనంగా బయటకు నడిచాడు.

## 13

"ఇప్పుడేమిటి చేయడం?" ఇన్‌స్పెక్టర్ కాళి అడిగాడు.

"అదే ఆలోచిస్తున్నాను. తను ఏ విధంగానూ దొరకనవే ధీమా వుండబట్టే హరిశ్చంద్రరావు నన్ను వదిలాడు. లేకుంటే నన్నొదిలి తన ప్రాణాలమీదకు తెచ్చుకోడు!" చెప్పాడు కపర్ది.

"అయితే అతని నేరాన్ని ఏ విధంగానూ నిరూపించలేమా?"

"చాల కష్టం అనుకుంటాను. అదీ అతని ధైర్యం. న్యాయానికి చట్టం రక్షణ కావాలి. చట్టానికి సాక్ష్యం కావాలి. ఆ సాక్ష్యం వుంటే అన్యాయం కూడ చట్టపరంగా న్యాయం అవుతుంది. లేకుంటె న్యాయం నిలబడలేదు. కాబట్టి మనకిప్పుడు గట్టి సాక్ష్యం అవుసరం" చెప్పాడు కపర్ది.

"పోనీ హరిచంద్రరావు ఫోన్ కాల్స్ ట్రేస్ చేస్తే?"

"చెప్పలేం! మనమిలాంటి పద్ధతులు అవలంబిస్తామని ఊహించలేనంతటి తెలివితక్కువవాడు కాదనుకొంటాను. ఈ కార్యక్రమాలన్నీ నిర్వహించడానికి అతని తరఫున ఇంకెవరో వుండివుండాలి. వాళ్ళెవరో తెల్సుకోవాలి. ఎందుకైనా మంచిది. ఇద్దరు మనుషుల్ని హరిశ్చంద్రరావు ఇంటి దగ్గర వుంచి ప్రతి గంటకు రిపోర్టు ఇవ్వాలని చెప్పు. ఫోన్ కాల్ ట్రేస్ చేసే విషయం నేను చూసుకొంటాను. ఏదైనా విషయం తెలియగానే నాకు టెలిఫోన్ చేసి చెప్పు!" కాళికి సూచనలిచ్చి, అక్కడ నుంచి టెలిఫోన్ ఎక్స్చేంజ్ కెళ్ళి, హరిశ్చంద్రరావు ఫోన్ కాల్స్ ట్రేస్ చేసి వినడానికి ఓ మనిషిని నియమించి వచ్చాడు కపర్ది.

సాయంత్రందాకా ఎక్కడనుంచి టెలిఫోన్ రాలేదు. కపర్దికి ఆతృతగా వుంది.

అసలు హరిశ్చంద్రరావుకు అంత ధీమా ఎక్కడిది? ఆ పిల్లలందర్నీ ఇక్కడనుంచి పంపేసాడా? అందుకే అంత ధైర్యంగా వున్నాడా? అసలు ఎలా పంపుతాడు. పోలీసులు నగరం నలుమూలలా గట్టిగా కాపలా కాస్తున్నారు! మరి ఎలా పంపాడు?

అయిదు గంటలకు బయలుదేరి స్టేషనుకు వెళ్ళాడు. ఇన్‌స్పెక్టర్ కాళీ, హరిశ్చంద్రరావు ఇంటి దగ్గర వున్న మనుషులు పంపిన రిపోర్టులు అందించాడు.

కపర్ది ఆతృతగా చదివాడు. ఎవరెవరో మంత్రులు, వ్యాపారవేత్తలు వచ్చారని.... ఇంకా ఏవేవో వ్రాసారు. ఆ రిపోర్టులుబట్టి అనుమానించదగింది ఏమీ కన్పించలేదు. వాటిని తిరిగి ఇచ్చేసి టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌కి వెళ్ళాడు.

అప్పటివరకు హరిశ్చంద్రరావు చేసిన కాల్స్, హరిశ్చంద్రరావుకొచ్చిన కాల్స్ వివరాలు విని రిపోర్టు అందించాడు కపర్ది నియమించిన మనిషి.

రిపోర్టు అంతా చదివాడు. అనుమానించదగింది ఏమీ కన్పించలేదు. ఏవో షేర్లు గురించి, స్టాక్ గురించి సంభాషణ. కాగితం మడిచి జేబులో పెట్టుకొని అతన్ని మరోసారి జాగ్రత్తగా ఉండమని హెచ్చరించి ఇంటికి వచ్చాడు.

కపర్దికి చాలా చికాకుగా వుంది. నేరస్తుడు ఎవరో తెల్సు. కాని నిరూపించడం ఎలా? అందులోనూ గొప్ప పలుకుబడివున్న వ్యక్తి. గట్టి సాక్ష్యం లేకపోతే, అతని నేర నిరూపణకు ఓ కమీషన్ వేసి, ఓ సంవత్సరం తర్వాత ఆ కేసు కొట్టెయ్యవచ్చు. ప్రస్తుత పరిస్థితులను బట్టి చూస్తే ఎవరిమీదైనా కమీషన్ వేస్తారు అంటే, అతని నేరం మాఫీ చెయ్యడానికని అర్ధం అవుతుంది.

అందుకే గట్టి సాక్ష్యం కావాలి.

సిగరెట్ వెలిగించి కుర్చీలో వెనక్కి వాలి ఆలోచిస్తూ టెలిఫోన్ కాల్స్ రిపోర్టు మరోసారి చదివాడు. ఏమీ విశేషంలేదు. కాగితం టేబిలుమీద పెడుతూ ఉలిక్కి పడ్డాడు. రిపోర్టు తీసుకొని మళ్ళీ చదివాడు. అతని దృష్టి ఓ చోట నిలబడిపోయింది.

"టైం. 4-10: హరిశ్చంద్రరావు. కాల్ టు 1214: విషయం గోడౌన్ చుట్టుపక్కల ఎలుకలు ఎక్కువగా వుంటే స్టాకంతా AAA_1415కు బుక్ చెయ్యండి.

ఒకటికి రెండుసార్లు చదివాడు. ఏదో అనుమానం వేసింది. ఎలుకలు గోడౌన్‌లో కాకుండా, చుట్టుపక్కల వుంటే బుక్ చెయ్యమనడం ఏమిటి? AAA_1415 లారీ నెంబరా? కారు నెంబరా?

చటుక్కున రిసీవర్ ఎత్తి కాళికి ఫోన్ చేసి AAA _ 1415 నెంబరు కల్గిన వాహనం ఎవరిదో వెంటనే తెల్సుకోమని చెప్పాడు.

అరగంట తర్వాత కాళి దగ్గరనుంచి ఫోన్ వచ్చింది "కపర్తీ! అలాంటి నెంబరుగల లారీ మన నగరంలో వుంది. ప్రస్తుతం గణేష్ ఆటో మొబైల్స్‌లో రిపేరులో వుంది. దాని ఓనర్ హాజరయ్య! అడ్రసు_నెం. 43/1 గాంధీ లేన్" చెప్పాడు కాళి.

"ఓ.కే! వెంటనే ఓ మనిషిని నియమించి అతనిమీద నిఘా వేయించు. క్విక్!" అరిచాడు కపర్తి.

పావుగంట తర్వాత కాళి మళ్ళీ టెలిఫోన్ చేసి చెప్పాడు. హాజరయ్య ప్రస్తుతం బెంగుళూరులో వుంటున్నాడు. అక్కడికి వెళ్ళి వారం రోజులయింది. ఇల్లు తాళంవేసి వుంది అని.

నిరాశగా నిట్టూర్చాడు కపరి. ఫోన్ పెట్టేసి ఆలోచనల్లో పడ్డాడు. AAA — 1415 ఆ నెంబర్ వైపే చూస్తూ ఆలోచిస్తున్నాడు.

అయిదు నిముషాల తర్వాత వున్నట్లుండి అరిచాడు "హుర్రే!"

## 14

"ఏదైనా విశేషమా?" హడావుడిగా లోపలికి వస్తున్న కపరి వైపు చూస్తూ అడిగాడు ఇన్‌స్పెక్టర్ శాలి.

"అవును! పెద్ద విశేషమే! ఆ రహస్యం ఇప్పుడే తెల్సుకోగలిగాను. నా ఊహ సరైనదే అని నా నమ్మకం. మామూలుగా చాలామంది కోడ్‌లో మాట్లాడుతున్నా, రాసుకున్నా, అంకెల్లో విషయం తెలియపరుస్తారు. అంటే, ఆ అంకెల్ని ఆల్ఫబెటికల్ ఆర్డర్‌లో వుంచుకుంటె అసలు విషయిం తెలుస్తుందన్నమాట. మరికొంతమంది అక్షరాల్లో విషయం చెబితే దాన్ని అంకెల్లోకి మాట్లాడుకొంటారు.

మనకు దొరికిన ఈ AAA-1415ను రెండు రకాలుగా ఉపయోగించాలి. అక్షరాలను అంకెల్లోకి. అంకెల్ని అక్షరాలలోకి మార్చుకొంటె 111 — నెంబర్ అని వస్తుంది. అంటే-"111-లేదు" అనాలేక "నెం-111" అనా అని ఆలోచిస్తే నెం—111 సరైనది అనిపిస్తుంది. ఎందుకంటే మొదటి పదానికి అర్థంలేదు. స్టాకును '111—లేదు' మార్చడం ఏమిటి? దీన్నిబట్టి ఆలోచిస్తే స్టాకును "నెం—111"కు బుక్ చెయ్యమని అర్థం. బుక్ చెయ్యమంటే మార్చడం అని కూడా అనుకోవచ్చు.

అయితే ఈ నెం—111 ఏమిటి? ఏదైనా హోటల్లో రూమా? ఇంటి నెంబరా? ఏదీ? అదే తెల్సుకోవాలి!

వెంటనే నగరంలో నెం—111 అన్న ఇళ్ళన్నీ సోదా చెయ్యాలి. హోటల్స్‌లో కూడా చెక్ చెయ్యాలి. అందుకు కావల్సిన ఆర్డర్స్ తక్షణం కావాలి!" చెప్పాడు కపర్థి.

గంట తర్వాత ఇద్దరూ బయలుదేరారు. అంతకుముందే స్పెషల్ స్క్వాడ్‌ను ఎనిమిది భాగాలుచేసి నగరం నాల్గు మూలలకు పంపారు. ఇద్దరూ కలిసి అన్ని హోటల్స్‌లో 111 రూములన్నీ వెదికారు. ప్రయోజనం కన్పించలేదు.

తెల తెలవారుతుండగా స్టేషన్‌కు తిరిగి వచ్చారు. అప్పటికే కొన్ని స్క్వాడ్‌లు పంపిన రిపోర్టులు వున్నాయి. విశేషం ఏమీ లేదు.

"ఇంక నెం—111 అనే గది ఎక్కడుంటుంది. ఎవరైనా పనిగట్టుకొని ఓ రెండువందల గదులు వరుసగా కట్టించుకొంటే తప్ప!" ఇన్‌స్పెక్టర్ అన్నాడు.

కపర్థి కళ్ళు మెరిసాయి. ఎవరైనా అంత పొడుగ్గా కట్టించుకొంటె నెం—111 రూం వుంటుంది. ఎవరు కట్టిసారు. అయిడియా! "ఫుడ్ కార్పొరేషన్ గోడౌన్స్- వేర్‌హౌస్ గోడౌన్స్ వుంటాయి అంత పొడుగ్గా! పద వెళదాం!" మాట్లాడుతూనే లేచాడు. F.C.I గోడౌన్స్ వెదికారు. ఏమీ లేదు. వేర్‌హౌసింగ్ కార్పొరేషన్ గోడౌన్స్ దగ్గరకు వెళ్ళారు. ఆ గోడౌన్స్ ఇంకా నిర్మాణంలోనే వున్నాయి. సింహద్వారం దగ్గర బోర్డువుంది.

గోడౌన్స్ కాంట్రాక్టు "స్వప్న ఇంజనీర్స్"

ప్రొ: హరిశ్చంద్రరావు.

కపర్థి దూసుకు వెళ్ళాడు లోపలికి.

"ఎవరది?" అరుస్తూ ఇద్దరు వ్యక్తులు వచ్చారు.

కాళీ రివాల్వర్‌తో బెదిరించి ఇద్దర్నీ కట్టిపడేశాడు.

కపరి రూం నెం. 111 ముందు ఆగాడు. రోలింగ్ షట్టర్ వేసివుంది. ఎక్కడో పది అడుగుల ఎత్తున వెంటిలేటర్ వుంది.

రివాల్వర్‌తో తాళం పేల్చి షట్టర్ ఎత్తి లోపలికి వెళ్ళాడు.

దాదాపు ముప్పైమంది మగపిల్లలు ... ఆడపిల్లలు .... చేతులు కాళ్ళు కట్టేసి పడివున్నారు....

అందరి నోళ్ళకు అరవకుండా టేప్ అంటించి ఉంది. అందరూ క్రింద పరచిన టార్పాలిన్ మీద పడివున్నారు. గదిలో మూలగా గాయాలతో అరవలేక గింజుకొంటు న్నాడు రవికాంత్.

పది నిమిషాల్లో అందరూ అక్కడనుంచి బైటపడ్డారు. గోడౌన్ దగ్గర బంధించినవాళ్ళ దగ్గర్నుంచి స్టేట్ మెంట్ తీసుకొని వాళ్ళని కాపలాలో పెట్టాడు ఇన్‌స్పెక్టర్ కాళి.

"హరిశ్చంద్రరావును శిక్షించడానికి వీళ్ళ సాక్ష్యాలు చాలదేమో!" ఇన్‌స్పెక్టర్ అన్నాడు.

కపరి నవ్వి, "పిల్లలంతా దొరికారు. ఇక హరిశ్చంద్ర రావుతో ఎంత రిస్కైనా తీసుకోవచ్చు. ముందు వీళ్ళం దర్ని వాళ్ళ వాళ్ళ ఇళ్ళకు పంపే ఏర్పాట్లు చేయించి 1214 టెలిఫోన్ నెంబరు ఎవరిదో తెల్సుకొని తక్షణం అతన్ని అరెస్టు చేయించు. అతనిదగ్గర కొన్ని సాక్ష్యాలు లభించవచ్చు!" అని కాళి ఏర్పాట్లన్నీ పూర్తిచేశాక ఇద్దరూ హరిశ్చంద్రరావు ఇంటికి బయలుదేరారు.

మేడమీద గదిలో లైటు వెలుగుతోంది. గేటుదగ్గర ఘూర్ఖాను రివాల్వర్‌తో లోబర్చుకొని చకచక లోపలికి వెళ్ళారు. తలుపులు వేసి ఉన్నాయి. ఇంటి వెనకవైపుకు

వెళ్లి, నీటిగొట్టం పట్టుకొని పైకి వెళ్ళి ఆ గదిలోంచి లైటు వెలిగే గదిలోకి నడిచారు నిశ్శబ్దంగా.

ఆ గదిలో దృశ్యం చూడగానే ఇద్దరూ అవాక్కయి పోయారు. ఎంతోమంది పెద్దమనుషులు తమ పలుకు బడితో చట్టం కళ్ళుగప్పి ఎన్ని ఘోరాలు చేస్తున్నారో అర్థం అయింది.

గదిలో నోరు చేతులు కాళ్ళు కట్టేసిన శ్రీలతను బలవంతంగా అనుభవిస్తున్నాడు హరిశ్చంద్రరావు. మరు నిమిషంలో కపర్థి రివాల్వర్ పేలివుండవలసిందే! కాళి వారించి పెద్దగా అరిచాడు.

హరిశ్చంద్రరావు అదిరిపడ్డాడు. అతను తేరుకొనేసరికి అతని చేతులకు సంకెళ్ళుపడ్డాయి.

—:ఐ పో యిం ది:—

# చుట్టాలొస్తారు!

వసుంధర

పరీక్ష ఫీజు కట్టకపోతే ఇన్నేళ్ళ నా చదువు వృధా అయిపోతుంది.

నాన్నకు వంట్లో బాగాలేదు. ఆయన ఇల్లు కదలడం లేదు. కదిలినా అప్పిచ్చే స్నేహితుడు లేడు. అమ్మకు వంట్లో బాగానే వున్నా తనూ ఇల్లు కదలడంలేదు. ఇరుగుపొరుగుల అందరిళ్ళలోనూ అప్పులు. అమ్మ వంటి మీద చిన్న మెత్తు బంగారం కూడా లేదు. అసలు మా ఇంట్లో ఎవరి వంటిమీదా బంగారంలేదు. నాకు ఇద్దరు చెల్లెళ్ళూ ఓ తమ్ముడూ వున్నారు. ఆడపిల్లల చెవులకు కనీసం పోగులైనా లేవు.

నేను పరీక్ష ఫీజు కట్టాలి. అందుకు రెండే రెండు రోజులు గడువుంది. కాలేజీలో నాకు అప్పిచ్చే స్నేహితులు కూడా లేరు. అసలిక్కడ నాకు స్నేహితులే లేరు. నేను వేసుకొనే చొక్కాకూ, పాంట్లకూ కూడా అతుకులుంటాయి. నా కాళ్ళకు చెప్పులుండవు. దరిద్ర

మంతా ముఖంమీద పులిమినట్లు కనబడే నన్ను చూసి చాలామంది అపహాస్యం చేస్తారు. జాలిపడేవారు బాగా తక్కువ.

నాతో స్నేహానికి ఎవరూ ఇష్టపడరు. ఎవరైనా ఇష్టపడినా నాకు కాంప్లెక్స్. ఎవరితో మాట్లాడాలన్నా భయం. కాలేజీకి వెళ్ళడం, ఎవరేమన్నా పట్టించుకోకపోవడం, నా చదువేదో నేను చూసుకోవడం, మళ్ళీ యింటికి రావడం!

నా తెలివితేటలూ అంతంత మాత్రమే! ఎంత కష్టపడి చదివినా క్లాసులో ఎప్పుడూ ఫస్టు రాలేదు. అలా వచ్చినా బాగుండేది. కనీసం స్కాలర్ షిప్పయినా దొరికేది. క్లాసులో వున్న ఎనభైమందిలోనూ నేనెప్పుడూ పదికీ పదిహేనుకీ మధ్య పొజిషన్ లో వుంటాను మార్కుల పరంగా చూస్తే! ఏ విధంగానూ కాలేజీలో గుర్తింపులేదు.

అయినా నాకు భవిష్యత్తు మీద ఆశ వుంది. ఏదో ఒక రోజున నా పరిస్థితి మారిపోతుంది. అంతవరకూ ఈ కష్టాలు సహించాలి!

వున్న ఈ ఒక్క ఆశా నిజమయ్యే అవకాశం కూడా వుండదు నేనిప్పుడు పరీక్ష ఫీజు కట్టకపోతే!

అందుకు రెండే రెండు రోజులు టయిముంది. ఎలాగో అలా కట్టాలి ఫీజు....

ఎంత ఆలోచించినా దారి కనబడలేదు నాకు. పెన్నులో సిరా అయిపోతే—మళ్ళీ సిరా పోయించుకోవడమే ఓ పెద్ద ఖర్చుగా భావించే మా యింట్లో నాకు అంత డబ్బు ఎలా దొరుకుతుంది?

బాగా ఆలోచించాక దొంగతనం చేయాలని నిర్ణ

యించుకొన్నాను.

నిర్ణయంవరకు బాగానే వుంది. నేనెప్పుడూ దొంగ తనం గురించి ఊహించను కూడా లేదు. ఇప్పుడది నాకెలా సాధ్యపడుతుంది?

అసలు దొంగతనమంటే ఎలా చేయాలి? రాత్రి ఏ ఇంట్లోనైనా చొరబడాలా? అలా చొరబడినప్పుడు పట్టుబడితే ఇంకేమైనా వుందా? పరీక్ష ఫీజు కట్టకపోతే కూలిపనైనా చేసుకొని బ్రతకొచ్చు. కానీ ఓసారి దొంగ అన్న ముద్రపడితే సమాజంలో ఎందుకూ పనికిరాకుండా పోతాను.

అయితే ఏం చేయాలి?

దొంగతనం సరైన పద్ధతి కాదు. తెలివితేట లుపయో గించి మోసం చేయాలి!

మోసం యెవర్ని చేయడం? యెలా చేయడం?....

చాలాసేపు ఆలోచించాను. రకరకాల ఉపాయాలు స్ఫురించాయి. అనాథశరణాలయం పేరిట చందా లడగ వచ్చు. కానీ దానికి వంద రూపాయలు కావాలంటే వందిళ్ళైనా తిరగాలి. తిరుపతి వెడుతున్నామని చెబితే లాభసాటిగానే వుంటుంది. కానీ అప్పుడు నిజంగానే తిరుపతి వెళ్ళాలి. తన పేరు చెప్పి వసూలు చేసిన డబ్బుతో నా పరీక్ష ఫీజు కడితే ఆ స్వామి నన్ను పరీక్ష ప్యాసవ నిస్తాడా? ఇంతవరకూ ఇలాంటి మోసాలు చేయలేదు కాబట్టి నేను దేవుడికి భయపడుతున్నాను.

ఆలోచిస్తూ ఆ సాయంత్రం బీచి దగ్గర కూర్చుని వుండగా ఓ విచిత్రం చూశాను.

అస్థిపంజరంలాంటి శరీరంతో ఒకడు తనకు వారం

రోజులనుంచి తిండి లేదని ఒక్కొక్కళ్ళనే అడుక్కొంటూ నా దాకా వచ్చి నా వైపు చూసి నన్నేమీ అడక్కుండానే ముందుకు వెళ్ళాడు. వాడిని నేను చాలా సేపట్నించి గమనిస్తున్నాను. వాడి కెవ్వరూ పైసా యివ్వడంలేదు. అలాంటివాడు నా దగ్గరకు వస్తే లేదని యెలా చెప్పడమా అని మథనపడుతూండగా వాడు నా సమస్య సులభంగానే తేల్చిపారేశాడు. అది నాకు సంతోషానికి బదులు అవమానాన్ని కలిగించింది. నన్ను చూడగానే వాడు గోచిపాతరాయుడుడిలా గుర్తించాడన్న మాట!

బిచ్చగాడు నన్ను దాటి దగ్గర్లోనే వున్న ఓ యువకుడి దగ్గర ఆగాడు.

ఆ యువకుడికి బహుశా పాతికేళ్ళుంటాయి. చాలా హుందాగా వున్నాడు. అందంగా వున్నాడు. అతన్ని చూస్తే అసలు బిచ్చగాడితో మాట్లాడుతాడా అని పించింది. కుతూహలంగా అటే చూస్తున్నాను.

ఆ యువకుడు బిచ్చగాడేదో చెప్పబోతోంటే మాట్లాడ వద్దనట్లు వారించాడు. తన జేబులోంచి ఓ అయిదురూపాయల నోటు తీసి వాడికి అందించి— "ముందు వెంటనే వెళ్ళి కడుపునిండా భోజనం చేయి-" అన్నాడు.

బిచ్చగాడు ముందు అతడికి రెండు చేతులూ జోడించి నమస్కరించాడు. తర్వాత కాళ్ళమీద పడ్డాడు. పదే పదే ఆ యువకుణ్ని పొగుడుతూ అక్కణ్నించి కదిలాడు.

ఆ దృశ్యం నన్ను కదిలించింది. అయిదురూపాయలతో ఆ బిచ్చగాడు అతనికి బానిస అయిపోయాడు. ఆకలి

అలాంటిది! అప్పుడే నాకు స్ఫురించింది. నా పరీక్ష ఫీజు కెవరైనా డబ్బిస్తే నేనూ అలానే చేస్తానేమోనని! స్ఫురించడమే తడవుగా ఆ యువకుడు నాకో వంద రూపాయలనోటు అందిస్తున్నట్లూ నే నతడి కాళ్ళ మీద పడినట్లూ ఊహించుకొన్నాను.

బిచ్చగాడు వెళ్ళిపోయాడు. యువకు డింకా అక్కడే వున్నాడు. అతను సముద్రాన్ని చూస్తూ ఏమేమో ఆలోచిస్తున్నాడు. అతడి బుర్రలో యెలాంటి ఆలోచనలున్నాయో? ఓ బిచ్చగాడికి ఒక్కసారిగా అయిదు రూపాయలు ఇవ్వగలగాడంటే అతడు బాగా డబ్బున్నవాడే అయుండాలి. డబ్బున్న వాళ్ళకు సమస్యలేముంటాయి? ఈ ప్రపంచంలో అన్ని సమస్యలనూ పరిష్కరించగలిగేది డబ్బు మాత్రమే! ఆ డబ్బు అతడికుంది.

డబ్బుతోపాటు అతడికి మంచి హృదయం కూడా వుంది. నా సమస్య వింటే అతను నాకు సాయపడతాడేమో! అడిగిచూస్తే ఏమవుతుంది?

కాసేపు నా మదిలో అభిమానం, సంకోచం కలిసి అవసరంమీద దాడి చేశాయి. పోరాటం చాలాసేపు జరిగింది.

అతడు నాకు అపరిచితుడు. అతణ్ని డబ్బెలా అడిగేది?....అతడి దేమైనా ఘరానా ముష్టి అనుకొంటే....?

అందుకో ఉపాయముంది. కాలేజీకి వచ్చి ఫీజు అతడినే కట్టమంటే సరిపోతుంది.

తెగించడానికి కాసేపు పట్టింది. అత డెవరో నాకు తెలియదు. నే నెవరో అతడికి తెలియదు. రోజూ ముఖం

ముఖం చూసుకో నేవాళ్ళమైతే అవమానంగానీ ఇక్కడ నాకు అవమానమేమిటి?

తెగించి లేచి అతణ్ని సమీపించాను. నన్ను చూస్తూనే అతడులిక్కిపడి పలకరింపుగా చిన్నగా నవ్వాడు.

ఆ నవ్వు నాకు చాలా బలాన్నిచ్చింది. నేనూ నవ్వి అతడికి దగ్గర్లో కూర్చుని—"బిచ్చగాడికి అయిదురూపాయ లివ్వడం చూసి మీ విశాలహృదయాన్ని అభినందించాలని వచ్చాను—" అన్నాను.

అతడి ముఖంలో పెద్దగా సంతోషం కనబడలేదు. నా వంక అదోలా చూచి—"బిచ్చగాళ్ళంటే నాకు చాలా అసహ్యం!" అన్నాడు.

నే నాశ్చర్యపడి—"ఇది నేను నమ్మలేను!" అన్నాను.

అతను నవ్వి—"ఆఫీసులో పని కావాలంటే మీరు లంచమిస్తారు. పని కావాలన్న అవసరం మీ చేత ఆ లంచాన్నిప్పిస్తుంది. అంత మాత్రాన లంచమివ్వడ మంటే మీకు అసహ్యం లేదంటారా?" అన్నాడతను.

"బాగానే వుంది. అయితే వాడికి డబ్బివ్వాల్సిన అవ సరం మీకేముంది?" అన్నాను.

అతను నా ప్రశ్నకు జవాబివ్వకుండా—"ఇప్పుడు నేను వాడికి అయిదురూపాయ లిచ్చాను. వెళ్ళి భోంచేస్తాడు. ఈ పూటతోనో మరో పూటతోనో ఆ డబ్బు హుళక్కి! ఆ తర్వాత....మళ్ళీ బిచ్చమంటూ బయల్దేరతాడు. వాడిది నిత్య పరాధీన జీవితం. అలాంటివాళ్లంటే నాకు చాలా అసహ్యం. ఒకసారి ఒకడివల్ల పొందే సాయంతో మనిషి తనకు ఆలంబనం ఏర్పర్చుకో గలగాలి. అప్పుడే సాయం చేయాలనిపిస్తుంది నాకు. కానీ ఇలా...." అని ఆగిపోయి అర్థమయింది కదా అన్నట్లు నా వైపు చూశాడు.

అతడి సంభాషణ నేను కోరే దారిలోకి మళ్ళడం నా అదృష్టం. నేను అతడి పేరడిగి సురేష్ అని తెలుసుకుని నా పేరు చెప్పి—"బిచ్చగాళ్ళని అసహ్యించుకోవడంలో అర్థం లేదనుకొంటాను. ఉదాహరణకు నా కేసు తీసుకోండి. ఎల్లుండే పరీక్ష ఫీజు కట్టడానికి ఆఖరి రోజు. అప్పిచ్చే నాథు డెక్కడా లేడు. నాన్నకు జ్వరం. ఈ ఫీజు కట్టక పోతే యిన్నేళ్ళ చదువూ వృథా అయిపోతుంది. ఇప్పుడు నే నేం చేయాలో చెప్పండి. అడుక్కునైనా సంపాదించాలి. దొంగతనమైనా చెయ్యాలి. అంతకుమించి దారేదైనా ఉందేమో మీరే చెప్పండి!" అన్నాను.

సురేష్ నా వంక చురుగ్గా చూసి—"ఈరోజు పరీక్ష ఫీజు కట్టడం కష్టంగా వుందంటే—చాలా ఏళ్ళుగా మీ ఇంటి పరిస్థితి ఆర్థికంగా బాగుండి వుండదు. అలాంటప్పుడు మిమ్మల్ని చదివించాలనుకున్న మీ నాన్నగారినీ, చదువుకోవాలనుకొన్న మిమ్మల్ని కూడా నేను తప్పుపడతానంటే ఏమంటారు?" అన్నాడు.

ఇలాంటి ప్రశ్న నేనూహించలేదు. కానీ సురేష్ వివరణ బాగానే వుంది.

శ్రామికుల పిల్లలు ఆరేడేళ్ళు దాటగానే వాళ్ళ పొట్ట వాళ్ళు పోషించుకోవడం నేర్చుకుంటారు. కూలిపనులు చేస్తారు. రిక్షాలు లాగుతారు. కూరలమ్ముతారు....ఏదో ఓ పని చేస్తారు!

కానీ మధ్య తరగతి మనుషులు....ఆడపిల్లల్ని కట్నాలిచ్చి పెళ్ళిచేసి యింట్లోంచి పంపేయాలనుకుంటారు. మగపిల్లల్ని కనీసం బియ్యే దాకా చదివించాలనుకొంటారు. ఈ రెండు రకాల ఖర్చులూ కొంపలు గుల్లలు చేస్తున్నా, ప్రాణాలు తోడేస్తున్నా యీ పరిస్థితులకు యెదురు

తిరిగారు.

ఆడపిల్ల కిచ్చే కట్నం పోసీ ఆడపిల్ల కుపయోగపడుతోందా? అది మగపెళ్ళివారి పెళ్ళి ఖర్చుగా ఉపయోగపడుతోంది. అలాగే మగపిల్లాడి చదువు.... వాడికి డబ్బు సంపాదించే తెలివితేటల్ని ప్రసాదిస్తోందా?.... లేదు. పరీక్ష ఫీజు కావాలంటే అడుక్కోవడమో, దొంగతనం చేయడమో తప్ప దారి లేదని తెలుసుకొనడానికి ఇన్నేళ్ళ చదువు అవసరమా?

నేను సిగ్గుతో తల వంచుకొన్నాను. అయితే నన్ను నేను సమర్థించుకోవాలన్న ఆశ యింకా బలంగా నాలో వుండడంవల్ల—"చదువు సంపాదనకే కాదు. విజ్ఞానం కోసం—" అన్నాను.

"నిజం చెప్పండి. మీరు విజ్ఞానం కోసమే చదివారా?" అన్నాడు సురేష్.

నా మౌనమే అతడికి సమాధానమయింది. అతడు మళ్ళీ—"ఈ రోజు పరీక్ష ఫీజు కట్టారే అనుకోండి. అంతటితో కథ ఆగిపోదు. మీకో పట్టాన ఉద్యోగం దొరకదు. రోజులు గడవడం చాలా కష్టంకాగా అడుక్కుతినడమో, దొంగతనమో తప్ప దారి లేదనుకొంటారు. మళ్ళీ కథ మొదటికి వచ్చినట్లే కదా!" అన్నాడు.

సురేష్ జీవితాన్ని కాచి వడబోసినవాడిలా కనబడుతున్నాడు. ఇదంతా అతను నాకెందుకు చెబుతున్నాడో నాకు అర్థం కాలేదు. "నేను ఆశాజీవిని. అందువల్ల భవిష్యత్తు గురించి నాకు బెంగలేదు—" అన్నాను.

"మీ పేరు, క్లాసు వగైరా వివరాలన్నీ చెప్పండి. రేపు మీ పరీక్ష ఫీజు నేను కడతాను. అయితే నాకు ఒక విషయమై మాటివ్వాలి మీరు—" అన్నాడు

సురేష్.

అతడి ఔదార్యానికి నాకు నోట మాట రాలేదు. అప్రతిభుడినై అతడినే చూస్తూండిపోయాను.

"ఎటువంటి క్లిష్టమైన పరిస్థితి ఎదురైనా మీరు దొంగతనం జోలికి వెళ్ళనని మాటివ్వాలి!" అన్నాడు సురేష్.

నా ఆశ్చర్యం రెట్టింపయింది—"ఇదేం కోరిక? నేను దొంగతనం చేయడంవల్ల మీకేం కష్టం?"

"డబ్బు పోగొట్టుకోవడంలోని బాధ నాకు తెలుసు. మీలాంటి వారికి సాయపడడంకోసం ఎంత డబ్బు పోగొట్టుకొన్నా నాకు బాధగా వుండదు. కానీ నా డబ్బు ఒక దొంగవాడి చేతిలో పడితే నాకు కలిగే బాధ వర్ణనాతీతం. మనిషి పతనానికి దొంగతనం నాంది—" అంటూ సురేష్ నవ్వి—"మిమ్మల్ని చూస్తూనే మీరు అవసరంలో వున్నారని గ్రహించాను. మీ కష్టం తెలుసు కొని మీకు సాయపడాలనిపించింది. మిమ్మల్నాకర్షించడం కోసమే బిచ్చగాడికి అయిదు రూపాయలిచ్చాను. నా అంచనా రైటయింది. మీరు నా దగ్గరకు వచ్చారు-" అన్నాడు.

నేను ఆశ్చర్యపడ్డాను. సురేష్ తన అడ్రసు చెప్పకుండానే అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. మర్నాడు. నేను క్లాసులో వుండగా అతడే స్వయంగా వచ్చి ఫీజు కట్టిన రసీదిచ్చి వెళ్ళిపోయాడు.

## 2

నేను బియ్యే ప్యాసై రెండేళ్ళు పూర్తి కావస్తోంది. డిగ్రీకి ముందూ, ఇప్పటికీ నా జీవితంలో తేడా యేమీ లేదు. ఎటొచ్చీ అప్పట్లో ఆశలు పేరుకొంటూ ఉండేవి.

ఇప్పుడవి కరిగిపోతున్నాయి.

నా కిప్పుడు నన్ను చూస్తే విసుగ్గా వుంటోంది. అమ్మ కూడా నన్ను అసమర్థుడి కింద లెక్కవేసింది. నా మీద పెట్టిన పెట్టుబడిలో వాళ్ళ కింతవరకూ ఒక్క పైసా వెనక్కు రాలేదు. వాళ్ళిచ్చిన పెట్టుబడితో నేను డిగ్రీ సంపాదించాను తప్పితే అంతకుమించి ఇంకేం చేయాలో తోచడంలేదు. నా అంతటివాణ్ణి నే నయ్యాక యింకా వాళ్ళమీద ఆధారపడడం నాకు సిగ్గుగానే వుంది. కానీ ఉద్యోగం తప్ప డబ్బు సంపాదించే మార్గం మరేదీ నాకు తెలియదు.

అప్పుడప్పుడు సురేష్ మాటలు గుర్తొస్తూండేవి నాకు. బిచ్చగాడికి ఓ రోజు దానం చేస్తే మళ్ళీ మర్నాడు కూడా దానం చేయాలి. నా సంగతీ అంతే నన్నాడతను. సురేష్ సాయంతో పరీక్ష ఫీజు కట్టి సెకండ్ క్లాసులో బియ్యే ప్యాసయ్యాను. ప్రయోజనమేమున్నది? అడుక్కోవడమో, దొంగతనమో తప్ప వేరేదారి ఏదీ నాకు కనబడడంలేదు.

నాలో సమాజంమీద కోపం, పగ రగులుకొంటున్న సమయంలో సురేష్ ఒకపర్యాయం బజార్లో కనబడ్డాడు. అతడు నన్ను చూడలేదు కానీ నే నతణ్ణి చూశాను. చాలా ఉత్సాహంగా వున్నాడతను.

సురేష్ అదృష్టవంతుడు. ఏ చీకూ చింతా వున్నట్లు లేదు. ఈ రెండేళ్లలోనూ అతడి ముఖంలో పెద్దగా మార్పు రాలేదు. నేను మాత్రం నా వయసుకు అయిదో పదో కలిపినట్లయిపోయాను. బహుశా అతడికంటే కూడా పెద్దవాడిలాగున్నా నేమో! అలా అనుకొంటూ నే అతణ్ణి పలకరించాను.

సురేష్ నన్ను గుర్తుపట్టలేదు. నేనతడికి నా వివరాలు చెప్పగా—"అలాగా!" అన్నాడు. అప్పుడు నేను బీచి దగ్గర జరిగిన సంఘటన పూర్తిగా వివరించి—"మీరు చెప్పిందే నిజమయింది. డిగ్రీ వచ్చినా నా ఆలోచనల్లోనూ పరిస్థితిలోనూ మార్పు రాలేదు. బహుశా దొంగగా మారాలేమో!" అన్నాను.

నా మాటలకు సురేష్ కలవరపడ్డట్లు కనిపించాడు. అతడికి కష్టాల్లో వున్నవారిని ఆదుకోవడం అలవాటు. అందువల్ల నాకెప్పుడు ఎలాగ సాయపడిందీ అతడికంతగా గుర్తులేదు. కానీ జరిగినదతను ఊహించకలిగాడు—"బిచ్చగాళ్ళంటే నాకు అసహ్యం. మన దేశంలోని యువతరమంతా బిచ్చగాళ్ళలాగే కనబడుతుంది నాకు—" అన్నాడతను.

దెబ్బతిన్నాను. అతనింత మాటంటాడని నేనూహించుకోలేదు.

"ఇలాంటి పరిస్థితి ఏ దేశంలోనూ వుండకూడదు. ఇరవై ఏళ్ళు దాటినా తల్లిదండ్రులమీద ఆధారపడేందుకు సిగ్గుపడని పుత్రాళ్ళూ పుత్రాళ్ళేనా? చదివేముందు ఎందుకు చదువుతున్నామో ఆలోచించరు. చదివాక ఉద్యోగం తప్ప దారి తోచదు. ఎల్లకాలం ఎవడి దయకోసమో ఎదురుచూడ్డం తప్పితే తమకు తామై తమ కాళ్ళమీద నిలబడడం చేతకాదు. లోపం మనుషుల్లో వుందో, చదువుల్లో వుందో తెలియడంలేదు. ఇప్పుడు నీ కుద్యోగం దొరికిందనుకో. నెలకు ఏ నాలుగొందలో వస్తాయి. ఆ డబ్బు నీకే చాలదు. కానీ నువ్వు పెళ్ళి కూడా చేసుకుంటావు. పిల్లల్ని కూడా కంటావు. నీ తల్లిదండ్రుల్ని పోషించలేవు. సంసార జీవితం నరకప్రాయంగా

వుంటుంది. అలాంటి పరిస్థితుల్లోంచే మళ్ళీ నీ పిల్లలకు చదువు చెప్పిస్తావు. చదువుకొని వాళ్ళూ నీకులాగే తయారవుతారు. దీనికి అంతం లేదు....'' అన్నాడు సురేష్.

సురేష్ యిలా వివరించాక నా కతడిమీద కోపం కలగలేదు. నెమ్మదిగానే అతణ్ణి అడిగాను—"ఇందుకు నీ సలహా ఏమిటి?"

"చాలా సింపిల్! చదివిన చదువుకూ చేసే ఉద్యోగానికీ సంబంధం లేని ఈ దేశంలో అసలు చదువెందుకు? నలుగురికీ పనికొచ్చే పని నేర్చుకోవడం మంచిది. పకోడీలు వేసి జంక్షన్లో అమ్మితే నాలుగు డబ్బులు సంపాదించుకోవచ్చు. సరుకులు ప్యాక్ చేసి ఇంటింటికీ తీసుకెళ్ళి యిస్తే డబ్బు సంపాదించవచ్చు. ఓ ఏడాది కష్టపడి స్కూటర్లూ, కార్లూ రిపేర్ చెయ్యడం నేర్చుకొన్నా చాలు!

ఇంకా చెప్పాలంటే—పట్నాల్లో ప్రజలు ఎంత బిజీ అయిపోతున్నారంటే తమ పనులు తాము చూసుకోవడమే వాళ్ళకు సాధ్యం కావడంలేదు. ఓ ఏజన్సీ పెట్టి ఎవరెవరికి ఎటువంటి పనులు కావాలో చేస్తాననొచ్చు. ఓ యింట్లో కరెంట్ రిపేరుంటుంది. మరో ఇంట్లో వడ్రంగి పని వుంటుంది. ఇంకో యింట్లో రేడియో పని చేయదు. ఇలాంటి గృహ సమస్యల్లో సాయపడే నమ్మకమయిన కంపెనీ వుంటే ప్రజలకెంతో వుపయోగం. నువ్వు ఆయా కంపెనీలలో కనెక్షన్స్ పెట్టుకుని ఇటు ప్రజలకూ, అటు కంపెనీలకూ మధ్య బ్రోకరుగా పని చేశావంటే బోలెడు సంపాదించవచ్చు. ఇంతేకాదు-ఆలోచిస్తే లక్ష ఉపాయలుంటాయి. కానీ మన యువతరం ఆలోచించడం మర్చిపోయింది కదా! చదువు—ఉద్యోగం—ఈ రెండే వీళ్ళకు

తెలిసినది!" అన్నాడు సురేష్.

అతను చెప్పింది పూర్తిగా నిజమని తోచింది నాకు. అప్పటికప్పుడు అతను చెప్పింది చేయాలన్న ఆవేశం కలిగింది నాకు. మళ్ళీ నెమ్మదిగానే "ఏ వ్యాపారానికైనా పెట్టుబడి కావాలి....అది కూడా లేదు నాకు...." అన్నాను.

"వ్యాపారానికంత పెట్టుబడి కావాలేమిటి?" అన్నాడు సురేష్.

ఏదో అంకె చెప్పాలని ఆగిపోయాను. అసలు నేనేం వ్యాపారం చేయబోతున్నానో నాకే తెలియదు.

సురేష్ నవ్వి—"నీకు నేను వెయ్యి రూపాయలిస్తాను. ఉత్తినే కాదు—అప్పుగా! వ్యాపారం చేసి రెండు మూడు నెలల్లో వడ్డీతోసహా నా బాకీ నాకు తీర్చేయాలి. వడ్డీ ఎంతో కాదు. ఏడాదికి నూటికి పదిరూపాయలు. ఓకే!" అన్నాడు.

వెయ్యి రూపాయలనగానే నా కెంతో ఉత్సాహం కలిగింది. వెంటనే తలూపేశాను. సురేష్ నా వివరాలన్నీ నోట్ చేసుకొని, పత్రం రాయించుకొని మరీ డబ్బిచ్చి—"నా డబ్బు నేను వసూలు చేసుకోవడంలో నాకు నేనే సాటి! మూడు నెలల్లో నా బాకీ తీర్చేయాలి. గుర్తుంచుకో!" అన్నాడు.

నేను వినయంగా తలూపాను. వెయ్యి రూపాయలు నా శరీరానికిచ్చిన శక్తి ఇంతా అంతా కాదు. ఉత్సాహంగా ఇంటికి వెళ్ళాను. అక్కడ నాన్న ఎవరితోనో మాట్లాడుతున్నాడు.

ముందు అప్పులవాడేమోనని లోపల అడుగెట్టడానికూడా భయపడ్డాను. కానీ తీరా చూస్తే మాటలు

సౌమ్యంగా వినవస్తున్నాయి. నాన్నతో అంత సౌమ్యంగా మాట్లాడే అప్పులవాడు లేడు. అందుకు అప్పులవాళ్ళనీ తప్పుపట్టి ప్రయోజనంలేదు. వాళ్ళంతా సమానం ఒక్కసారిగా కోల్పోలేదు. ఎప్పటికీ అప్పులు తీర్చకపోవడంతో నాన్నపట్ల వాళ్ల సౌమ్యత చచ్చిపోయింది.

వచ్చినవాడు అప్పులవాడై ఉండడని అనిపించేక కాస్త ధైర్యంగా లోపలకు అడుగుపెట్టాను.

"అబ్బే—వెయ్యి రూపాయలు—మావల్ల ఎక్కడవుతుందండీ—మాకా అదృష్టం లేదు—" అంటున్నాడు నాన్న.

బహుశా చెల్లెలికి పెళ్ళి సంబంధం వచ్చి వుంటుంది. వెయ్యి రూపాయలైనా లేకుండా పెళ్ళెవరు చేసుకొంటారు? నాన్న తన కూతుళ్ళకు ఈ జన్మలో పెళ్ళి చెయ్యలేడనిపించింది. ఈ విషయమై నేనే పూనుకొని—నా దగ్గరున్న వెయ్యి రూపాయలతో వ్యాపారం ప్రారంభించి—ఏడాది తిరక్కుండా వేలకు వేలు సంపాదించి—చెల్లెలి పెళ్ళి ఘనంగా చేస్తాను. అంతవరకూ ఈ విషయంలో కలగజేసుకోకూడదు. లేకపోతే వున్న ఒక్క వెయ్యీ యిప్పుడే హుళక్కి అయిపోతుంది. ఇలాగనుకొని నెమ్మదిగా లోపలకు జారుకోబోయాను.

"అడుగో అబ్బాయొచ్చాడు. విషయం ఓసారి అతడికీ చెప్పి చూస్తే!" అన్నాడాయన.

ఆయన నన్నెలా గుర్తుపట్టాడో నాకే తెలియలేదు. కానీ నా కాయాన గుర్తు రావడంలేదు. ప్రస్తుతం బికారిలా వున్న నేను తగుదునమ్మా అంటూ చెల్లెలి పెళ్ళి మాటల్లో పాల్గొనడం దేనికి?—ఆయన మాటలు విననట్లుగా లోపలికి నడిచాను.

"ఒరేయ్—ఇల్లా రారా!" అంటూ నాన్న నన్ను పిలిచాడు. తప్పనిసరై వెనక్కి తిరిగాను.

"ఈయన పేరు రామచంద్రయ్యగారు. ఈయన మన కుటుంబానికి బాగా కావలసినవాడు. నెలకు వెయ్యి రూపాయల ఉద్యోగం ఒకటున్నదట. వెయ్యి రూపాయలు లంచమిస్తే దొరుకుతుందని చెప్పడానికి వచ్చాడు. అది మనవల్ల అయ్యే పని కాదని నే నంటున్నాను. నువ్వు యీ విషయం ఒప్పుకొంటావని నాకు తెలుసు. కానీ తర్వాత చెప్పలేదని ఏడుస్తావని చెబుతున్నాను—" అన్నాడు నాన్న.

ఆశ్చర్యం, ఆనందం ఒక్కసారిగా కలిగాయి నాకు. నెలకు వెయ్యి రూపాయల జీతమా? అందుకు పెట్టుబడి వెయ్యి రూపాయలా? ఎంత చౌక? చౌక అని నే ననుకోడానికి కారణం—నా జేబులో వున్న—తేరగా వచ్చిన—డబ్బు! నేను రామచంద్రయ్యగారిని వెంటనే వివరాలడిగాను.

ఉద్యోగం మంచిదేకానీ అది రామచంద్రయ్య చేతిలో లేదు. డబ్బు పుచ్చుకొనే అతడివద్దకు ఆయన నన్ను తీసుకొని వెడతాడు. ఆ మనిషి నమ్మకస్థుడు. ఉద్యోగం తప్పక వస్తుంది. అయితే ఏ విషయంలోనూ రామచంద్రయ్య పూచీపడలేదు. సమాచారం తెలిసి—ఎరిగున్నవాళ్ళు కదా అని సాయపడదామని వచ్చాడు. వ్యవహారంలో కొంత రిస్కు ఉందని ఆయనా ఒప్పుకొన్నాడు.

నేను ఎంతోసేపు ఆలోచించలేదు. వ్యవహారంలో కొంత రిస్కు వున్నప్పటికీ—ఫలితం చాలా ఆశాజనకంగా వుంది. రిస్కు తీసుకోకపోతే బంగారంలాంటి అవకాశం

పోతుందనుకోవచ్చు. చేతకాని వ్యాపారంకంటె ఇదే మంచి రిస్కు అనిపించింది నాకు.

"ఇప్పుడే వెడదామా?" అన్నాను.

నాన్న రామచంద్రయ్య కూడా ఆశ్చర్యపోయారు.

"ఎక్కడిదిరా నీకంత డబ్బు!" అన్నాడు నాన్న.

"నాకో మంచి స్నేహితుడు దొరికాడు. ఇలాంటి సమయంలో అతను తప్పక సాయపడతాడు. సాయ పడగల శక్తి కూడా అతడికున్నది—" అన్నాను పొడి పొడిగా.

రామచంద్రయ్య క్యాలండరు తీసుకురమ్మన్నాడు. అది చూసి మర్నాడు సాయంత్రం నాలుగింటికి ముహూర్తం పెట్టాడు. ఆ ముహూర్తం ప్రకారమే మర్నాడు బయల్దేరాం.

# 3

రామచంద్రయ్య నన్నో చిన్న బంగళాకు తీసుకొని వెళ్లాడు. తను బయటవుండి నన్ను లోపలకు పంపించాడు. లోపల గదిలో నేనో వ్యక్తిని కలుసుకొన్నాను.

అతడికి నలభై ఏళ్ళుంటాయి. నిండైన ముఖానికి ముచ్చటైన మీసాలు. నావంక హుందాగా చూసి—"నా పేరు గోవిందరావు. నీ పేరు?" అనడిగాడు.

పేరుతోపాటు నా వివరాలు కూడా చెప్పాను.

"నెలకు వెయ్యి రూపాయల జీతమంటే మాటలు కాదు. అలాంటి ఉద్యోగానికి పదివేలైనా ఇస్తామంటూ చాలామంది సిద్ధంగా వున్నారు. అయితే నాదొక్కటే ఆశయం. మా నాన్న చెప్పాడు—నీ బ్రతుకు తెరువు కోసం నువ్వేం చేసినా సరే కానీ—ఎప్పుడూ పేదవాళ్ళకు సాయపడమని. నా కూళ్ళో నేకాదు దేశమంతటా పలుకుబడి

వుంది. పెద్ద పెద్దవాళ్ళ కీలకాలన్నీ నాకు తెలుసు. అందువల్ల నేను పేదవాళ్ళ కుద్యోగాలిప్పించి సాయపడుతూంటాను. పేదవాళ్ళంటే ఎవరు? నెలకు వెయ్యి రూపాయల జీతమిచ్చే ఉద్యోగం సంపాదించడానికి లంచంగా ఒక్కటంటే ఒక్క వెయ్యి రూపాయలకు మించి ఇవ్వలేనివారు—అనుకుంటావా?" అంటూ నవ్వాడాయన.

నేనూ నవ్వాను. ఆయన చెప్పిన మాటల్లో మూడు వంతులకు పైగా నిజముంది.

గోవిందరావు మళ్ళీ అన్నాడు—"నాకు పేదవాళ్ళ మీద జాలి వుంది. కానీ జాలి మాటల్లో ప్రకటిస్తే ఏం లాభం? అందువల్ల పేదవాళ్ళకేం ఉపకారం జరగదు. జాలిని ప్రదర్శించడానికున్న ఏకైక మార్గం డబ్బు. నీకు లాగే రేపు పదిమంది పేదవాళ్ళకి సాయపడాలంటే, వాళ్ళమీద నేను జాలిపడాలంటే నాకు డబ్బుకావాలి. అందుకే మరో షరతు పెడుతున్నాను. నువ్వుద్యోగంలో చేరినాక అయిదేళ్ళపాటు నెలకు వంద రూపాయల చొప్పున నాకిచ్చుకోవాలి!"

నా దగ్గర పైసా లేదు. వచ్చే జీతం వెయ్యయితే నేం-తొమ్మిదివంద లయితే నేం? ఉద్యోగమంటూ రావాలి గానీ—నెలకు అయిదొందలిమ్మన్నా ఇవ్వగలననిపిస్తోంది. ఆయనడిగింది చాలా చౌక అనిపిస్తోంది. ఎటొచ్చీ ఆ విషయం పైకి అంటే ఆయనిప్పుడే రేటు పెంచేయగలడు. అందుకే అది ఆనకుండా అంగీకారాన్ని తలూపి తెలియజేశాను.

గోవిందరావు నోటిమాటతో తృప్తిపడలేదు. నేను తనకు డబ్బు బాకీ వున్నాననీ ఫలానా ఉద్యోగం

రాగానే నెలకు వందరూపాయల చొప్పున అయిదు సంవత్సరాలలో బాకీ తీరుస్తాననీ పత్రం రాయించు కున్నాడు. తర్వాత నా దగ్గర వెయ్యి రూపాయలూ పుచ్చుకొని నాచేత ఓ అప్లికేషన్ ఫారం పూర్తి చేయించాడు.

"అసలీ ఉద్యోగం విషయం ఎవ్వరికీ తెలియదు. సరిగ్గా నెల్లాళ్ళలో నీకు ఇంటర్వ్యూ వస్తుంది—" అన్నాడు గోవిందరావు నా వైపు చూసి అదోలా నవ్వుతూ.

ఆయన మాట అబద్ధంకాలేదు. సరిగ్గా నెల రోజుల్లో నాకా కంపెనీనుంచి ఇంటర్వ్యూ లేఖ అందింది. ఉత్సాహంగా వెళ్ళాను. అయితే నేనూహించినట్లు ఇంట ర్వ్యూకు నేనొక్కడిని మాత్రమే అభ్యర్థిని కాదు. మొత్తం వందమంది వున్నారు నాలాంటి వాళ్ళు.

"పేపర్లో అడ్వర్టయిజ్ మెంట్ లేదుగదా! ఈ ఉద్యోగం గురించి మీకెలా తెలిసింది?" అని ఒకత నడిగాడు.

"మీకెలా తెలిసింది?" అని అతను తపీమని అడిగాడు. అది ప్రశ్నో, జవాబో నాకే తెలియలేదు. అయినా నిరుత్సాహపడకుండా మరొకణ్ని అడిగాను.

"ఏముంది? దీనికీ ఏజంట్లున్నారు. ఈ రోజుల్లో అన్నింటితోపాటు ఉద్యోగాలు కూడా స్మగ్లింగువల్లే దొరుకుతున్నాయి. బంగారం చవగ్గా కావాలంటే స్మగ్లర్సను పట్టుకోవాలి. ఉద్యోగాలు తేరగా కావా లన్నా అంతే!" అన్నాడతను.

చాలామంది చెప్పిందాన్నిబట్టి అందరూ నాలాగే అక్కడికి వచ్చారనిపించింది. పోస్టు చూస్తే ఒక్కటే

ననుకుంటూను. వచ్చింది కందమంది. అందువల్ల గోవింద రావుకు దొరికింది లక్ష. అసలా లక్ష రూపాయలమీద వచ్చే వడ్డీతోనే నెలకు వెయ్యిరూపాయల జీతగాణ్ని నియమించవచ్చు.

"ఆలోచనుంటే డబ్బు సంపాదించడానికి లక్ష మార్గాలు!" అన్న సురేష్ మాటలు నాకు గుర్తొచ్చాయి.

ఈ ఉద్యోగం నాకు వస్తుందా అన్న అనుమానం ప్రారంభమైంది. ఇంటర్వ్యూ మాత్రం బాగానే చేశాను. గోవిందరావు నాకు ఎంతో నమ్మకంగా చెప్పడమేకాక జీతంలోంచి నెలకు వంద పుచ్చుకుంటానని పత్రం కూడా రాయించుకొన్నాడు. ఏమో—అంతా అలాగే పత్రాలు రాశారేమో!

నా అనుమానం తీరిపోవడానికి పదిరోజులకంటె పట్టలేదు. కంపెనీనుంచి నాకు రిగ్రేట్ లెటర్ వచ్చింది. అది చూస్తూనే నేను గోవిందరావు ఇంటికి వెళ్ళాను. అక్కడ నాకు ప్రవేశం దొరకలేదు. అయ్యగారు ప్రస్తుతం ఎవర్నీ చూడరని కాపలావాడు చెప్పేశాడు.

ఏం చేయాలో తోచలేదు నాకు. అనుమతి కోసం రామచంద్రయ్యగారింటికి వెళ్ళాను.

ఆయన నన్ను చూసి విషయమేమిటని అడిగి తెలుసుకొని కంగారుగా—"ఇలా జరుగుతుందని నాకు తెలియను. ఆ గోవిందరావు నాకు బాగా తెలిసినవాడు. పద—విషయం కనుక్కొందాం—" అన్నాడు.

ఇద్దరం మళ్ళీ గోవిందరావింటికి వెళ్ళాం. వాచ్ మాన్ ఈసారి రామచంద్రయ్యను మాత్రం లోపలకు వెళ్ళ నిచ్చాడు. ఆయన లోపలకు వెళ్ళి వచ్చి — "భలేవాడి

వయ్యా—అనవసరంగా కంగారుపడ్డావు. ఆ కంపెనీ వాళ్ళు ఇంకా మనుషుల్ని తీసుకుంటారుట. అయిదారు నెలల్లోపున నీకూ ఉద్యోగం వస్తుందిట. ఇంక వేరే అడ్వర్టయిజ్మెంటుండదట. మొన్న ఇంటర్వ్యూకు వెళ్ళిన వాళ్ళలోంచే ఎన్నిక చేసుకుంటారుట—" అన్నాడు.

"బాగుందండి. ఆ విషయం వాళ్ళ రిగ్రేట్ లెటర్లో రాసిలేదు—" అన్నాను నేను.

కాసేపు, నాకూ రామచంద్రయ్యకూ వాదన జరిగింది. ఆఖరికాయన విసిగిపోయి—"చూడు నాయనా! ఏదో ఎరిగున్నవాళ్ళు కదా అని సమాచారమిచ్చాను. ఇందులో నేను చేయగలిగిందేముంది? పోనీ ఆ వెయ్యిరూపాయలూ నన్ను వెనక్కిమ్మంటావా? ఒక్కసారిగా అంత డబ్బు నీకిచ్చుకొనే స్తోమత నాకు లేదు. చేసిన పాపానికి నెలనెలా పదో పాతికో నీకిచ్చి బాకీకింద తీరుస్తాను. సరా?" అన్నాడు.

ఇంకేమనాలో తెలియలేదు. వెయ్యి రూపాయలూ చెయ్యి జారిపోయాయి.

## 4

సుర్ష్ ఈ ప్రపంచాన్ని కాచి వడబోసినట్లున్నాడు. అంతా అతడు చెప్పినట్లే జరుగుతోంది.

అతడికి నేనిప్పుడు వెయ్యిరూపాయలు బాకీవున్నాను. ఆ బాకీ తీర్చకపోతే అతడిముందు తలెత్తుకోలేను. అదీకాక నా కాళ్ళమీద నేను నిలబడే ఉపాయం నేనింకా వెతుక్కోవలసే వున్నది.

ముఖ్యంగా నాకు గోవిందరావుమీద ఎంతో పగగా వున్నది. మనిషి ఎంతో ఘరానాగా కనబడుతూ ఇలా మోసంచేసి జీవిస్తున్నాడు వాడు. నాలాంటి అమాయకుల్ని

మోసం చేసి—ఆ డబ్బుతో హాయిగా బ్రతుకుతున్నాడు వాడు. వాడికి నేను బుద్ధి చెప్పాలి. బాగా బుద్ధి చెప్పాలి. అందుకొక్కటే మార్గం.... నేనే వాడింట్లో దొంగతనం చేయాలి.

ఇదివరలో చాలాసార్లు నా బుద్ధి దొంగతనం వైపు మళ్ళింది. కానీ అప్పట్లో ఆవేశం నాకు సహకరించలేదు. నావంటివాడు దొంగగా మారాలంటే కోరిక ఒక్కటే సరిపోదు. విపరీతమైన ఆవేశం కావాలి.

అనుకోకుండా వెయ్యిరూపాయలొచ్చాయి. ఉద్యోగానికి ఆఫరొచ్చింది. కొంతకాలం నేను రంగురంగుల ఆశల భవనాలు సృష్టించుకొని వాటిలో నివశించాను. అవన్నీ ఒక్కసారిగా మాయమైపోయాయి. వెయ్యి రూపాయలూ పోయాయి.

గోవిందరావు నన్ను చూడ్డానిక్కూడా నిరాకరించాడు. వాణ్ని నమిలి మింగేయాలన్నంత కోపంగా వుంది నాకు.

అన్నీ కలిపి ప్రస్తుతానికి నేను నిర్ణయించుకొన్నదేమిటంటే-గోవిందరావు ఇంట్లో దొంగతనం చేయాలని!

అందుగురించి ఓ రెండు రోజులు వాడింటిచుట్టూ తిరిగి అనుపానులు తెలుసుకొన్నాను. బంగళా చుట్టూ పిట్టగోడ వుంది. గోడ దూకితే లోపలకు వెళ్ళడం పెద్ద కష్టంకాదు. గోడ ఎక్కడ దూకాలో కూడా నిర్ణయం తీసుకొన్నాను.

రెండు రోజులు రాత్రి సమయాల్లో గోడచుట్టూ తచ్చాడాను కానీ నాకు ధైర్యం చాలలేదు. చివరి క్షణంలో ఏదో భయం నన్నావహించి వెనక్కు లాగేది. ఇంకిలా లాభంలేదనీ తెగించాలని నిర్ణయం తీసుకొని

మూడోరోజున గోడ ఎక్కబోతుండగా నన్నెవరో చేయిపట్టుకొని లాగారు. నా పై ప్రాణాలు పైనే పోయాయి. అలా లాగిన వాడు ఇంటి వాచ్‌మనే అయుండాలి. వెధవ—వీడికి మరీ యింత జాగరూకత వుంటుందనుకోలేదు. కాసేపటి క్రితం నేను చూసినప్పుడు గేటు దగ్గర కునికిపాట్లు పడుతున్నాడు.

అయితే నన్ను పట్టుకొన్నది వాచ్‌మన్ కాదు. సురేష్!

"ఏమిటీ పని?" గద్దించాడు సురేష్.

"నువ్వా? నన్నెక్కడ చూశావు?" అన్నాను ఆశ్చర్యంగా.

"ఇంటి చుట్టూ అనుమానాస్పదంగా ప్రదక్షిణాలు చేస్తున్నావు. ఏం చేస్తావోనని రహస్యంగా కనిపెడుతూంటే గోడెక్కావు?" అన్నాడు సురేష్.

చటుక్కున నా బుర్ర పనిచేసింది — "ముఖ్యమైన ఉత్తరం ఒకటి గాలికి ఎగిరి గోడవతలపడింది. తెచ్చుకొందామనీ....గోడ ఎక్కితే....నువ్వు క్రిందకు లాగావు" అన్నాను.

"నీలాంటివాడే దూడ గడ్డికోసం కొబ్బరి చెట్టెక్కాడట...." అని నవ్వాడు సురేష్.

సురేష్ తెలివిగా నానుంచి నిజాన్ని రాబట్టాడు. అంతా విని—"నువ్వెందుకూ పనికిరావు—నీ మనసు దొంగతనం వైపుకే పరుగులు తీస్తోంది. ఒక్క దొంగతనంతోనే పట్టుబడి జైల్లో కూర్చుంటావు. ఆ తర్వాత నుంచి నువ్వు దొంగతనాలు మానేసినా కూడా దొంగగానే మిగిలిపోతావు—" అన్నాడు.

"ఏదో ఒకటి—గోవిందరావువంటి వాళ్ళను దోచడం

వల్ల ప్రజలకు సేవ చేసినవాణ్ని కూడా అవుతాను—" అన్నాను.

"అలాగా-అయితే ఆ రోజు నీ కంపెనీ ఇంటర్వ్యూలో ఉద్యోగం రానివాళ్ళందరి అడ్రసులూ కనుక్కొని వాళ్ల డబ్బు వాళ్ళకు పంచిపెడతావా? అప్పుడే నీది ప్రజాసేవ అనిపించుకొంటుంది—" అన్నాడు సురేష్.

నా దొంగతనాన్ని ప్రజాసేవ అన్నందుకు సిగ్గుపడ్డాను—ఇందులో ప్రజాసేవ ఏమిటి? నేను నాకోసం మాత్రమే దొంగతనం చేస్తున్నాను. అది నా స్వార్థం-అంతే!

"పిట్ట గోడ దూకగానే డబ్బు దొరకదు, ఇంట్లో అడుగుపెట్టాలి. జాగ్రత్తగా మసలాలి. తాళాలెక్కడున్నాయో తెలుసుకోవాలి. అలికిడి కాకుండా ఇనప్పెట్టె తలుపులు తియ్యాలి. అప్పుడు డబ్బు దొరుకుతుంది. ఈ తతంగం జరక్కుండా ఆపడానికిప్పుడెన్నో ఆధునిక సదుపాయాలున్నాయి. నువ్వినప్పెట్టె తలుపులు తెరవగానే పెద్ద పెట్టున అలారం మ్రోగవచ్చు—అసలు రాత్రిళ్ళు ఇనప్పెట్టె చుట్టూ నేల జారుడుగా చేసే ఏర్పాట్లు కూడా వున్నాయి. అక్కడికి సమీపించగానే జారిపడిపోవచ్చు. ఇవన్నీ తెలుసుకోకుండా దొంగతనం చేయాలనుకోవడం తెలివితక్కువ!" అన్నాడు సురేష్.

"నీ బాకీ తీర్చుదామనే నా తాపత్రయమంతా...." అన్నాను.

"పోనీ—నా బాకీ తీర్చవద్దు. నువ్వు దొంగతనానికి మాత్రం పాల్పడవద్దు—" అన్నాడు సురేష్.

ఇంకేమనాలో తెలియలేదు నాకు. అతను చెప్పేది నా మంచికే అయినప్పుడు నేనింకేమనగలను?

# 5

ఇది జరిగిన నాలుగు రోజులకు రామచంద్రయ్య మా యింటికి వచ్చి—"బాబూ—నిన్ను గోవిందరావు కలుసుకొని మాట్లాడాలంటున్నాడు—" అన్నాడు.

నేను చాలా ఆశ్చర్యపోయాను. నాకే ధోకా ఇచ్చి తర్వాత నా ముఖం కూడా చూడని మనిషి నా కోసం కబురు పెట్టాడంటే యేదో పెద్ద విశేషమే వుండి వుండాలి. ఆత్రుత కూడా నాక్కలిగింది. గోవిందరావింటికి వెళ్ళాను.

ఆయన నన్ను సాదరంగానే ఆహ్వానించి—"జరిగిందానికి నీకు ముఖం ఎలా చూపించాలో తెలియక నిన్ను లోపలకు రానివ్వలేదు. నువ్వేమనుకొన్నావో తెలియదు. కంపెనీలో ఓ బద్మాష్ నన్ను మోసం చేశాడు. నాకు చెప్పినట్లే వాడు చాలామందికి చెప్పడంతో ఇంటర్వ్యూకి ఒక్కడల్లా వందమంది అయ్యారు. నేను పెద్ద దెబ్బ తిన్నాను. నాకే ఇలా వుంటే నీ కెలాగుంటుందో వేరే చెప్పాలా?" అన్నాడు.

నాకేమనాలో తెలియలేదు. ముందరికాళ్ళకు బంధం వేశాడీయన—"వెయ్యిరూపాయలంటే నాకెంత కష్టమో ఊహించుకోవడం మీకు కష్టంకాదు—" అన్నాను ముక్తసరిగా.

"ఆ వెయ్యి నాకు దక్కివుంటే నీకు వెనక్కైనా ఇచ్చేసి వుండేవాణ్ని. ఆ బద్మాష్‌గాడది కొట్టేశాడు. ఉద్యోగం వచ్చేక నెలనెలా నువ్విచ్చేదే నాకు వచ్చే లాభం. ఇప్పుడు నువ్విచ్చిన పత్రం మినహా ఇంకేం లాభంలేదు. దీనివల్ల నాకేం ప్రయోజనం? ఇటు డబ్బూ కలిసిరాలేదు. అటు చెడ్డ పేరూ వచ్చింది. ఏది ఏమైనా

మా నాన్న చెప్పనే చెప్పాడు. ఎల్లప్పుడూ పేదలకు సాయపడమని! అందుకే నిన్నిప్పుడు పిలిపించాను. పని మరీ అంత సులభమైనది కాదు. కానీ ప్రతిఫలం బాగా వుంటుంది—ఆలోచించుకో!" అన్నాడు గోవిందరావు.

"నాకు అర్థం కాలేదండి!" అన్నాను.

గోవిందరావు వివరించాడు. మా యింటికో మనిషి వచ్చి వారం రోజులుండి వెడతాడు. ఆయన్ను మా చుట్టంగా చెప్పుకోవాలి. ఆయన కోరిన సాయం చేయాలి. వారంరోజులకూ ప్రతిఫలంగా అయిదువేల రూపాయలు ముడతాయి.

అయిదువేలన్న మాట వినగానే నా బుర్ర పని చేయలేదు. అసలామనిషెవరూ — మా యింటికెందుకొస్తాడూ ఏం చేస్తాడూ అని కూడా అడిగి తెలుసుకోకుండా అన్నింటికీ ఒప్పుకొని అడ్వాన్సుగా ఆయనిచ్చిన రెండువేలూ పుచ్చుకొన్నాను.

ఇప్పుడు నాకు గోవిందరావుమీద కోపమేంలేదు. ఇది నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. మనిషిమీద మనిషికున్న అనుభూతి ఏదీ శాశ్వతంకాదు. అన్నింటినీ డబ్బు ఒక్కటే కాసి స్తుంది. నా దగ్గర వెయ్యిరూపాయలు కాజేశాడని గోవిందరావును చంపేయాలన్నంత కోపం వచ్చింది నాకు. ఇప్పుడాయన నాకు అయిదువేలొచ్చే మార్గం చూపడంతో ఆ కోపమంతా పోయి ఆ స్థానంలో ప్రేమ కూడా పుడుతోంది.

అదీకాక ఈ విధంగా నా జాతకమే మారిపోవచ్చు. ఎవడి అదృష్టంలో ఎప్పుడెలాంటి మలుపుంటుందో చెప్పడం కష్టం. ఆ వారం రోజుల్లోనూ గోవిందరావును బాగా ఇంప్రెస్ చేయగలిగితే నాకు ఇలాంటి బేరాలింకా

తగలవచ్చును.

ఉత్సాహంగా ఇంటికి వెళ్ళి నాన్నకు విషయం చెప్పాను.

"వాళ్ళెవరో? వాళ్ళకు మనం మర్యాదలు సరిగ్గా చేయగలమో లేదో—" అని నాన్న బెంగపడ్డాడు.

అయితే మేము అనవసరంగా బెంగపడ్డామని తర్వాత అనిపించింది. వచ్చినాయన సన్నగా, పుల్లలా వున్నాడు. ఆయన కూడా తెచ్చిన సూట్ కేసంత బరువుండడాయన అనిపించింది. మనిషి కూడా గొప్పవాడులాగాక చాలా సామాన్యంగా వున్నాడు. బట్టలకు మాసికలు లేవుగానీ చాకవేసని తెలిసిపోతున్నాయి.

అమ్మ ఆయన్ను అన్నయ్యగారూ అని వరసకలిపింది. అయితే ఆయన ఇంట్లో అందరితోనూ ముక్తసరిగా వుండేవాడు. వేళకు కాఫీ, భోజనం—అవీ మితంగానే! ఆయన పర్సనాలిటీకి తగ్గట్టుగానే, వుండేదాయన భోజనం. ఆయన తన పేరు ఆంజనేయులని చెప్పాడు.

ఆంజనేయులూ నేనూ కలిసి బజారుకు వెళ్ళాం. ఆయన దగ్గర చాలా డబ్బుంది! ఆయన నన్ను ఓ హోటల్ కు తీసుకువెళ్ళి వందరూపాయలనోటిచ్చి చిల్లర అడిగి తీసుకురమ్మన్నాడు. ఆ హోటల్లో చిల్లరివ్వరని నాకు తెలుసు. కానీ ఆయన చెప్పాడుగదా అని వెళ్ళి అడిగి తీసుకొచ్చాను. నిజంగానే చిల్లర లభించగానే నే నాశ్చర్యపడ్డాను.

ప్రతిరోజూ అయిదుచోట్ల ఆయన వందరూపాయలకు చిల్లర మార్చేవాడు. అలా నాలుగు రోజులు గడిచాయి.

నాకాయన ప్రవర్తన ఎంతో విచిత్రంగా వుండేది.

అయిదో రోజు సాయంత్రం ఆయన కాసేపు నన్ను

వదిలిపెట్టాడు. ఆ సమయంలో ఉత్సాహంగా నేను బజార్లో తిరుగుతూండగా సురేష్ కనబడ్డాడు. అతన్ని చూస్తూనే నేను—"నీ వెయ్యిరూపాయలు వడ్డీతోసహా తీర్చేస్తాను—" అన్నాను.

సురేష్ ఆశ్చర్యంగా—"ఏం జరిగింది? అంత డబ్బెక్కడిది నీకు?" అనడిగాడు.

చెప్పనా మాననా అని కాసేపు తటపటాయించి చివరికి చెప్పేశాను-"గోవిందరావు నిజంగా మోసగాడు కాదు. ఆయన దురదృష్టంకొద్దీ అలా జరిగింది. అందుకాయన ఎంతో నొచ్చుకొని డబ్బు సంపాదించే ఉపాయం నాకు చెప్పాడు—" అంటూ ఆంజనేయులు గురించి చెప్పాను.

జరిగింది వింటూనే సురేష్ కలవరపడుతూ ఆంజనేయులి దినచర్య గురించి అడిగితెలుసుకొని మరింత కంగారుపడి—"ఇంకా నీకు అర్థంకాలేదా? ఇదేదో పెద్ద స్మగ్లింగ్ వ్యవహారం—" అన్నాడు.

నేనూ కంగారుపడి—"ఇందులో నాకేం అలాంటిది కనపడలేదే!" అన్నాను.

"కనపడ్డానికేముంది? వాళ్ళు నోట్లమీద సందేశాలాకరికొకరు అందజేసుకొంటున్నారు. ఆఖరిరోజున ఏదో పెద్ద తమాషా జరుగుతుంది. ఈ విషయం పోలీసులకేమాత్రం తెలిసినా—స్మగ్లర్సుకు సాయపడినందుకు మీ కుటుంబమంతా ఇబ్బందుల్లో ఇరుక్కోవాల్సి వుంటుంది" అన్నాడు సురేష్.

సురేష్ అలాగనడం నాకు నచ్చలేదు. కానీ ఆంజనేయులు స్మగ్లర్ ముఠా వాడనడంలో అనుమానం లేదనిపించింది. లేనిపక్షంలో మా యింట్లో వారంరోజు

లుండడానికి అయిదు వేలెందుకిస్తారు? సురేష్ చెప్పిన ప్రకారం ఆ నోట్లమీద ఇన్విజిబుల్ ఇంక్‌తో సందేశాలుంటున్నాయి. ఆంజనేయులు చెప్పినచోటల్లా నాకు చిల్లర దొరికింది. సాధారణంగా ఎవరూ చిల్లర అడగని చోట్లనే ఆంజనేయులు చిల్లర అడిగాడు.

"అయితే నేనేం చేయాలి?" అన్నాను.

"వెంటనే పోలీస్ రిపోర్టిచ్చేయ్—...." అన్నాడు సురేష్.

నా శరీరమంతా భయంతో వణికిపోయింది. స్మగ్లర్ ముఠాలు నమ్మకద్రోహానికలా శిక్షిస్తాయో చాలా సినిమాల్లో చూశాను. ఏ అమితాబచ్చన్‌లాంటివాడో అది తట్టుకొని నిలబడగలడుగానీ నాలాంటివాడు తట్టుకోలేడు. నా మీద పగబట్టి వాళ్ళు నా కుటుంబాన్ని హింసించడం ప్రారంభిస్తే....!

నా భయం సురేష్‌కి చెప్పాను.

"ఈ మాత్రం ధైర్యంలేనివాడివి అసలు దొంగతనానికలా సిద్ధపడ్డావో? పట్టుబడిన దొంగను పోలీసులకప్పజెప్పేలోగా ఎలా కొడతారో చూడలేదా నువ్వు! అదీకాక గోవిందరావ్ మీద పగతీర్చుకోవాలనుకున్నావ్. అందుకిదేగదా మంచి అవకాశం!" అన్నాడు సురేష్.

పగ అని పట్టుకూర్చుంటే ఇంకా నాకు రావలసిన మూడువేలూ పోతాయి. అదీకాక ఇలాంటి అవకాశాలు ఇంకా ముందు ముందు ఎన్ని రానున్నాయో తెలియదు. చూస్తూ చూస్తూ బంగారు గ్రుడ్లుపెట్టే బాతుని ఎవరైనా చంపుతారా?

నేను సురేష్‌కి నా నిర్ణయం చెప్పేశాను!

"ఇలాంటి విషయాల్లో ఆదినిష్ఠూరం మంచిది. నువ్వో

లాంటి ప్రమాదకరమైన పనికి పాల్పడుతున్నావో నీకు తెలిసేసరికి చేతులు కాలిపోతాయి. నా మాట విను—" అన్నాడు సురేష్.

"మిస్టర్ సురేష్! నీకు డబ్బుంది. అందువల్ల డబ్బు విలువ నీకు తెలియదు. నాకో బంగారు అవకాశం వచ్చింది. దీన్ని నేను వదులుకోలేను. ముందు నీ వెయ్యి రూపాయలూ తీర్చి ఋణవిముక్తుడినైతే—నీ సలహాలు వినాలన్న బాధ కూడా నాకుండదు—" అనేసి అతణ్ని తప్పించుకొని వచ్చాను.

# 6

ఆ రోజున ఆంజనేయులు నన్నో హోటల్‌కు తీసుకు వెళ్ళాడు. అక్కడ మేనేజర్ని వినయంగా—"అగ్గిపెట్టె వుందా?" అనడిగాడు. మేనేజర్ తడుముకోకుండా అగ్గిపెట్టె యిచ్చాడు. ఆంజనేయులు పెట్టె కొద్దిగా తెరచి ఓ పుల్లబైటికితీసి దాంతో సిగరెట్ వెలిగించుకుని అగ్గిపెట్టె జేబులో వేసుకొన్నాడు. తర్వాత—"అయాం సారీ—అగ్గిపెట్టె మీదికదూ!" అంటూ అగ్గిపెట్టెను జేబులోంచి తీసి మేనేజర్‌కిచ్చేశాడు.

అప్పుడు నేనో విచిత్రం గమనించాను. ఆంజనేయులు తీసుకొన్నది గుఱ్ఱంమార్కు అగ్గిపెట్టె. ఆయన తిరిగిచ్చింది పులిమార్కు. దీన్నిబట్టి రెండు విశేషాలు తెలుస్తున్నాయి. తన జేబులో అగ్గిపెట్టె వుండగానే ఆంజనేయులు మేనేజర్ని అగ్గిపెట్టె అడిగాడు. అగ్గిపెట్టెల మార్పిడీ జరిగింది.

తనవద్ద సిగరెట్‌లైటర్ వున్నప్పటికీ ఆంజనేయులు అగ్గిపెట్టెను జేబులో వేసుకొన్నాడంటే అది కేవలం అగ్గిపెట్టెల మార్పిడీకోసమని ముందుగా ఆలోచించి

చేసినపని!

ఆ అగ్గిపెట్టెల్లో ఏముంది?

ఆంజనేయులు స్మగ్లరయుండాలని సురేష్ అన్నాడు. అది నిజంలాగా కన్పిస్తున్నది. అయితే నేనేం చేయాలి? ఆంజనేయుల్ని పోలీసులకు పట్టించాలా — లేక ఏమీ తెలియనట్లూరుకోవాలా?

ఇంకా నాకు మూడువేలొస్తాయి. అంతేకాదు. ఇలాంటి బేరాలింకా వస్తాయి.

ఎవరికీ అనుమానం రాకుండా వుండడంకోసం ఆంజనేయులు మా యింట్లో వున్నాడు. నాకు వరసకు మామయ్య అయి — నన్నూరంతా తనతో తిప్పుకొంటున్నాడు.

సాయంత్రం ఇంకో తమాషా జరిగింది. ఆంజనేయులు రెండు పాత సంచీలు తీసుకొని బజారుకు వెళ్ళి కూరలు కొనుక్కొచ్చాడు. అవి అమ్మకు ఇచ్చి రాత్రికేం కూరలు వండాలో అమ్మకు చెప్పాడు. తర్వాత నగరంలోకి ఆ సంచీలు తీసుకొని వెళ్ళాడు. ఆయన మళ్ళీ బైటకు వచ్చేసరికి రెండు చేతుల్లోనూ రెండు సంచీలూ మళ్ళీ నిండుగా వున్నాయి. ఆయనలో ఆ సంచీలు రెండూ ఏ అడ్రసుకు ఇవ్వాలో చెప్పాడు.

నేనా సంచీలను అందుకున్నాను. చూడ్డానికి కూరగాయల సంచీల్లా వుండడమే కాదు. వాటిల్లో పైన కూరగాయలే వున్నాయి. అయితే ఆ కూరగాయల అడుగున ఇంకేదో వుండాలని నా అనుమానం.

"ఈ సంచీలిచ్చి రాగానే నీ మూడు వేలూ నీకిచ్చేస్తాను. రేపు మధ్యాహ్నమే నా ప్రయాణం—" అన్నాడాంజనేయులు.

సంచీలు తీసుకొని బయల్దేరాను. దారిలో ఎవరూ కనబడనిచోట వాటిలో ఏముందో చూశాను. సంచీల్లో కూరగాయల అడుగున పోలిథీన్ బాగ్సులో పెట్టబడిన నోట్లకట్టలున్నాయి—అన్నీ వందరూపాయల నోట్లు.

కాసేపు నా చేతులు వణికాయి. తర్వాత నా బుద్ధి చలించింది. మనసు మూడువేలకూ, ఆ సంచీలో డబ్బుకీ మధ్య ఊగిసలాడింది. అప్పుడు నా చదువు కొంచెం తలెత్తి—నమ్మకద్రోహం కూడదంది.

అసలు స్మగ్లింగ్ దేశద్రోహం. ఆ ద్రోహానికి సహకరించడం నమ్మకంగానూ—సహకరించకపోవడం నమ్మకద్రోహంగానూ ఆలోచిస్తున్నాను నేను. ఈ డబ్బు ప్రభుత్వానికి అప్పజెప్పి విషయం మొత్తం బైటపెడితే—అప్పుడు నమ్మకం అనిపించుకుంటుందేమో కానీ—ఈ డబ్బు నేను కొట్టేస్తే అది నమ్మకం అనిపించుకుంటుందా!

ఆలోచనలు పరిపరివిధాల పోతున్నాయిగానీ నేను చేసిందేమీ లేదు. ఆంజనేయులు చెప్పిన అడ్రసుకి బుద్ధిగా ఆ సంచీలిచ్చేయగా — అందుకొన్న మనిషి నన్నుండమని ఆ సంచీలు లోపలకు తీసుకెళ్ళి ఖాళీచేసి తీసుకొచ్చి మళ్ళీ నాకే ఇచ్చేశాడు. అది తీసుకుని ఇంటికెళ్ళాను. ఇంట్లో ఆంజనేయులు లేడు. ఆయన రాత్రి తొమ్మిదింటికి వచ్చాడు. వస్తూనే నన్ను గదిలోకి పిల్చి మూడువేలూ అందించి—"నువ్వు చాలా నమ్మకస్థుడివి. నీ యింటికి నెలానెలా చుట్టాలొస్తారు—" అని ఆశీర్వదించాడు.

అది సామాన్యమైన ఆశీర్వాదం కాదు. ఈ ఒక్క నెల చుట్టాల రాకతోనే మా ఆర్థిక ఇబ్బందులన్నీ మాయమైపోయాయి. ఇలా రెండు నెలలు జరిగితే మే

మెంతో పచ్చగా వుంటాం. మా అవసారాలనగా ఎంత? అయిదువేల రూపాయలతో మా అప్పులన్నీ తీరిపోయి సమాజంలో మాకు గౌరవస్థానం లభిస్తుంది. ఒకసారి అప్పులు తీర్చామంటే మళ్ళీ మాకు అయిదేళ్ళదాకా అప్పులు పుడతాయి కూడా!

ఆ రాత్రంతా ఎన్నోరకాల కలలు కన్నాను. తెల్ల వారుఝామున కాబోలు మా యింటికి ఎవరో వచ్చారు. ఆంజనేయులికోసమని చెప్పాడు. ఆంజనేయులితో ఏమో మాట్లాడాడు. ఏం మాట్లాడాడోకానీ ఆంజనేయులి ముఖం పాలిపోయింది. తన పెద్ద సూట్‌కేసుతో సహా ఆంజనేయులు ఆ వచ్చినాయనతో బయల్దేరాడు. వెళ్ళే ముందు మాకు వీడ్కోలు కూడా చెప్పలేదు. ఏం జరిగిందో నా కర్థంకాలేదు.

# 7

మధ్యాహ్నం నాకు గోవిందరావు ఇంటినుంచి పిలుపు అందింది.

"నువ్వు డబుల్ గేం ప్లే చేశావు. అందుకు తగ్గ ఫలితం అనుభవిస్తావు...." అన్నాడు గోవిందరావు.

ఆయన ఆరోపణ నాకు ఏ మాత్రమూ అర్థంకాలేదు. అదే చెప్పాను.

"అసలేం జరిగిందో అంతా చెప్పు!" అన్నాడు గోవిందరావు.

అన్నీ వివరంగా చెప్పాను. ఆంజనేయులు మాతో మాట్లాడకుండా హ డా వు డి గా వెళ్ళిపోవడం నా కాశ్చర్యాన్ని కలిగించిందనికూడా చెప్పాను.

"అయితే ఆ వచ్చింది పో లీ సు మ ని షి ని నీకు తెలియదా?" అన్నాడు గోవిందరావు.

అప్పుడు నా కళ్ళల్లో కనబడిన ఆశ్చర్యం చూసే గోవిందరావు నన్నుమానించడం మానేశాడనుకుంటాను.

"నువ్వు వెళ్ళొచ్చు. ఇంక నీ యింటికి చుట్టాలెప్పుడూ రారు. నీవల్ల మాక్కలిగిన నష్టమింతా అంతా కాదు—" అన్నాడు గోవిందరావు.

నేను నిరుత్సాహంగా ఇల్లుచేరాను. ఇంట్లో మాత్రం అంతా ఉత్సాహంగా వున్నారు.

"మళ్ళీ ఎవరైనా చుట్టాలొస్తారా?" ఉత్సాహంగా అడిగింది అమ్మ.

"ఇంక మనింటికిలా డబ్బిచ్చే చుట్టాల్రారు...." అన్నాను. అంతకుమించి ఇంకేమీ చెప్పలేదు. ఆంజనేయుల్ని పోలీసులు తీసుకువెళ్ళారన్న విషయం ప్రచారం కావడం నాకిష్టంలేదు.

"ఏమయిందిరా?" అంది అమ్మ ఆత్రుతగా.

నేనేమీ చెప్పలేదు. ఆలోచిస్తున్నాను. నెలకు అయిదువేల రూపాయల ఆదాయం పోయింది నాకు. ఇదెలా జరిగింది? ఏదో చిన్న పొరపాటు ఆంజనేయులి వ్యవహారం పట్టించింది. ఆ పొరపాటు నావల్ల జరిగిందా? ఆంజనేయులివల్ల జరిగిందా?

సమాధానం సరిగ్గా ఆ్రోజులకి లభించింది నాకు— కవర్లో వచ్చిన ఓ ఉత్తరం ద్వారా!

ఉత్తరం సురేష్ రాశాడు.

"మిత్రమా!

నీ యింట్లో వున్నది స్మగ్లరేనని నాకు రూఢీ అయింది. ఈరోజది నీకు లాభించినా మరో రోజున నీకది ఉరితాడై కూర్చుంటుంది. నా హెచ్చరికను నువు పాటించలేదు. అందుకని నేనే పోలీసులకు

రిపోర్టిచ్చాను. దీనిలో నీకేమీ సంబంధంలేదని చెప్పాను. అంతటితో వూరుకోక-నేను గోవింద రావుకు మారు పేరుతో ఓ ఉత్తరం రాశాను. ఆంజనేయులు పట్టుబడడానికి కారణం నువ్వు కాదనీ — వేరే ఓ సంస్థవారికి వ్యతిరేకంగా పని చేస్తోందనే అభిప్రాయం కలగజేశాను వారికి—ఆ ఉత్తరం ద్వారా!

ఈ విధంగా నీకేమీ ప్రమాదంలేకుండా నిన్ను స్మగ్లింగులో ఇరుక్కోకుండా చేశాను. ఇందుకీరోజు నువ్వు నన్ను తిట్టుకున్నా ఏదో ఓ రోజున మెచ్చుకుని తీరుతావు. ఎట్టి పరిస్థితిల్లోనూ నిన్ను చెడిపోనివ్వను.

నీ శ్రేయోభిలాషి
సురేష్."

జరిగిందేమిటో అర్థం చేసుకోగలిగాను. ఈ సురేష్ ఎవడో కానీ శనిలా దాపురించాడు. నెలకు అయిదువేల రూపాయల ఆదాయం పోగొట్టేశాడు. నాకు ఏడుపు, కోపం కసి ఒక్కసారిగా కలిగాయి.

అయితే ఈ సురేష్ నా పరీక్ష ఫీజుకు డబ్బు ఇచ్చాడు. వ్యాపారం చేసుకుందుకు వెయ్యి రూపాయలు పెట్టుబడిగా యిచ్చాడు. ఆ రెండు బాకీలూ ఇంతవరకూ తీర్చలేదు నేను. ఆ డబ్బు అతడి దగ్గర తీసుకుంటున్నప్పుడు నా కతను దేవుడిలా కనిపించాడు. కానీ ఇప్పుడు....

ఎలాగో అలాగ సురేష్‌ని కలుసుకోవాలనుకున్నాను. రెండు రోజులూరంతా గాలించగా అతను నాకు ఓ పార్కులో కలిశాడు. పలకరించి ముందు నా కసి

తీరేలా తిట్టేశాను.

సురేష్ మౌనంగా విని నవ్వాడు. తర్వాత నెమ్మదిగా "చిన్నప్పుడు పిల్లలకి చదువు మానేసి ఆటలకు పోవాల నుంటుంది. చదువుకోమని చెప్పే పెద్దలమీద పీకదాకా కోపం వుంటుంది. నీ కోపం నాకాశ్చర్యాన్ని కలి గించదు—" అన్నాడు.

ఏమనాలో నాకు తెలియలేదు. అతడు చాలా తెలివిగా మాట్లాడతాడు.

"పోయిందాని గురించి విచారించకు. నేనిచ్చిన వెయ్యి రూపాయలూ తెలివితక్కువగా పోగొట్టుకొన్నావు. మళ్ళీ ఇప్పుడు నీ చేతిలో కొంత డబ్బు చేరింది. ఆ డబ్బుతో వ్యాపారం గురించి ఆలోచించవేం? నీ బుర్రలో వ్యాపా రానికి సంబంధించిన ఆలోచనలేమీ లేవు. నెల నెలా ఇలా కష్టపడకుండా డబ్బు సంపాదించాలనుంది నీకు. కష్ట పడకుండా డబ్బు సంపాదించాలనుకోవడం చాలా ప్రమాదకరం. మనిషికి జీవితంలో సుఖంలేకుండా చేస్తుంది...." అన్నాడు సురేష్.

"నేనెలా బ్రతికితే నీకెందుకు?" అన్నాను.

"నాకు నీమీద ఆసక్తి పెరుగుతోంది. నీ నుంచి నేనో సాయం ఆశిస్తున్నాను...." అన్నాడు సురేష్.

"నానుంచి నువ్వాశించే సాయమేమిటి?" అన్నాను ఆశ్చర్యంగా.

"రేపు ట్రయిన్లో ఈ వూరొక అమ్మాయి వస్తోంది. ఆమెను మీ యింటికి తీసుకువెళ్ళి మీ చుట్టంగా చెప్పకుని వుంచుకోవాలి!" అన్నాడు సురేష్.

"ఓహ్—ఇంకో స్మగ్లింగ్ వ్యాపారమా?" అన్నాను

కాస వెటకారంగా.

"నేను నీ చేత స్మగ్లింగ్ వ్యవహారాలు చేయించడమా?" అన్నాడు సురేష్.

"మరా అమ్మాయెవరు?" అన్నాను.

"ఆ ప్రశ్నలేమీ నువ్వు వెయ్యొద్దు. ఆమెకు కూడా నా గురించేమీ చెప్పవద్దు. ఆమె నా ప్రసక్తి తెచ్చినా ఎరగనట్లే నటించాలి. మీ యిద్దరి పరిచయం కాకతాళీయంగా జరగాలి...." అన్నాడు సురేష్.

"ఇదంతా ఏదో మిస్టరీలా వుంది నాకు ...."

అన్నాను.

"ఇందులో మిస్టరీ ఏమీ లేదు. చుట్టాల్ని బాగా ఆదరిస్తావు నువ్వు. ఎటొచ్చి చుట్టాల విషయంలోనే కొంత అజాగ్రత్త వున్నది. ఆ విషయం నేను చూసుకుంటానులే" అన్నాడు సురేష్.

"ఇంతకీ ఆ అమ్మాయీ ఊరెందుకొస్తోంది!" అన్నాను.

"ఆమెకిక్కడ ఉద్యోగం వచ్చింది. ఆమె పేరు రాధ. ఇదీ ఆమె ఫోటో!" అంటూ అతనొక ఫోటో నాకు అందించాడు. ఆ ఫోటో చూడగానే కళ్ళు తిప్పుకోలేక పోయాను.

ఆ రాధ ఎవరో కానీ చాలా చాలా చాలా అందంగా వుంది.

# 8

ఆ ఫోటో నా మనసులో ముద్రపడిపోయింది. అందువల్ల మర్నాడు స్టేషన్లో ఆమెను గుర్తుపట్టడానికి ఏమీ ఇబ్బందిపడలేదు. ఆమెను చూస్తూనే—"రాధా—నేనిక్కడ!" అన్నాను.

ఆమె నా వంక ఆశ్చర్యంగా చూసి—"నువ్వెవరు?"

అంది.

నేను తడబడినట్లు నటించి—"అరే మా రాధను కున్నాను. పుస్తకాలు కొనడంకోసం స్టేషన్‌కు వచ్చాను. నిన్ను చూసి రాధనుకొని పొరబడ్డాను. మన్నించాలి—" అన్నాను.

ఆమె ఆశ్చర్యంగా—"నా పేరు కూడా రాధే!" అంది.

నేనామెతో మాటకలిపి వివరాలు తెలుసుకొని—"కొత్తగా ఈ ఊరొస్తున్నారా? ఎక్కడకు వెడదామని. పోనీ మా యింటికి వచ్చి వుండకూడదూ?" అన్నాను.

ఆమె అనుమానంగానూ, ఇబ్బందిగానూ చూసింది.

"నేనేమీ ప్రమాదకరమైన మనిషికాదు. మీకైతే మెట్రిక్ ప్యాసైతేపు నేర్చుకోగానే ఉద్యోగం దొరికింది. నేను బియ్యేప్యాసై రెండేళ్ళయినా ఉద్యోగం దొరకడంలేదు. నాలాంటివాడు దేశానికి ప్రమాదకారిగా తయారవుతాదేమో కానీ మీలాంటివారికేమీ హాని కలిగించలేడు—" అంటూ మా కుటుంబ వివరాలు చెప్పి—"మా యింట్లో ఊరికే వుండనవసరం లేదు. వుండే గదికి అద్దె కూడా ఇవ్వవచ్చు. నాకిద్దరు చెల్లెళ్ళున్నారు కాబట్టి మగాళ్ళకి మా యిల్లద్దెకివ్వంగానీ మీలాటి ఆడపిల్లల కద్దెకివ్వడానికి అభ్యంతరంలేదు—" అన్నాను.

ఏమనుకొందో ఆమె నాతో బయల్దేరి వచ్చింది. మా యిల్లూ, వాతావరణం చూసినాక ఆమెక్కలిగిన తృప్తి ఇంతా అంతా కాదు. ఆమె నాకు ధన్యవాదాలు చెప్పి—"నీ పరిచయం నా అదృష్టం!" అంది.

అదృష్టం నాదని నా మనసుకు అనిపించింది.

ఆమెతో నా పరిచయం ఎలా జరిగిందో తెలిశాక—

"నీకు తెలిసిన ఆ ఇంకో రాధ ఎవర్రా అన్నయ్యా!" అనడిగింది నా చెల్లెలు.

"అదంతా నాటకంలే-ఇంకే రాధా నాకు తెలియదు. కానీ ఈ విషయం నువ్వెవరివద్దా అనకూడదు. ముఖ్యంగా ఆ రాధ వద్ద అసలే అనకూడదు...." అన్నాను. ఏదో అర్ధమైనట్లుగా తమాషాగా నవ్వింది నా చెల్లెలు.

వారం రోజుల్లో నాకూ, రాధకూ పరిచయం పెరిగింది. రాధ నా గురించి విని—"నువ్వు నీ కాళ్ళమీదే నిలబడ్డానికెందుకు ప్రయత్నించవు?" అనడిగింది. అన్నాళ్ళూ సురేష్‌వల్ల కాని పని రాధ ఆ క్షణంలో అన్నమాటలు నామీద పనిచేశాయి.

ఆ రోజే నేను మా వీధిలో తిరిగాను. అందరిళ్ళకూ వెళ్ళాను. ఎవరెవరికి ఎటువంటి అవసరాలున్నాయో తెలుసుకొన్నాను. ఒక్కొక్కరి ఇంట ఎలాంటి పనులున్నాయంటే చిరిగిన బట్టలు టైలర్ చేత కుట్టించడానికి కూడా కొన్ని ఇళ్ళలో వీలుపడటంలేదు. ఏ టైలర్ ఒప్పుకుంటాడో, ఎవడొప్పుకోడో వాళ్ళకు తెలియదు.

మా వీధిలో అందరికీ నేను తెలుసు. అందువల్ల నిస్సంకోచంగా చాలా పనులప్పగించారు.

చిన్న చిన్న రిపేర్లున్న బట్టలో యాభైదాకా పోగుపడ్డాయి. ఒకరింట్లో గోడకు కర్ర చెక్కలు బిగించి అలమారా తయారుచేసే పని వుంది. ఇద్దరిళ్ళలో కుర్చీలకు పేము పోయింది. నలుగురిళ్ళలో రేడియోలు రిపేర్‌కున్నాయి. చాలామంది ఇంటికి పప్పులు, ఉప్పులు తెచ్చి ఇచ్చే సదుపాయం కావాలిట! వీధిలో ఎవరికి ఏ పని వున్నా నాకే చెప్పమని అందరికీ చెప్పాను. ఇది సురేష్ చెప్పిన ఉపాయమే! ఇది నాకెంతో ఉత్సాహాన్ని

కలిగించింది.

నా వ్యాపారం మా వీధిలో హిట్టయింది. ఓ పదిళ్ళకు నేను అపరాలు సరఫరా చేస్తున్నాను. ఇంటికి అయిదు రూపాయలు చొప్పున కమిషన్ ముడుతోంది. నా గురించి ఆ నోటా ఆ నోటా పక్క వీధులకి కూడా తెలిసింది. నా వ్యాపార పరిధి పెరుగుతోంది. రకరకాల పని వాళ్ళతో నాకు పరిచయాలేర్పడ్డాయి. రిపేర్ షాపుల వాళ్ళు చాలామంది నన్ను ఏజంట్సుగా నియమించు కున్నారు.

ఆరునెలలు గడిచేసరికి నేను ఏజెన్సీ స్థాపించి సినిమా హాల్లో స్లైడ్స్ వేయించే స్థితికి వచ్చాను. ఫోన్ పెట్టించాను. ఇప్పుడు నాకు ఫోన్ ద్వారా రిక్వెస్టులు వస్తున్నాయి. ఓ స్కూటర్ కొనమని సురేష్ సలహా ఇచ్చాడు.

"స్కూటర్ కి తక్కువేమీ అవదు. వ్యాపారంలో ముందే పెద్ద పరుగులకి పోరాదు—" అన్నాను.

"నువ్వేమీ పెద్ద పరుగులకు పోవడంలేదు. నేనుండగా నీ కేలోటూ రానివ్వను—" అన్నాడు సురేష్.

సురేష్ సలహామీద స్కూటర్ కొనడం కూడా అయింది. దాంతో నా వ్యాపారం మూడు పువ్వులూ, ఆరుకాయలూ అయింది. ఇలాంటి వ్యాపారంలో ఇంతలా డబ్బు సంపాదించుకోవచ్చునని నేనూహించలేదు.

ఇప్పటి జీవితం నాకెంతో తృప్తిగావుంది. బంధువుల్లో నాకు గుర్తింపు పెరిగిందనడానికి సాక్ష్యంగా నాకు పెద్ద కట్నంతో పెళ్ళి సంబంధాలు రాసాగాయి. అయితే నా మనసెప్పుడో రాధమీద లగ్నమైంది. ఆమెకూ నేను నచ్చినట్లే కనబడుతుంది. ముసుగులో గుద్దులాటెందుకని

ఓ రోజు నా మనసులోని విషయం ఆమెకు చెప్పాను.

"నువ్వంటే నాకిష్టం. మా పెద్దవాళ్ళకు చెప్పి అన్ని ఏర్పాట్లూ చేయించు...." అంది రాధ.

ఫలితంగా అంతా ఓసారి బయల్దేరి రాధ ఊరు వెళ్ళాం.

అక్కడ అన్ని మాటలూ జరిగాయి. నాకు కట్నం అక్కర్లేదని చెప్పాను. రాధ తలిదండ్రులకు ఒక్కర్తే కూతురు. తండ్రి ఏదో ప్రైవేట్ కంపెనీలో చిన్న ఉద్యోగి. వాళ్ళింట్లో గోడకున్న ఓ ఫోటో చూసి ఆశ్చర్యపడ్డాన్నేను. అది సురేష్‌ది!

"ఇతనెవరు?" అని అడక్కుండా వుండలేకపోయాను.

"మా అబ్బాయి సురేష్! నాలుగేళ్ళక్రితం మా దుర దృష్టంకొద్దీ రైలు ప్రమాదంలో చచ్చిపోయాడు—" అంటూ ఓసారి కళ్ళు తుడుచుకొన్నాడాయన.

నా ఆశ్చర్యానికి అంతులేదు. సురేష రాధకు అన్నయ్య. నాకు మిత్రుడు. అతడు చనిపోయాడని తండ్రి అంటున్నాడు. బ్రతికున్నట్లు నాకు తెలుసు. ఈ పొరపాటెలా జరిగింది?

సురేష్ బ్రతికుండీ చనిపోయినట్లు ఎందుకు నాటక మాడుతున్నాడు?

నేను ఆశ్చర్యంగా — "సురేష్ అనే పేరులో ఇదే రూపంగల మనిషి మూడేళ్ళనుంచీ నాకు తెలుసు—" అన్నాను.

రాధ తండ్రి ఆశ్చర్యంగా—"నువ్వేమంటున్నావో నాకు అర్థంకావటంలేదు బాబూ!" అన్నాడు.

నేను సురేష్ నాకు సాయంచేసిన విషయమూ, రాధ గురించి ముందుగా చెప్పిన విషయమూ కూడా చెప్పాను.

"సందేహంలేదు. వాడు నా కొడుకే—బ్రతికేవున్నాడన్నమాట ...." అన్నాడు రాధ తండ్రి. ఆయన కళ్ళలో కనబడిన వెలుగు సామాన్యమైనది కాదు. ఆయన వెంటనే భార్యను పిలిచి నా మాటలు చెప్పాడు. ఆవిడ నిశ్చేష్టురాలై పోయింది.

"నువ్వు మా యింటికి పెళ్ళిచూపులకొచ్చాడు—వరమివ్వడానికి వచ్చావు. వాణ్ని ఒక్కసారి మాకు చూపించి పుణ్యం కట్టుకో బాబూ—" అంది సురేష్ తల్లి.

నాకు అర్థంకానిదల్లా ఒక్కటే! సురేష్ బ్రతికుండి కూడా చనిపోయినట్లు ఎందుకు నాటకమాడుతున్నాడు?

ఈ ప్రశ్నకు సమాధానమివ్వగలిగిన వాడు సురేష్ ఒక్కడే!

రాధ తలిదండ్రులు నాతోపాటు బయల్దేరి మా ఊరొచ్చారు.

# 9

"ఎంత పని చేశావు—నా కొంప ముంచేశావు...." అన్నాడు సురేష్.

"అవతల నీ తలిదండ్రులు నీ కోసం ఎంతగానో తపించిపోతున్నారు. నువ్విలా అజ్ఞాతవాసం చేయడం దేనికి?" అన్నాను.

"అది నా దురదృష్టం!" అన్నాడు సురేష్.

"నాకేం అర్థంకావటంలేదు. నీకేం-బోలెడు డబ్బుంది! ఇంకా దురదృష్టమేమిటి?" అనడిగాను.

"ఆ డబ్బే నా దురదృష్టం...." అని నిట్టూర్చాడు సురేష్.

సురేష్ ముఖం చూడగానే అతడు తన కథ చెప్ప

బోతున్నాడని నాకు అర్థమైంది.

"నేను బియ్యే చదువుతూండగా మా నాన్నగారికి పెద్ద జబ్బుచేసింది. డబ్బు బాగా అవసరపడింది. ఎక్కడా దొరకలేదు. ఆ పరిస్థితుల్లో నేనో సేఠ్ ఇంట్లో దొంగతనం చేశాను. తొలి ప్రయత్నంలోనే విజయం సాధించాను. మా నాన్న జబ్బు నయమయింది. అప్పట్నించీ దొంగతనాలు ప్రారంభించాను. మొత్తం మూడు దొంగతనాలు బాగా జరిగాయి. నాలుగో దొంగతనంలో దొరికిపోయాను.

అది ఓ నగల వ్యాపారి ఇల్లు. నేను ప్రవేశించిన గదిలో ఆయనొక్కడే వున్నాడు. చప్పుడు చేయకుండా ఆయన తలగడ క్రిందనుంచి తాళాలు కూడా తీసి ఇనప్పెట్టె తెరిచాను. తలుపు తెరుచుకోగానే నా చేతికి సంకెళ్ళుపడ్డాయి. ఎదురుగా డబ్బు, కానీ నేను అక్కణ్నించి కదలలేను. అదీ నా పరిస్థితి!

వ్యాపారి లేచాడు. నా దగ్గరకు వచ్చి కొట్టడాని కన్నట్లు చేయెత్తి ఎందుకో మళ్ళీ వెంటనే దించేసి— "నిన్ను చూస్తే నాకు కొట్ట బుద్ధి కావడంలేదు—...." అన్నాడు.

నేనేం మాట్లాడలేదు. ఆయన నన్ను పలకరించి నా గురించి పూర్తి వివరాలు రాబట్టాడు. నేనాడిన మాటలన్నీ టేప్ చేశాడు. నన్నాస్థితిలో ఫోటోతీశాడు.

అంతా అయ్యాక—"దొంగలంటే నాకూ జాలివుంది. సమాజమే మనిషిని దొంగగా మారుస్తుంది. కానీ దొంగగా మారినవాణ్ని ఆ సమాజం బ్రతకనివ్వదు. దొంగ అంటే అర్థం—దొంగతనంచేసి పట్టుబడినవాడని. ఆ లెక్కన చూస్తే నువ్వింకా దొంగవి కాదు. ఇప్పుడు

నిన్ను నేను పోలీసులకు పట్టిస్తే నే దొంగవౌతావు. కానీ నిన్ను పోలీసులకు అప్పగించను. అంతేకాదు ఎప్పటికీ పోలీసులు పట్టుకోకుండా సాయపడతాను. ఎటొచ్చీ ఇంతకాలం నువ్వు నీ కోసం దొంగతనాలు చేశావు. ఇప్పుడు నాకోసం దొంగతనాలు చేయాలి. కానీ ఇది వరలో వున్న పట్టుబడిపోతావనే భయం ఇకమీదట వుండదు—" అన్నాడా వ్యాపారి. అలా ఆయన నన్ను స్మగ్లింగ్ లోకి దింపాడు.

ఏడాదిలోనే నేను స్మగ్లింగులో ఆరితేరాను. అలా కొంతకాలం జరిగేసరికి ఊళ్ళో వున్న ముఠాలో గొడవలు వచ్చి అది రెండుగా చీలిపోయింది. నేను సహజంగా మొదట్నించీ నన్ను చేరదీసిన నగల వ్యాపారి పక్షంలోనే వుండిపోయాను. నేను చాలా కీలకమైన వ్యక్తిని కాబట్టి నా కోసం ఆ రెండో పక్షం కూడా ప్రయత్నించ సాగింది.

నేనేం చేస్తున్నానో ఇంట్లో తెలియదు. నేను సంపాదించే డబ్బు కూడా రహస్యంగా దాచేవాణ్ని. దాన్నింట్లో ఎలా ఇవ్వాలో నాకు తెలిసేదికాదు. నేను దొంగనని తెలిస్తే నాన్న ఏవగించుకుంటాడు. అమ్మ బాధ పడుతుంది. చెల్లెలికి పెళ్ళికావడం అసాధ్యమవుతుంది.

మరో సంవత్సరంలో నాకు నేనుగా చాలా డబ్బు వెనకేశాను. నన్నెలాగైనా తమ పక్షంలోకి లాగాలన్న రెండోపక్షం ప్రయత్నాలు తీవ్రతరమయ్యాయి. ఆఖరికి వాళ్ళ ప్రయత్నాలెలా మళ్ళుతున్నాయో నాకు తెలిసింది. వాళ్ళు నా కుటుంబాన్ని బంధించి హింసించి— ఆ విధంగా నన్ను వశపర్చుకోవాలనుకొంటున్నారు.

నా పతనం ఈ విధంగా నా కుటుంబానికి ప్రమాద

కరంగా పరిణమించగలదని నేను కలలో కూడా అనుకో లేదు. ఇది తెలియగానే నేను వణికిపోయాను.

నగలవ్యాపారి దగ్గర నా జాతకం వుంది. అవసరమైతే ఆయన కూడా నా తలిదండ్రుల్ని హింసించడానికి సిద్ధపడవచ్చు. ఇందులోంచి ఏదో విధంగా బయటపడాలి. ఇలా ఆలోచించి నేను నా డబ్బంతా ఒకచోట పోగు చేసుకొన్నాను. ఉన్నట్లుండి ఓ రోజు ఊళ్ళోంచి మాయమయ్యాను. నేను చనిపోయినట్లు అందర్నీ నమ్మించాలని నా తాపత్రం.

నా కోసం ఆ రెండు మూఠాలూ వేట ప్రారంభించే లోగా అదృష్టవశాత్తూ పెద్ద రైలు ప్రమాదం జరిగింది. ఆ రైల్లో నేను బయల్దేరినట్లుగా పాత తేదీ వేసి ఉత్తరం రాశాను. ఓ పోస్టుమన్‌కు లంచమిచ్చి దానిమీద పాత తేదీ ముద్రపడేలా చేశాను. ఆ ఉత్తరం ఒకటి ఇంటికీ, మరోటి నగలవ్యాపారికీ చేరింది. ఆ రైలు ప్రమాదంలో గుర్తు తెలియని శవాలు చాలా వున్నాయి. వాటిల్లో ఒకదానికి నా పేరుపెట్టుకొని మా వాళ్ళు ఏడ్చారు. రెండు ముఠాలూ నన్ను మర్చిపోయాయి. ఆ విధంగా మా కుటుంబానికో పెద్ద గండం తప్పింది.

ఇది నా కథ. ఆ తర్వాత ఇక్కడ వెలిశాను. నా డబ్బంతా బైటపెట్టానంటే చాలా ప్రమాదం. డబ్బున్న వాళ్ళకి గుర్తింపు తొందరగా లభిస్తుంది. వీలైనంత అజ్ఞాతంగా జీవితం గడపటం నా ఆశయం. అందువల్ల నేను నా డబ్బును చిల్లరచిల్లరగా ఎన్నో ప్రయివేట్ సంస్థల్లోనూ, బ్యాంకుల్లోనూ డిపాజిట్లుగా వేశాను. ఆ వచ్చే వడ్డీతో దర్జాగా జీవించవచ్చును.

అయితే నా మనసంతా నా కుటుంబం చుట్టూ తిరుగు

తోంది. వాళ్ళకు ఎలాగో అలాగ సాయపడాలి నేను. అందుకోసం ఎన్నో పథకాలు ఆలోచించాను. ఆ స్మగ్లర్స్ ముఠాలు ఆవులిస్తే పేగులు లెక్కపెట్టే రకం. మా నాన్నకు ఏదైనా పెద్ద ఎత్తున సాయమందిందంటే వాళ్ళలో అనుమానం తలెత్తుతుంది. అన్నింటికీ భగవంతుడి మీదనే భారం వేసి ఒకటి ఆశయంగా పెట్టుకొన్నాను. ఆ ఆశయమే నిన్నూ నన్నూ దగ్గరగా చేసింది.

నేను సాధారణంగా నాకు నేనై కావాలనుకొంటే తప్ప ఎవ్వరికీ కనబడను. చాలామందికి చేసినట్లే పరీక్ష ఫీజుకట్టి నీకు సాయం చేశాను. బియ్యే ప్యాసై రెండేళ్ళయినా ఉద్యోగంలేని నిన్ను చూస్తే—నా చెల్లెలికి తగిన వరుడివేమో ననిపించింది. నీలోని అమాయకత్వం—విద్రోహులకు కాక — మంచితనానికి సాయపడాలని ఎంతో తాపత్రయపడ్డాను. నా అదృష్టంకొద్దీ నువ్వు స్మగ్లర్స్ చేతిలోకి వెళ్ళే ప్రమాదం వెంట్రుకవాసిలో తప్పేసింది.

నిన్నూ మా చెల్లెల్నీ కలపడంకోసం—దానికిక్కడ ఉద్యోగం రావడానికి తెర వెనుక నేను చాలా ప్రయత్నాలు చేశాను. అన్నీ సక్రమంగా జరిగాయి. ఇప్పుడు నీ ద్వారా మా కుటుంబానికి సాయపడాలని నా సంకల్పం.

అంతా బాగా జరిగిందని నేను సంతోషిస్తున్న సమయంలో నువ్వు నారహస్యం బైటపెట్టి కొంపముంచావు. నిజం తెలిస్తే ఆ రెండు ముఠాలూ మా యింటిమీద దాడి చేస్తాయి. మా అమ్మా, నాన్నా గుండె ఆగి చచ్చిపోవచ్చు.

ఇప్పుడు నీ కర్థమయిందా నేనెంత దురదృష్ట

వంతు డినో!" ముగించాడు సురేష్.

ఇదంతా విన్నాక ఏమనాలో నాకు అర్థంకాలేదు. సురేష్ నిజంగా ఎంత గొప్పవాడు! తెలిసీ తెలియని దశలో తెలివితక్కువపని చేసి నేరస్థుడయ్యాడు. ఆ వృత్తిలో రాణిస్తుండగా తనవాళ్ళకేర్పడిన ఇబ్బందులు గురించి—తనే అదృశ్యమయ్యాడు. అయినప్పటికీ తన వాళ్ళకి సాయపడాలనే కోరిక అతడిలో చావలేదు. అంతేకాదు. వీలున్నంతలో తనలా మరెవ్వరూ చెడిపో రాదని అతను అందరికీ చేతనైనంతలో సాయం చేస్తున్నాడు.

ఎందరికి సాయంచేస్తే ఏం లాభం? అతడు తనకు తాను సాయపడే దశలో లేడు.

ఇప్పుడు నేనేం చేయాలి? సురేష్‌ను వాళ్ళకి చూపించి మొత్తం వాళ్ళ కుటుంబాన్నంతటినీ ప్రమాదంలో పడ వేయాలా?

"సురేష్! నీకా ముఠాల రెండింటి గురించీ స్పష్టంగా వివరాలు తెలుసుకదా! ఆకాశరామన్న ఉత్తరాలు రాసి వాటిని పట్టించరాదూ — అప్పుడు నీ సమస్యకు శాశ్వత పరిష్కారం లభిస్తుంది!" అన్నాను.

సురేష్ నవ్వి-"మరీ అంత అమాయకంగా మాట్లాడకు- దేశంలో ఎక్కడెక్కడ ఎలాంటి ముఠాలున్నవో పోలీసులకూ, రాజకీయ నాయకుల కూడా తెలుసు. వాళ్ళే వాళ్ళ గురించి పట్టించుకోనప్పుడు నాలాంటి సామాన్యుడేం చేయగలడు? పైగా, దానివల్ల నేను బ్రతికేవున్నానని వాళ్ళు ఊహించే ప్రమాదముంది. అప్పుడూ నా కుటుంబానికి ప్రమాదం తప్పదు—?"

నేనేమీ మాట్లాడలేదు. నన్ను దొంగగా మారవద్దనీ

స్మగ్లింగ్ ముఠాను ఆదరించవద్దనీ కోరినప్పుడు అతడి ఆవేదన ఏమిటో నా కిప్పుడర్థమయింది. అప్పటికతన్ని వదలి ఇంటికి వెళ్ళి—"ఇది చాలా విచిత్రంగాలేదూ— ఇంతకాలం నేను మాట్లాడుతున్నది సురేష్‌తో కాదు. అతడి ఆత్మతో! ఈ రోజు నా మాటలు వింటూనే అది గాలిలోకి ఎగిరిపోయింది. నేను వణికిపోయాను—" అన్నాను.

అంతా ఇది అభూతకల్పన కింద కొట్టిపారేశారు. నా నిజాన్ని అబద్ధంగా మార్చడానికి ఇంతకుమించిన దారి నాకు తెలియలేదు. "పోనీ మాకు ఆ ఆత్మనే చూపించు బాబూ!" అన్నాడు సురేష్ తండ్రి.

ఆ తర్వాత సురేష్ ఆత్మ అతడి తలిదండ్రులకే కాదు. నాకూ కనిపించలేదు.

అతడు మా అందరితో కలిసి తిరిగే మంచి రోజు వస్తుందన్న ఆశ నాకుంది.

దేశంలోని పేదరికం ఎగిరిపోతుందని ప్రతి ఎన్నికల ముందు నాయకులు చేసే వాగ్దానాలు విన్నప్పుడు చాలా మంది సామాన్యుల కళ్ళలో కనబడే ఆశకంటె—నా ఆశ నెరవేరే అవకాశం ఎక్కువేం కాదని నాకూ తెలుసు.

—:ఐ పో యిం ది:—

# జూదగాళ్ళు

## వాణిశ్రీ

నన్ను వెండికొండ ప్రాజెక్టుకి ట్రాన్స్‌ఫర్ చేసినట్లు ఆర్డర్స్ వచ్చాయి.

నేను విచారించలేదు. నాకు తెలుసు ఏ మారుమూల ప్రాంతానికో నన్ను బదిలీచేస్తారని. నా తప్పేంలేదు. నా డ్యూటీ నేను చెయ్యడం తప్పు. ఎవరి డ్యూటీ వాళ్ళు చెయ్యడం చాలా తప్పు ఇండియాలో. నన్ను ఆ మారుమూలకి ట్రాన్స్‌ఫర్ చేయించింది ఎవరో కూడా నేను ఊహించగలను. ఎమ్మెల్యే ఏడుకొండలు. అతగాడి అనుచరులు చేసే దొంగతనాలు, అగడాళ్ళు సహించక పోవటమే నా తప్పు. మర్డర్ కేసులో చిక్కుకొన్న ఆయన బామ్మర్దిని ఆయన స్వయంగా వచ్చి చెప్పినా వదలకపోవడం నా అసమర్థత.

సరే పోనివ్వండి. గులాబీ పువ్వును ఎవరైనా పెంట కుప్పలోకి విసిరితే అది గులాబీ తప్పు ఎలా అవుతుంది?

వెండికొండ ప్రాజెక్టుకి వందమైళ్ళ లోపు ఏ

పట్టణమూ లేదు. దాదాపు నలభై మైళ్ళు అడవిలో ఘాట్ రోడ్డులో ప్రయాణం చెయ్యాలి. పట్టణంలో అలవాటుపడినవాళ్ళు అక్కడ వుండలేరు. మా డిపార్టు మెంటులో అది పనిష్మెంట్ ఏరియా క్రింద లెక్క.

కృష్ణానదిమీద అక్కడ ఆనకట్ట కడుతున్నారు. నదికి రెండువైపులా కాలనీలు వెలిశాయి. జనాభా పాతిక వేలు వుంటుందేమో! ఇక అక్కడ కేసులేం వుంటాయి? అంతా ఉద్యోగస్తులు, కార్మికులు. తమ పనేమిటో చేసుకొంటూ వుంటారు. గొడవలెందుకు వుంటాయి అక్కడ? పనీపాటాలేని బేవార్సు జనం వున్న పట్టణాల్లో నేరాలకు కొదవలేదు, పోలీసులకు తీరికాలేదు.

నేను బస్టాండులో దిగగానే మా వాళ్ళు అక్కడ నా కోసం ఎదురుచూస్తున్నారు. లోగడ నా దగ్గర పనిచేసిన యస్. ఐ. జగన్నాథ్, హెడ్ కానిస్టేబుల్ కాలేషా వెండికొండలో వుండటం నాకు సంతోషాన్ని కల్గించింది. వాళ్ళు నన్ను హృదయపూర్వకంగా ఆహ్వానించారు.

నాకు గెస్టు హౌస్‌లో బస ఏర్పాటు చేశారు. ఆ రాత్రికి అక్కడ రెస్టు తీసుకొన్నాను.

ఇన్‌స్పెక్టర్ నటేశన్ మర్నాడు నాకు చార్జి అప్పజెప్పాడు.

"విష్ యూ బెస్టు ఆఫ్ లక్" అని నా దగ్గర సెలవు తీసుకోవడానికి సిద్ధమయ్యాడు.

"ఎలా వుంటుంది ఇక్కడ?" అన్నాను.

"ఏం లేదు. గోళ్ళు గిల్లుకొంటూ కూర్చోవటమే. ఏ మినిష్టరుగారో వచ్చినపుడు మనకు పని తగులుతుంది. లేదా డామ్ దగ్గర ఏ ప్రమాదమో జరిగితే వెళ్ళా

ల్సొస్తుంది. అంతే. ఇక్కడ మనలాంటి వాళ్ళుండా ల్సింది కాదు. ఏ జబ్బుమనుషులో, రిటైర్‌మెంట్ దగ్గర కొచ్చిన ముసలాళ్ళో వుండాల్సిన ప్లేస్" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నటేశన్.

నేను నవ్వి వూరుకొన్నాను.

ఇన్‌స్పెక్టర్ నటేశన్ లారీలో సామాను వేసుకొని ఫ్యామిలీతో టాక్సీలో వెళ్ళిపోయాడు.

అతను వుంటున్న గవర్నమెంట్ క్వార్టరు నాకు ఎలాట్ చేశారు. దాదాపు ఎకరం స్థలంలో వుంది ఆ క్వార్టరు. లంకంత కొంప అంటారే అలాగే వుంది. మూడు బెడ్‌రూములు, స్టోర్, కిచెన్, డ్రాయింగ్ రూమ్‌లతో సహా అన్ని సౌకర్యాలు వున్నాయి.

ఇది జనవరి నెల. ఇంకా నాలుగు నెలలవరకూ ఈ లంకంత కొంపలో ఒంటరిగా వుండాల్సిందే. పిల్లలకు పరీక్షలు అయ్యేవరకూ మా వాళ్ళంతా పట్టణంలో వుండాల్సిందే.

అసలు సంవత్సరం మధ్యలో గవర్నమెంటు ఉద్యోగుల్ని ఎందుకు ట్రాన్స్‌ఫర్లు చేస్తారో నాకు చచ్చినా అర్థంకాదు. ట్రాన్స్‌ఫర్ చెయ్యదల్చుకొంటే ఏప్రియల్ జూన్ మధ్యలో చెయ్యాలి. అంతేగాని ఇష్టంవచ్చినట్లు చేస్తే పిల్లల చదువులు ఏం కావాలి? క్రొత్త ప్రదేశాల్లో వాళ్ళకి సీట్లు ఎలా దొరుకుతాయి?

ఏవిటో నా పిచ్చిగాని ఇవన్నీ ఎవడికావాలి? ఈస్టిండియా కంపెనీ రూల్సులో ఇండియా కాలక్షేపం చేస్తోంది.

నైవేద్యం పెట్టేవాళ్ళులేక దేవుడి గుడి పాడుబడి నట్లుగా కేసులు లేక నా ఇన్‌స్పెక్టర్ బుర్ర మొద్దుబారి

పోతున్నట్లు అనిపించింది. ఏదైనా కేసు దొరికితే బాగుండును కాలక్షేపంగా వుంటుంది అనుకొంటూ గోళ్లు గిల్లుకొంటూ వుండగా, ఏ దేవతో నా మొర ఆలకించి నట్లుగా టెలిఫోన్ రింగైంది.

ఉదయం తొమ్మిదయింది.

ఒకవేళ యస్.ఐ. జగన్నాథ్ నాకు గుడ్‌మార్నింగ్ చెప్పడానికి కాదు కదా అని సందేహం కలిగింది. నేను నిద్రలేచానో లేదో తెలుసుకోవడానికన్నట్లు, అతను స్టేషన్‌కి రాగానే ఫోన్ చేసి పలకరిస్తాడు.

"యస్...." అన్నాను రిసీవర్ ఎత్తి.

"గుడ్ మార్నింగ్ సర్!" సందేహంలేదు జగన్నాథే.

"గుడ్ మార్నింగ్" అన్నాను.

"ప్రొద్దున్నే కేసు తగిలింది సర్!"

"కేసా!....ఏం కేసు?" వుత్సాహంగా ప్రశ్నించాను.

"మర్డర్ కేసు."

"మర్డర్ కేసా? వెరీగుడ్...." అన్నాను సంతోషంతో. హమ్మయ్య ఎన్నాళ్టికి మర్డర్ కేసు దొరికిందో! సంబరపడిపోయాను.

జగన్నాథ్‌కి నా ధోరణి అర్థంకాలేదేమో ఏదో చెప్పబోయాడు. నేను స్టేషన్‌కి వస్తున్నాను. అక్కడ మాట్లాడుకుందాం అని చెప్పి ఫోన్ రెస్టుమీద పడేశాను. హడావుడిగా యూనిఫారం ధరించాను. క్షణాలలో తయారై పోయి జీప్ ఎక్కాను. జీప్ స్టేషన్ ముందు ఆగింది.

నేను జీప్‌లో కూర్చుని ఎస్.ఐ.ని రమ్మన్నాను.

"మనకింకా రిటన్‌గా కంప్లెయింట్ రాలేదు సర్" అన్నాడు జగన్నాథ్.

"రాకపోతేనేం? అసలు ఎక్కడ జరిగింది మర్డర్ ఎవరు చెప్పారు?" అని ప్రశ్నించాను.

"కాలనీ చివర్లో జరిగిందట సర్. ప్రాజెక్టులో అసిస్టెంట్ ఇంజనీర్ శ్రీధర్ గారి మావగారు చూశారట. శవం గోతాంలో వుందట. భయంతో యింటికి వచ్చేసి అల్లుడికి చెప్పాడట. ఆయన ఫోన్ చేసి చెప్పాడు. రిటన్ కంప్లెయింట్ ఇవ్వమని చెప్పాను. ఆయన వస్తానన్నారు" అన్నాడు జగన్నాథ్.

"ఆయన రాకపోతేనో?" అన్నాను.

జగన్నాథ్ తెల్లబోయి చూశాడు.

"లెటజ్ గో!" అన్నాను సీరియస్‌గా.

ఎస్.ఐ. తేరుకొని కాన్‌స్టేబుల్స్‌ని వెంటబెట్టుకుని జీప్ ఎక్కి కూర్చున్నాడు.

జీప్ అసిస్టెంట్ ఇంజనీర్ శ్రీధర్ యింటిముందు ఆగింది.

పోలీస్ జీప్ యింటిముందు ఆగగానే శ్రీధర్ యింట్లో కలకలం బయల్దేరింది. ఎర్రటోపీని చూడగానే వరండాలో ఆడుకొంటున్న ఇద్దరు పిల్లలు బేర్‌మని ఏడుపు లంకించుకున్నారు. ఆ చుట్టుప్రక్కల క్వార్టర్సులో వున్నవాళ్ళు శ్రీధర్ యింటి వంక తొంగి తొంగి చూస్తున్నారు.

శ్రీధర్ మమ్మల్ని చూసి తెల్లబోయాడు.

"మీరే వచ్చేశారే! నేనే వద్దామనుకొంటున్నాను. డ్రైవర్ ఇంకా రాలేదు" అన్నాడు ఏడవలేక నవ్వు ముఖం పెట్టి.

"కూర్చోండి....రండి...." అంటూ మర్యాద చేశాడు.

"కూర్చోవడం కాదు. ముందు శవం దగ్గరకు వెళ్లాలి"

అన్నాను నేను.

'శవం' మాట వినగానే అతగాడి శరీరం గగుర్పాటు చెందినట్లు ఉలిక్కిపడి కళ్ళు మూసుకొన్నాడు. లోపల నుంచి పంచె కట్టుకొన్న ముసలాయన వచ్చాడు. శ్రీధర్ ఆయన వంక కొరకొర చూశాడు ఇదంతా నీవల్ల నేగదా! అన్నట్లు.

"శవాన్ని చూసింది మీరు కాదు గదా?" అన్నాడు జగనాథ్.

"నేను కాదు మా మావగారు. పిచ్చేశ్వరయ్యగారు. రాత్రే గోంగూర పాలెం నుంచి వచ్చారు" అన్నాడు శ్రీధర్.

"శవం ఎక్కడ చూశారు?" అని ప్రశ్నించాను.

"ఈ ఇళ్ళన్నిటికీ దూరంగా!" అన్నాడు పిచ్చేశ్వరయ్య.

"ఎంత దూరం?"

"రెండు ఫర్లాంగుల దూరం" అన్నాడు.

"మీరొకసారి మాతో వచ్చి ఆ మూట ఎక్కడుందో చూపిస్తారా?" అన్నాను.

"అట్లాగే." అన్నాడు ఆయన.

జీప్‌లో స్పాట్‌కి వెళ్ళాం.

రోడ్డుకి పది గజాల దూరంలో వుంది గన్నీ బ్యాగ్ మూట.

నేను పరిసరాలన్నీ గమనించాను.

కాలనీకి చాలాదూరం అది. అంతా అడవి. రోడ్డుకి రెండువైపులా పదిగజాల అవతల పెద్ద పెద్ద చెట్లు గుబురుగా వున్నాయి. హత్య కాలనీలో జరిగి వుండొచ్చు. శవాన్ని గోతాంలో కట్టి మోసుకొచ్చి అక్కడ పడే

యడం చాలా శ్రమతో కూడిన పని. హంతకు బలిష్టుడై వుండాలి అనిపించింది.

మూటకి వున్న కన్నంలోంనుంచి చెయ్యి బైటకి వచ్చి వుంది. కొబ్బరి తాడుతో గట్టిగా కట్టివుంది మూతి. దాన్ని విప్పమని ఒక కానిస్టేబులుకి చెప్పాను.

అది కుర్రవాడి శవం. అతనికి పద్దెనిమిది యేళ్ళు వుండొచ్చు. బ్లూ కలర్ చారలున్న పోలిస్టర్ షర్టు, అదే రంగు ప్యాంటు వేసుకొన్నాడు. గొంతు పిసికి చంపినట్లున్నారు. మూతికి నెత్తురు అంటి వుంది. గొంతులో నుంచి నెత్తురు కారి వుండవచ్చు.

శవాన్ని స్టేషన్‌కి చేర్చి ఫొటోగ్రాఫర్‌ని పిలిపించి అన్ని కోణాలలోనూ ఫొటోలు తీయించాను. జనాభా తక్కువే అయినా ప్రాజెక్టు, నదికి రెండువైపులా వున్న కాలనీతో పదిమైళ్ల వరకూ వ్యాపించి వుంది. శవాన్ని గుర్తుపట్టడానికి ఏం చేయాలో తోచలేదు.

"సార్! ఇక్కడ హెల్తు ఆఫీసువాళ్ళు జీప్‌లో మైక్ ఫిక్స్ చేసి డి.డి.టి. స్ప్రే చేయించుకోమని అనౌన్స్‌మెంట్స్ చేస్తుంటారు. వాళ్ళ జీప్‌లో అన్ని కాలనీలు త్రిప్పి చెప్పిద్దాం. ఎవరోకళ్ళు గుర్తు పట్టక పోరు" అన్నాడు ఎస్.ఐ. జగన్నాథ్.

"అలాగే చెయ్యి" అన్నాను.

ఎస్.ఐ. హెల్తు ఆఫీసర్‌కి ఫోన్ చేశాడు జీప్ కోసం.

## 2

చనిపోయిన కుర్రాడి పేరు సూర్యనారాయణ. అతనికి వుద్యోగం ఏమీ లేదు. అన్నగారింట్లో వుంటున్నాడు. సూర్యనారాయణ అన్న మురళీకృష్ణ. అతను డామ్ నిర్మా

జానికి సంబంధించిన డామ్ డివిజన్ అనే ఆఫీసులో యు.డి.సి.గా పని చేస్తున్నాడు.

సూర్యనారాయణ తల్లి బోరున ఏడుస్తోంది. మురళీ కృష్ణ భార్య శవం పక్కనే కూర్చుని లోలోపలే కుమిలి పోతోంది. మురళీకృష్ణ తమ్ముడి శవాన్ని చూసినవెంటనే పెద్దగా ఏడ్చాడు. కొంత సేపటికి తేరుకొన్నాడు. మురళీ కృష్ణ తమ్ముడ్ని యెవరో చంపివేశారనే వార్త వినగానే అతని ఆఫీసులో పని చేసే సహోద్యోగులు, తెలిసిన వాళ్ళు, తండోపతండాలుగా వచ్చి శవాన్ని చూసి పోతు న్నారు.

శవాన్ని పోస్టుమార్టం రిపోర్టు కోసం హాస్పటల్ కి పంపించాం.

సూర్యనారాయణ హత్య వెండికొండలో సంచలనం కలిగించింది. ఆ ప్రాంతంలో హత్య జరగడం అదే మొదటిసారని ఒక సీనియర్ కానిస్టేబుల్ నాతో అన్నాడు. అందుకే అంత సంచలనం.

జనం పోస్టుమార్టం చేసే గది చుట్టూ మూగి వున్నారు. నేను ఎఫ్. ఐ. ఆర్. ప్రిపేర్ చేసి సబ్ డివిజనల్ పోలీస్ ఆఫీసర్ గారికి పంపించి రంగంలోకి దిగాను.

సూర్యనారాయణని హత్య చేసినవాళ్ళని పట్టుకొని తీరాలని మనసులోనే ప్రతిజ్ఞ చేసుకున్నాను. ఆ ప్రాంతంలో జరక్క....జరక్క....శాంపిల్ గా ఒక హత్య జరిగింది. దాని అంతు తేల్చకపోతే నా పరువేం గాను?

నలుగురు కానిస్టేబుల్సుని మఫ్టీలో పోస్టుమార్టమ్ దగ్గర వుండమని ఆదేశించాను. అక్కడ జనం చెప్పుకునే

మాటలు విని నాకు చెప్పాలన్నాను. కొంతవరకు అసలు కారణం తెలిసిపోతుంది.

సాయంకాలానికి శవాన్ని పోస్టుమార్టమ్ చేసి ఇచ్చేశారు. అంత్యక్రియలు అప్పటికప్పుడే ఏర్పాటు చేశారు. విషాదం కమ్ముకుని వున్న ఆ వాతావరణంలో మురళీకృష్ణను ప్రశ్నలు అడిగి బాధపెట్టడానికి నాకు మనస్కరించలేదు.

చీకటి పడిన తర్వాత నేను స్టేషన్‌లో వుండను క్లబ్బుకెళ్ళి టెన్నిస్ ఆడుకుంటాను.

కాని ఆ రోజు క్లబ్బుకి వెళ్ళలేదు. నా ఆఫీసులో కూర్చుని పోస్టుమార్టమ్ రిపోర్టు ముందేసుకున్నాను. అందులోని విషయాలు జాగ్రత్తగా పరిశీలించాను.

'గొంతు పిసికి చంపివుంటారు. ఊపిరి అందక ప్రాణం పోయింది. రాత్రి పన్నెండు ఒంటి గంట మధ్య చని పోయాడు.' పోస్టుమార్టమ్‌లోని సారాంశం అది.

మఫ్టీలో తిరిగిన కానిస్టేబుల్సు నలుగురు వచ్చి సెల్యూట్ కొట్టారు. ఒకొక్కళ్ళనే రమ్మన్నాను. ముందు పుల్లారావు వచ్చాడు.

"జనం ఏమనుకొంటున్నారు?" ప్రశ్నించాను.

"సంక్రాంతి నెలలో పోయాడు. పుణ్యాత్ముడు అను కొంటున్నారు సార్!" అన్నాడు పుల్లారావు.

నేను పుల్లారావు వంక తీవ్రంగా చూశాను. వీడు నిజంగా పిచ్చిపుల్లాయ్‌లాగానే వున్నాడే! అనుకున్నాను.

"ఏడ్చినట్లుంది నీ రిపోర్టు. పోయినవాడు పుణ్యా త్ముడో పాపాత్ముడో మన కెందుకు? హత్యకు కారణం ఏమిటో కావాలి మనకి. ఎవరు చేసి వుంటారు? అనే దానికి క్లూ కావాలి" అన్నాను తీవ్రంగా.

పుల్లారావు బెదిరిపోయాడు.

"అటువంటివి యెవరూ అనుకోలేదు సార్!" అన్నాడు.

"ఇక దయ చెయ్యి!" అన్నాను.

పుల్లారావు నిష్క్రమించాడు.

తర్వాత డేవిడ్ వచ్చాడు.

"సూర్యనారాయణ గురించి ఏమనుకుంటున్నారు? ఏదైనా క్లూ అందిందా?"

డేవిడ్ తల వూపాడు.

నాలో ఆశ చిగురించింది.

"సార్! సూర్యనారాయణ అన్నగారింట్లో వుంటున్నాడు" అన్నాడు డేవిడ్.

"తెల్సు" అన్నాను.

"వాళ్ళింటి ప్రక్కనుండే పెద్దిరెడ్డిని కలిశాను. కొన్ని విషయాలు చెప్పాడు సార్!" అన్నాడు డేవిడ్.

"చెప్పు!"

"సూర్యనారాయణ ఇంటర్ తప్పి కూర్చున్నాడట. అన్నగారేమో చదువుకోమని చెప్తాడట. మరది చదువుకి డబ్బు తగలబెట్టడం యెందుకు ఏదోక పనిలో పెట్టమని మొగుడితో పోరుపెడుతుందట వదిన సావిత్రి. చదువు మీద శ్రద్ధ వున్నవాడు పరీక్షలో ఎందుకు తప్పుతాడని తిడుతుందట.

భార్య మాట విని తముణ్ణి పనిలో పెట్టాడట. కాని సూర్యనారాయణ ఏ పనిలోనూ సరిగా వుండడట. అతనికి పేకాట పిచ్చి వుందట. రాత్రిం బగళ్ళు పేకాటేనట. అన్న తమ్ముణ్ణి కొడుతూ వుంటాడట .వాళ్లమ్మ పెద్దకొడుకుని తిడుతుందట.

పని చేసి డబ్బు తీసుకురాకుండా తేరగా తిని తిరుగుతున్నాడని మరదిని సూటిపోటు మాట లంటుందట సావిత్రి. సూర్యనారాయణ వదినకి యెదురుతిరిగాడట. ఆ మధ్య తల్లి చుట్టాలింట్లో పెళ్ళికని వెళ్ళి నెలరోజులు వుండిపోయిందట. అప్పుడు సూర్యనారాయణ తనని బలవంతం చేశాడని భర్తతో చెప్పి ఏడ్చిందట. అన్న తమ్ముడ్ని బాగా కొట్టాడట.

వదినను మరది బలవంతం చేశాడని తెలిస్తే తన పరువు పోతుందని మురళీకృష్ణ తమ్ముడ్ని ఇంట్లోనుంచి వెళ్ళగొట్టలేదట. తను ఆఫీసునుంచి వచ్చినప్పుడే యింట్లోకి రావాలనీ తను లేనప్పుడు యింట్లో వుండటానికి వీల్లేదని ఆంక్షలు పెట్టాడట. తల్లి ఊర్నించి వచ్చేదాకా అట్లాగే సాగిందట."

డేవిడ్ ఇంట్లో గొడవలన్నీ పెద్దిరెడ్డి చెప్పినవన్నీ చెప్పాడు.

హెడ్ కానిస్టేబుల్ కాలేషా చెప్పిన సంగతులుగూడా కొంచెం బాగానే వున్నాయి.

సూర్యనారాయణ ఆర్నెల్ల క్రితం వరకు బైరాగి నాయుడు అనే కంట్రాక్టర్ దగ్గర మేస్త్రీగా పని చేశాడు. బైరాగినాయుడు చిన్నకూతురు సుజనకి పదిహేనేళ్ళు. తొమ్మిదోక్లాసు చదువుతోంది.

సూర్యనారాయణకి ఆ పిల్లతో స్నేహం కలిసింది. ప్రేమ.... ప్రేమని తిరగసాగారు. పెద్ద కుటుంబంలో పిల్ల. ఇటువంటి స్నేహాలు ఇంట్లో తెలిసి, నాయుడు సూర్యనారాయణని పనిలోనుంచి తీసెయ్యడమే గాక దేహశుద్ధి చేసి జన్మలో ఆ పిల్లవంక చూడొద్దనీ, అలా గనుక తను చూస్తే శాల్తీ గల్లంతైపోగలదనీ వార్నింగ్

యిచ్చి వదిలిపెట్టేశాడు.

ఆ తర్వాత సుజన సూర్యనారాయణ కలుసుకోకుండా వుండగలిగారా? ఓమో చెప్పలేం. అతి రహస్యంగా కలుసుకుంటూ వుండొచ్చు. టౌన్‌లో మాదిరిగా యిక్కడ కష్టం ఏమీలేదు రహస్య జీవులకు. అన్నీ కొండలూ, పెద్ద అడవీను!

నాలుగో కానిస్టేబుల్ పనికి వచ్చే వివరాలు యేమీ చెప్పలేకపోయాడు.

## 3

మర్నాడు ఉదయం తొమ్మిది గంటలకు మురళీకృష్ణ వుంటున్న క్వార్టర్‌కి వెళ్ళాను. నేను వెళ్ళేసరికి వరండాలో నలుగురైదుగురు కూర్చుని వున్నారు. బంధువులు కాబోలు. అంతా విచారంగా వున్నారు.

జీప్ ఆగిన శబ్దం విని మురళీకృష్ణ యింట్లో నుంచి వచ్చాడు.

నన్ను డ్రాయింగ్ రూమ్‌లో కూర్చోబెట్టాడు.

"మీకు ఎవరిమీదనైనా అనుమానంగా వుందా?" అని ప్రశ్నించాను.

మురళీకృష్ణ జీవంలేని నవ్వు నవ్వాడు.

"నాకు చాలా ఆశ్చర్యంగా వుంది సార్! వాడ్ని చంపడంవల్ల యెవరికి యేమి లాభమో అర్థం కావడం లేదు. ఎవర్ని అనుమానించాలో తోచడం లేదు" అన్నాడు.

"సర్లెండి! హంతకుడు ఎక్కడికి పోతాడు? ఎక్కడున్నా పట్టుకుని తీరతాను" అన్నాను.

అతను మాట్లాడలేదు.

"మీ తమ్ముడ్ని గురించి ఏమైనా చెప్పండి!" అన్నాను

నాకు ఏమీ తెలియనట్లుగానే.

"ఏం చెప్పమంటారు సార్! అంతా నా దురదృష్టం. వాడొక్కడే నాకు తమ్ముడు. చదువు అబ్బలేదు. ఇంటర్ వరకూ నెట్టుకొచ్చాడు. ఇక తర్వాత సాగలేదు. ఇంటర్ చదివినవాడికి యేం వుద్యోగం వస్తుంది సార్ ఈ రోజుల్లో?" అన్నాడు అతను నిట్టూరుస్తూ.

"అవును. ఏమొస్తుంది? ఎమ్మే చదినవాళ్ళే రిక్షాలు తొక్కడానికి సిధపడుతున్నారు" అన్నాను.

"అందుకే వాడికి ఏదైనా పని నేర్పుదామని బైరాగి నాయుడుగారని కంట్రాక్టరు దగ్గర మేస్త్రీగా చేర్పించాను. కంట్రాక్టు వర్కున్న చేయించడం నేర్చుకుంటే చాలు యిట్టే బాగుపడి పోవచ్చు."

"అవును" అన్నాను.

"కాని వాడికి అదీ అబ్బలేదు. అసలు వాడికి పని నేర్చుకుందామనే ధ్యాసే లేనేలేదు సార్!"

"ఏం జరిగింది? అక్కడ మానేశాడా?" అని ప్రశ్నించాను. బైరాగి నాయుడి కూతురితో జరిపిన రొమాన్సు గురించి చెప్తాడా లేదా....అని చూస్తున్నాను.

"వీడు మానెయ్యలేదు. ఆయనే మాన్పించేశాడు" అన్నాడు అతను.

"ఏం? పని సరిగా చెయ్యలేదనా?"

"అవును సార్! వాడికి చిన్నతనం వదల్లేదు. బాధ్యత తెలీదు, పనికిరాడని తీసేశాడు" అన్నాడు అతను.

అతను తమ్ముడు జరిపిన ప్రేమకలాపం దాటవేస్తున్నాడు. బైరాగి నాయుడు పెద్ద కంట్రాక్టరు. అటువంటి ఆయన కూతురి గొడవ పోలీసులకు చెప్పడం

ఎందుకు? అనవసరంగా చెడ్డ పేరు అని జంకుతున్నట్లు న్నాడు.

"నాయుడిగారి కూతురితో లావ్ ఎఫైర్ జరిగిందని విన్నానే" అన్నాను.

మురళీకృష్ణ బాంబు ప్రేలినట్లు వులిక్కిపడ్డాడు.

"మీకెలా తెలుసు?" అన్నాడు వెలా తెలాపోతున్న ముఖంతో.

"పోలీసులకు అన్నీ తెలుస్తాయి" అన్నాను చిన్నగా నవ్వి.

"నిజమో అబద్ధమో నాకైతే తెలీదు సార్. నాయుడుగారు నాతో ఏమీ చెప్పలేదు ఆ విషయం. నాకు ఫోన్ చేసి మీ వాడు యిక్కడ పనికి రాడు అని చెప్పాడు. ఆ లా ఎఫైర్ గురించి వాళ్ళూ వీళ్ళూ చెప్పారు గాని నేను పట్టించుకోలేదు. ఏదో చిన్నతనం సార్. లోకానుభవం లేదు వాడికి. లేకపోతే పెద్దింటి అమ్మాయిలతో సంబంధం పెట్టుకోవడం యెంత ప్రమాదం?" అన్నాడు అతను.

"మీ తమ్ముడు ఇప్పుడేం చేస్తున్నాడు?"

"డామ్ దగ్గర ఎన్.ఎమ్.ఆర్.గా పెట్టాను. రోజుకి ఏడురూపాయలు యిస్తారు. ఆదివారాలు, పండుగ సెలవు ల్లోనూ డబ్బు ఇవ్వరు" అన్నాడు.

"ఎన్.ఎమ్.ఆర్. అంటే ఏమిటి?"

"నామినల్ మస్టర్ రోల్ అంటారు. మా పి. డబ్ల్యూ.డీ.లో. రోజు వారీ కూలీలను అలా పిలుస్తుంటారు."

"రోజూ డ్యూటీకి వెళ్తున్నాడా?"

"వెళ్తే ఫరవాలేదు సార్. సరిగా వెళ్ళడు.

పేకాడుతూ కూర్చుంటాడు" అన్నాడు మురళీకృష్ణ.

"ఎక్కడ ఆడుతుంటాడు? ఏదైనా క్లబ్బులోనా?"

"ఇక్కడ క్లబ్బులేం వున్నాయి పేకాటకి. వాడి ఫ్రెండ్స్ రూమ్‌లో ఆడుతుంటాడు. వాళ్ళంతా బాచిలర్స్."

"ఎక్కడ వాళ్ళ రూమ్?"

" 'సి' వైపు క్వార్టరు. నెంబరు నూట ఏడు" అన్నాడు మురళీకృష్ణ.

నేను ఆ నెంబరు నోట్ చేసుకున్నాను.

"సరే ఒక్క విషయం చెప్పండి. ఆదివారం రోజు మీ తమ్ముడు యెక్కడెక్కడికి వెళ్ళాడో, ఆఖరిసారి మీరు అతన్ని యెప్పుడు చూశారో చెప్పగలరా?"

"ఆదివారం వాడిని భోజనానికి వచ్చినప్పుడు చూశాను సార్. వాడు ఒంటి గంటకు వచ్చాడు. నేను అప్పటికే భోజనం చేసి పేపరు చదువుతున్నాను. ఆలస్యంగా వచ్చినందుకు కేకలు వేశాను. వాడు సమాధానం ఏమీ చెప్పలేదు. ఎన్ని తిట్టినా వాడు లెక్క చెయ్యడు లెండి.

నేను పేపరు చదివి నిద్రపోయాను. నాలుగు గంటకు లేచాను. అప్పటికి వాడు లేదు. ఎప్పుడో వెళ్ళిపోయాడు. ఇక అంతే సార్. వాడు ఆ రాత్రి రాలేదు. రోజుల తరబడి వాడు రాకుండా వుండడం మాకు మామూలే. అందుకనే గాబరా చెందలేదు. ఇలా జరుగుతుందని మాకేం తెలుసు సార్!" అన్నాడు మురళీకృష్ణ బాధపడుతూ.

తర్వాత నేను అతని భార్య సావిత్రిని, అతని తల్లిని ప్రశ్నించాను. వాళ్ళూ అదే చెప్పారు. మధ్యాహ్నం రెండు

స్నేర ప్రాంతంలో యిల్లు వదిలి వెళ్ళినవాడు మళ్ళీ రాలే దని. అయినా వాళ్ళు ఏం చెప్పగలుగుతారు బేవార్సుగా తిరిగేవాడి గురించి.

తమ్ముడు యెంత దుర్మార్గుడైనా చేజేతులా చంపేంత క్రూరుడిగా కనిపించలేదు మురళీకృష్ణ. అతన్ని అనుమానించడం అనవసరం అనిపించింది.

## 4

'సి' వైపు క్వార్టర్ నెంబరు నూటయేడుకు తీసుకెళ్ళమని డ్రైవర్‌కి చెప్పాను.

డ్రైవర్ పది నిమిషాల్లో ఆ క్వార్టర్ ముందు జీప్ ఆపాడు. కాని అందులో యెవరూ లేరు. తలుపుకి తాళం కప్ప వ్రేలాడుతూ వుంది. అంటే కుర్రాళ్ళంతా డ్యూటీలకు పోయివుంటారు. వీళ్ళని పట్టుకోవాలంటే రాత్రిళ్ళే తప్ప పగలు లాభంలేదు.

వాళ్ళని పట్టుకొచ్చే బాధ్యత ఎస్.ఐ. జగన్నాథ్ మీద పెట్టాను.

రాత్రి ఎనిమిది దాటింది అప్పుడు. భోజనంచేసి కిళ్ళీ నములూ స్టేషన్లో కూర్చున్నాను ఎస్.ఐ. కోసం యెదురు చూస్తూ.

గంట దాటినా వ్యాన్ తీసుకెళ్ళిన ఎస్.ఐ. జాడ లేదు. నిద్ర వస్తున్నట్లుగా అనిపించి టీ తెప్పించుకుని త్రాగాను. ఎవరికోసమైనా వెయిట్ చెయ్యడమంత బోరింగ్ మరొకటి వుండదని అనిపించింది నాకు ఆ సమయంలో. అలా నేను పరమ బోర్ ఫీలౌతూ వుండగా వ్యాన్ స్టేషన్ ముందు ఆగింది.

అందులో నుంచి ముందు మా ఎస్.ఐ., తర్వాత కానిస్టేబుల్సు, ఆ తర్వాత నలుగురు కుర్రాళ్ళు దిగారు.

అందులో నల్లగా పొట్టిగా వున్నవా డొకడు. వాడి పేరు నాగరాజట. ప్లైపిస్టుగా పని చేస్తున్నాడట. క్వార్టరు అతని పేరుతోనే ఎలాట్ అయిందట. మిగిలిన ముగ్గుర్లో ఒకడు డామ్‌లో మేస్త్రీగా పని చేస్తున్నాడట, మరొకడు టెలిఫోన్ ఎక్స్చేంజీలో ఆపరేటరట, ఇంకొకడు గుమస్తా.

అంతా వాడలిపోతున్నారు స్టేషన్‌లో నిల్చుని. భయంతో వణికిపోతున్నారు. వాళ్ళ గొంతుల్లో నుంచి మాటలే సరిగా రావడంలేదు. చచ్చిపోతున్నవాళ్ళలా నీరసంగా నిలబడ్డారు. ఇప్పుడో యింకాసేపటికో పోలీసులు తమని లాఠీలతో చావ బాదుతారేమో నన్న భయం వాళ్ళ నరం నరంలో అలజడి రేపుతోంది.

"అట్లా వణికిపోకండి. అడిగినదానికి సమాధానం చెప్పండి. తెలిసినదంతా నిజం చెప్పండి. ఏ మాత్రం దాచారో మీరు స్టేషను దాటి బైటికి పోరు" అని సింహంలా గర్జించాను.

దాంతో పొట్టిగా వున్న ప్లైపిస్టుగాడు బేర్‌మన్నాడు.

"నాకేం తెలీదు సార్! నన్ను వదలిపెట్టండి. మీ కాళ్ళు పట్టుకుంటా!" అంటూ అమాంతం నా కాళ్ళమీద పడిపోయి ఏడవడం మొదలెట్టాడు.

నాకు చచ్చే నవ్వొచ్చింది. కాని నవ్వితే వాళ్ళకి అలుసు. ఆ సమయంలో నవ్వగూడదు.

"లే....లే....ఏమిటీ వెధవ న్యూసెన్స్!....ఏయ్! కాలేషా! వీడ్ని తియ్యి!....ఛీ....ఛీ....ఎందు కట్లా ఆడదానిలా యేడుస్తావ్! సిగ్గు లేదూ!" అని గట్టిగా అరిచాను.

ఇద్దరు కానిస్టేబుల్స్ వచ్చి వాణ్ణి లేవదీశారు.

"ఆఁ. ఇప్పుడు చెప్పండి. మీరు రోజూ పేకాడు తుంటారా మీ రూమ్‌లో?" ప్రశ్నించాను.

"రోజూ ఆడం సార్! ఎప్పుడన్నా ఆడుతుంటాం. తప్పయిపోయింది. ఇంకెప్పుడూ ఆడం సార్!"

"ఎప్పుడన్నా అంటే?"

"సెలవలప్పుడు సార్! ఏమీ తోచక ఆడుకుంటాం సార్!...."

"నోర్మూయ్‌రా రాస్కెల్! అబద్ధం చెప్పొద్దని ముందే చెప్పానా లేదా?" అని గాండ్రించాను.

వాళ్ళు నలుగురూ నోట మాటలు రాక గొర్రెల్లా తలలు వూపారు.

"మరి అబద్ధం యెందుకు చెప్తున్నారు? ఈ రోజు ఏ వారం?"

"మంగళవారం సార్!"

"ఏవైనా సెలవు వుందా?"

వాళ్ళు ముఖాలు చూసుకుంటున్నారు.

"మాట్లాడరేం?" బాంబులా పేలాను.

వాళ్ళు దడుచుకుని "లేదు సార్!" అని కోరస్ పాడారు.

"మంగళవారం ఆడుతున్నారంటే రోజూ ఆడుతున్నట్లు లెక్క! అంతేనా?"

"అంతే సార్!" అన్నారు నీరసంగా.

"వూఁ....అయితే మీరు రోజూ పేకాట ఆడతారు. అంటే జూదగాళ్ళు అన్నమాట మీరు! గాంబ్లర్స్..." అన్నాను.

"కాదు సార్!........" అంటూ యేదో చెప్ప

బోయారు.

"నోర్మూయ్యండి. మీ రనేదేమిటో నాకు తెలుసు. మేము గాంబ్లర్స్ కాదు....ఏదో సరదాగా ఆడుకుంటు న్నాం అని అంటారు. ఏ సెలవురోజునో ఆడుకునేవాళ్లని హాబీగా ఆడుకుంటున్నారని చెప్పుకోవచ్చు. రోజూ ఆడే వాళ్ళు మాత్రం గాంబ్లర్సే! అండర్‌స్టాండ్!"

వాళ్ళు తలలు వూపారు గట్టిగా.

"ఇప్పుడు చెప్పండి. మీ ఫ్రెండ్ లేట్ సూర్యనారా యణ గాంబ్లరేనా?"

వాళ్ళ నోళ్ళు వూడుకుపోయాయి. కక్కలేక మింగ లేక అన్నట్లుంది వాళ్ళ పరిస్థితి.

"మాట్లాడరేం?"

"గాంబ్లరే సార్!"

"ఆ రోజు అంటే సూర్యనారాయణ చచ్చిపోయిన రోజు! ఐ మీన్ సండే యేం జరిగిందీ వివరంగా చెప్పండి."

"ప్రొద్దున తొమ్మిదింటికి మొదలుపెట్టాం సార్!"

"వూఁ...."

"మధ్యాహ్నం ఒంటి గంట అవుతూ వుండగా లేచి పోయాం సార్!"

"వూఁ....తర్వాత."

"తర్వాత ఇక లేదు సార్!"

"ఇక లేదా? యేం లేదు?"

"ఆడలేదు సార్!"

"ఏం?"

"మ్యాట్నీ సినిమా కెళ్ళాం సార్!"

"ఏమిటీ సినిమా కెళ్ళారా? పేకాట మానేసి

సినిమా కళ్యాణరా? ఆశ్చర్యంగా వుందే! యిటువంటి వింత ఎప్పుడూ వినలేదు నేను" అంటూ ఆశ్చర్యం ప్రకటించాను.

"ఒట్టు సార్! తల్లితోడు" అని అందులో ఒక మూర్ఖుడు ఒట్లు పెట్టుకున్నాడు.

"పేకాట మానేసి సినిమా కళ్యాణరంటే అందులో మీ అభిమాన నటుడు వున్నాడన్న మాట. యామ్ ఐ కరెక్టు?"

"కరెక్టు సార్! అందులో అమితాబచ్చన్ హీరో సార్! మా ఫేవరెట్ సార్!"

"సినిమా పేరేమిటి?"

"గ్రేట్ గాంబ్లర్!"

"గాంబ్లర్స్ గ్రేట్ గాంబ్లర్ సినిమా కళ్యాణరన్న మాట!" నవ్వు ఆపుకుంటూ అన్నాను.

వాళ్ళ ముఖాలు సిగ్గుతో ఎర్రబడిపోయాయి.

"సినిమానుంచి వచ్చాక ఏం చేశారు? మళ్ళీ రాత్రి సెషన్స్ మొదలు పెట్టారా?"

"సినిమా నుంచి వచ్చేసరికి పది దాటింది సార్! అయ్యరు హోటల్లో భోజనం చేసి వచ్చి పడుకున్నాం సార్!"

"ఏమిటీ! మ్యాట్నీ వదిలేసరికి రాత్రి పది దాటిందా? మీ కేమైనా మతిపోయిందా?" పిచ్చిగా అరిచాను.

"అదికాదు సార్! మ్యాట్నీ తర్వాత ఫస్టు షో కూడా చూశాం సార్!"

"ఒకే సినిమా రెండుసార్లు అదీ షో తర్వాత షో చూశారా! మీ కేమైనా పిచ్చెక్కిందా?" గట్టిగా కేకలు

పెట్టాను.

"ఒట్టు సార్!"

"సార్! ఇట్లా చూసే పిచ్చివాళ్ళు దేశంలో చాలా మంది వున్నారు. ఇదేం వింత కాదు. ఇటువంటి పిచ్చివాళ్ళుండబట్టే అమితాబచ్చన్ పిక్చర్‌కి ముప్పై లక్షలు అడుగుతున్నాడట" అన్నాడు ఎస్.ఐ. జగన్నాథ్.

"అంత వరకూ సూర్యనారాయణ మీతోనే వున్నాడా?"

"వున్నాడు సార్! మాతోపాటే భోజనం చేశాడు. తర్వాత ఇంటికెళ్ళిపోయాడు. అంతే సార్! మళ్ళీ మాకు కనిపించలేదు సార్! తెల్లవారి హత్య చేశారని తెలిసి మాకు ఆశ్చర్యం వేసింది."

"అంటే దాదాపు పదిగంటలవరకూ మీతోనే వున్నాడన్నమాట. ఆ తర్వాత ఎటు పోయాడో మీకు తెలీదు!....అంతేనా? ఏం కథ అల్లార్రా!...." అని పకపక నవ్వాను.

వాళ్ళు బిత్తరపోయి చూశారు.

"నిజం సార్!...." ఏమిటో చెప్పబోయారు.

"షటప్ రాస్కెల్స్! మీతో నిజం ఎట్లా చెప్పించాలో నాకు తెలుసు. కాలేషా! వీళ్ళకివ్వాల్సినవి ఇవ్వు నిజం చెప్తారు" అన్నాను.

కాలేషా లాఠి పట్టుకొని యమకింకరుడిలా వాళ్ళ మీదకి వెళ్ళాడు. కాలేషా దెబ్బపడకముందే టైపిస్టు మానవుడు కెవ్వున కేకపెట్టి దబ్బున క్రిందపడిపోయాడు. ఓరి వీడి భయం నాశనంకాను. కొంపదీసి గుండాగి చచ్చాడా ఏం అని నాకు సందేహం కలిగింది. చావలేదు గాని స్పృహ తప్పిపోయాడు వస్రాడు.

చన్నీళ్ళు ముఖాన చల్లిన తర్వాత కాసేపటికి తేరు కొన్నాడు. తెలివిరాగానే అమాంతం నా కాళ్ళు పట్టు కొన్నాడు ఏడుస్తూ!

నేను బిత్తరపోయాను అతగాడి పిచ్చిచేష్టలకి. వీడికి నిజంగా అంత భయం వుందా? లేక నాటకం ఆడు తున్నాడా అని సందేహం మొలకెత్తింది.

కుర్రాళ్ళు చదువుకొన్నవాళ్ళు. పైగా గవర్నమెంటు ఉద్యోగం చేస్తున్నారు. కాబట్టి రఫ్‌గా హేండిల్ చెయ్యడం బాగుండదని వూరుకోమన్నాను. లేకపోతే మావాళ్ళు పప్పు రుబ్బినట్లు రుబ్బేవాళ్ళు.

"సరే! మీరీ రాత్రికి నిద్రచెయ్యండి. తెల్లారినా నిజం చెప్పుదురుగాని" అని వాళ్ళని సెల్‌లో పడెయ్యమని ఆర్డర్ వేశాను.

మా వాళ్లు వాళ్ళని లాక్కెళ్ళి సెల్‌లో పడేశారు.

టైపిస్టు మానవుడు ఏడుపు కంటిన్యూ చేస్తూనే వున్నాడు. మిగిలినవాళ్ళు ముగ్గురు పైకి ఏడవడం లేదు గాని లోలోపల ఏడుస్తున్నారు.

## 5

మర్నాడు వుదయం వాళ్ళకి టిఫిన్, కాఫీలు తెప్పించి మళ్ళీ మొదలు పెట్టాను ఇంటరాగేషన్.

పదిదాటిన తర్వాత ఇక తమకు తెలియదనే మాట మీదే స్టాండయ్యారు. పోనీ బైరాగి నాయుడి కూతురు సుజనతో లా ఎఫైర్ గురించి చెప్పమన్నాను. ఆ రోజు మంచి అతను సుజనను కలుసుకోలేదని నమ్మకంగా చెప్పారు.

కాని నాకు డౌట్ తీరలేదు. ఈ ప్రేమికుల్లో కూడా రకరకాల మనస్తత్వాలు కల వాళ్ళు వుంటారు.

కొందరేమో తమ సంగతి మూడో కంటికి తెలియ కూడదని కోరుకొంటారు. మరి కొందరు తనకా అమ్మాయితో స్నేహం వుందనే సంగతి అంతా తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో వుంటారు. చెప్పలేం ఏ సంగతీ!

సూర్యనారాయణ కేసు వేరు. వాళ్ళ విషయం అందరికి తెలిసిపోయింది. కలుసుకోగూడదని కట్టడి. కాబట్టి ఎంతో రహస్యంగా అతి జాగ్రత్తగా కలుసుకొంటూ వుండి వుండొచ్చు! అది మళ్ళీ బైరాగినాయుడి నోటీస్‌కి వెళ్ళి.... ఈ మర్డర్!

పుత్రవాళ్ళు పదికావచ్చింది ఆఫీసుకి వెళ్ళిపోతామని బ్రతిమాలసాగారు. సరే, పిలిచినప్పుడు స్టేషన్‌కి రావాలని చెప్పి, వదిలేశాను.

నాకు అనుమానం కంట్రాక్టర్ బైరాగి నాయుడి మీదనే వుంది. లేకపోతే సూర్యనారాయణని చంపవలసిన అవసరం, చంపేంత ధైర్యం ఎవరికి వుంది ఆ కాలనీలలో?

బైరాగి నాయుడికంటే ముందు అతని కూతురు సుజనని ప్రశ్నిస్తేనే కొంత విలువైన సమాచారం బైటపడుతుందని అనిపించింది. ఆ అమ్మాయిని పోలీస్‌స్టేషన్‌కి పిలిపించడం బాగుండదు. కాబట్టి, నేనే ఆ అమ్మాయిని కలుసుకోవాలని నిశ్చయించుకొన్నాను.

నేను ఎండాకాలం వేసుకోవడానికి కుట్టించుకొన్న లాల్చీ పైజామా ధరించి బయల్దేరాను. నేను అసలే క్రొత్త. నన్ను తెలిసినవాళ్లు బహు కొద్దిమంది. అదీ టెన్నిస్ ఆటలో పరిచయమైన ఆఫీసర్లు.

నేను పోలీసువాడినని ఎవ్వరూ గుర్తించలేరు.

వి.క.పి. జూనియర్ కాలేజీకి బయల్దేరాను. సుజన

అందులో పదోక్లాసు చదువుతున్నది.

ఎస్. భావనారాయణ, ప్రిన్సిపాల్ అనే నేమ్ బోర్డు వున్న రూమ్‌కి వెళ్ళాను. ప్రిన్సిపాల్ నన్ను ఎగాదిగా చూశాడు. నన్ను నేను పరిచయం చేసుకొన్నాను. నేను పోలీస్ ఇన్స్‌పెక్టర్‌నని తెలిశాక ఆయన ముఖం వంద ఓల్టేజీల బల్బులా వెలిగింది.

"గ్లాడ్ టూ మీట్ యూ!" అని కరచాలనం చేసి బెల్ కొట్టి అర్జంటుగా రెండు కాఫీలు పట్రమ్మని జవాన్ని పంపించాడు.

నేను వచ్చిన పని చెప్పాను. ఆ అమ్మాయితో ఏకాంతంగా మాట్లాడాలని కోరిక వెలిబుచ్చాను.

దానికేం నేనా అమ్మాయిని పిలిపించి క్లాస్‌కి వెళ్తాను. మీరు మాట్లాడండి. నేను రూమ్‌లో లేకపోతే లోపలకు ఎవరూ రారు. నేను జవానుకిచెప్పి వెళ్తాలెండి అన్నాడు.

ఇంతలో కాఫీలు వచ్చాయి. ప్రిన్సిపాల్ సుజనను పిలిపించాడు.

"చూడమ్మా! వీరు ఇక్కడ పోలీస్ ఇన్స్‌పెక్టర్! నీతో ముఖ్యమైన విషయం మాట్లాడాలట" అన్నాడు.

ఆ అమ్మాయి భయం....భయంగా నా వంక చూసింది.

ప్రిన్సిపాల్ వెళ్ళిపోయాడు.

నేనా అమ్మాయిని పరీక్షగా చూశాను.

పదహారేళ్ళు వుండొచ్చు ఆమెకు. ఎత్తుగా పుష్టిగా వుంది. ఆమె శరీరం గులాబీ పువ్వు రంగులో నిగనిగలాడుతోంది. ముఖం కోలగా అందంగా వుంది. ఖరీదైన బట్టల్లో ఆకర్షణీయంగా అప్పుడే విచ్చుకొన్న ముద్ద మందారంలా వుందామె.

"కూర్చోమ్మా!" అన్నాను.

"ఫరవాలేదండీ!" అంది నేల చూపులు చూస్తూ.

"అలా కాదు. కూర్చుంటే నే బాగుంటుంది. కూర్చోమ్మా!" అన్నాను.

మొహమాటపడుతూ కూర్చుంది. నేనెందుకు వచ్చానో ఆమె ఈ పాటికి వూహించి వుండొచ్చు. అందుకే ఆమె ముఖంలో ఆందోళన కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది.

"నీ పేరు సుజన కదూ!"

"అవునండీ."

"నువ్వు బైరాగి నాయుడుగారి అమ్మాయివి కదూ!"

"అవునండీ."

"ఏంలేదు. మొన్న సూర్యనారాయణ అనే కుర్రాడ్ని ఎవరో హత్యచేశారు. నీకు తెలిసే వుంటుంది. ఆ కేసులో నిన్ను కొన్ని విషయాలు అడగాలని వచ్చాను" అన్నాను.

ఆమె ముఖం వెలతెలాపోయింది సూర్యనారాయణ పేరు వినగానే.

"అతను మీ నాన్నగారి దగ్గర మేస్త్రీగా పనిచేశాడట గదా?"

ఆమె తల వూపింది 'ఔ'నన్నట్లుగా.

"అతనూ, నువ్వూ ప్రేమించుకున్నారా?"

తన ప్రక్కనే బాంబు పడినట్లు అదిరిపడింది సుజన. అంత డైరెక్టుగా ఎవరూ అడిగివుండరు ఆమెనింతవరకూ.

ఆమె కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. పెదవులు అదురుతున్నాయి దుఃఖంతో. ఏడుపు ఆపుకోలేక పోయింది.

"ప్లీజ్! ఏడవకమ్మా! .... ఎవరైనా చూస్తే బాగుండదు" అన్నాను.

కొంచెం సేపటి వరకూ ఆమె దుఃఖంనుంచి తేరుకోలేక

పోయింది. ఆ కొద్దిసేపటికే ఆమె కళ్ళు కెంపుల్లా ఎర్రబడి పోయాయి. ముఖంలో కళాకాంతులు పోయి దిగులు చోటుచేసుకుంది.

"నా ప్రశ్నకు సమాధానం చెప్పనవసరంలేదు. నేను గ్రహించాను. అతని పేరు వినగానే నీకు ఏడుపు వచ్చిందంటే తెలుసుకోవచ్చు నువ్వెంతగా ప్రేమించావో!" అన్నాను.

ఆమె కళ్ళెత్తి నా వైపు అభిమానంగా చూసింది.

"మీ నాన్నకి ఆ విషయం తెలిసి అతన్ని కొట్టి పనిలోనుంచి తీసివేశాడు. మళ్ళీ నిన్ను కలుసుకుంటే చంపుతానని బెదిరించాడు. అదంతా జరిగిపోయింది. నాకు కావలసిన విషయం ఏమిటంటే ఆ తర్వాత నువ్వూ సూర్యనారాయణ ప్రేమించుకుంటూనే వున్నారా? అప్పుడప్పుడూ కలుసుకునేవారా? నిజం చెప్పు. నేనెవరికీ ఈ విషయాలు తెలియనివ్వను" అన్నాను.

నేను ఎంతో బ్రతిమాలిన తర్వాత ఆమె అంగీకరించింది తనూ సూర్యనారాయణ అప్పుడప్పుడూ రహస్యంగా కలుసుకుంటున్న సంగతి. ఆమె నిజాయితీకి ఎంతగానో మెచ్చుకున్నాను.

"ఆఖరిసారి ఎక్కడ కలుసుకున్నారు? ఎన్ని రోజుల క్రితం."

"వారం క్రితం కలుసుకున్నాం. ఆ రోజు ఇరిగేషన్ మినిష్టర్‌గారు డామ్ సైట్ విజిట్ చేశారు. మా నాన్న చాలా హడావుడిగా వున్నాడు."

"ఎక్కడ కలుసుకున్నారు?"

"దేవస్థానం సత్రంలో" అంది సుజన.

ఓరి వీళ్ళ తెలివి తెల్లారిపోనూ అని ఆశ్చర్యం కలి

గింది నాకు. అక్కడ ఒక కొండమీద ఈశ్వరాలయం వుంది. ఆ దేవుడి సత్రాన్ని వీళ్ళు ప్రేమ సత్రంగా మార్చుకున్నారన్నమాట. బాగుంది—అనుకున్నాను.

మేము మాట్లాడుకుంటూ వుండగా పద్మాలు గేళ్ళ కుర్రాడు లోపలకు వచ్చాడు.

"అక్కా!" అని పిలిచాడు నన్ను ఎగాదిగా చూస్తూ.

"ఎవరు మీ తమ్ముడా?" అన్నాను.

"అవునండీ" అంది.

నేను ఆమె దగ్గర సెలవుతీసుకుని వెళ్ళిపోయాను.

# 6

నేను తన కూతుర్ని కాలేజీలో కలిసి ప్రశ్నించిన సంగతి తెలిసి బైరాగి నాయుడికి కోపం వచ్చినట్లుంది. స్టేషన్‌కి వచ్చాడట నాతో మాట్లాడాలని. నేనప్పుడు లేను. మళ్ళీ సాయంకాలం వస్తానని చెప్పి వెళ్ళాడట. ఆయన వచ్చినప్పుడు యస్.ఐ. జగన్నాథ్ వున్నాడు.

"ఆయన చాలా పలుకుబడి వున్న కంట్రాక్టరు సార్!" అన్నాడు జగన్నాథ్ నన్ను హెచ్చరిస్తున్నట్లుగా.

"ఏం అయితే?" అన్నాను తీవ్రంగా.

ఎస్. ఐ. కంగారుపడ్డాడు. నా ధోరణి చూసి.

"అది కాదు సార్! అటువంటి వాళ్ళతో మన కెందుకు?" అన్నాడు నర్మగర్భంగా నవ్వుతూ.

నాకు తెలుసు జగన్నాథ్ వుద్దేశ్యం ఏమిటో! పలుకుబడి కలిగిన వాళ్ళతో పేచీ ఎందుకు అంటాడు. ఈ రోజుల్లో పలుకుబడి లేనివాడెవడు? ఏదోక రకంగా నాలుగు రాళ్ళు సంపాదించిన వాడల్లా తనే ఈ దేశాన్ని పరిపాలిస్తున్నంత ధీమాగా వుంటాడు.

"జగన్నాథ్. నేరస్తుడు ఎవరైనా వదిలిపెట్టేదిలేదు. పలుకుబడి వుందని వదిలేస్తే ఈ రోజుల్లో ఎవర్నీ పట్టుకోలేం" అన్నాను.

అన్నట్లే సాయంకాలం సుడిగాలిలా వచ్చాడు బైరాగి నాయుడు.

మనిషి డెయిరీ ఫారంలో వుండే సంకర జాతి దున్న పోతులా బలిసి వున్నాడు. బట్టలు విప్పేస్తే ఎలుగుబంటి అనిపించేటట్లు వంటినిండా గుబురుగా వెంట్రుకలు పెరిగి వున్నాయి. ఇటువంటి వికారాకారుడికి సుజన వంటి బంగారు బొమ్మ ఎలా పుట్టిందా? అని కొన్ని క్షణాలు ఆలోచించాను.

"నమస్తే ఇన్స్పెక్టర్! నా పేరు బైరాగి నాయుడు. ఇక్కడ కంట్రాక్టులు చేస్తున్నాను. మినిష్టర్ యోగేంద్రం నాయుడు మా బాబాయే" అన్నాడు.

బైరాగి నాయుడి అహం ఏమిటో నాకు అర్థమైంది. వాళ్ళ బాబాయి మినిష్టర్. అదీ సంగతి.

"గ్లాడ్ టూ మీట్ యూ! మీ గురించి విన్నాను. మిమ్మల్ని కలుసుకోవాలని నేనే అనుకుంటున్నాను. మీరే వచ్చారు" అన్నాను అతనితో కరచాలనం చేస్తూ.

"ఒక సంగతి అడిగిపోదామని వచ్చాను" అతను నెమ్మదిగా మాట్లాడుతున్నా కోపం ధ్వనిస్తోంది కంఠంలో.

"ఏమిటి?"

"మీరు నిన్న మా అమ్మాయిని కాలేజీలో మీట్ అయ్యారట గదా?"

"అవును."

"అదే ఎందుకని అడుగుతున్నాను?" తీవ్రంగా వుంది

అతని కంఠం.

"అదేం ప్రశ్న? ఒక మర్డర్ కేసులో వివరాలు అడగడానికి మీట్ అయ్యాను. అదీ ప్రిన్సిపాల్ పర్మి షన్‌తో."

"మా అమ్మాయి మైనర్. ఏదైనా నా ద్వారా జర గాలి."

"ఇది మర్డర్ కేసు. పెళ్ళి కేసు కాదు మేజర్ మైనర్ అని వాదించడానికి" అన్నాను.

"మర్డర్ కేసుతో మా అమ్మాయికి సంబంధం యేమిటి?"

"పోనీ మీకు సంబంధం వుందా?"

"మిస్టర్ ఇన్‌స్పెక్టర్! మీరు యెవరితో మాట్లాడు తున్నారో తెలుస్తోందా....?" అన్నాడు అతను ఆవేశంతో.

"తెలుసు మిస్టర్ బైరాగినాయుడూ! తమకి డబ్బు పలుకుబడి వుందని అహంకారంతో మాట్లాడకండి."

"అహంకారం యెవరికో తెలుస్తూనే వుంది. అధికారం వుందని యిష్టం వచ్చినట్లు మాట్లాడకండి. ఎవడో దారిన పోయే దానయ్య మర్డర్ కేసు మాకేం సంబంధం?"

"దారిన పోయే దానయ్య అయితే కేసే లేదు. అతను మీ దగ్గర మేస్త్రీగా పని చేశాడు. మీ అమ్మాయి అతనూ ప్రేమించుకున్నారు. విచ్చలవిడిగా తిరిగారు. మీ రతన్ని తన్ని వెళ్ళగొట్టారు. మళ్ళీ కలుసుకుంటే చంపుతానని బెదిరించారు. అంతకంటే యింకేం కావాలి? అతన్ని చంపడానికి మీకు కారణం వుంది. ఎవరికేం బట్టింది లేకపోతే."

బైరాగి నాయుడు పక పక నవ్వాడు. వికృతంగా

వుంది అతని నవ్వు.

"ఇన్‌స్పెక్టర్! నేను అందరిలా పిరికివాడిని కాను చాటుమాటుగా చంపడానికి. పబ్లిగ్గా మర్డర్ చేసే వాడిని. నా దగ్గర పది లారీలున్నాయి. అందులో ఒక్కటి చాలు. నడిరోడ్డుమీద పట్టపగలు ఎక్కించి యాక్సిడెంటుగా నిరూపించి వుండేవాణ్ని. అంతే గాని, ఇట్లా తెలివితక్కువగా, పిరికితనంగా చేయించేవాడిని కాను".

బైరాగి నాయుడు గబగబా వాగి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిపోయాక గాలివాన వెలిసినట్లయింది.

# 7

బైరాగి నాయుడి చర్యలను గమనించడానికి ఒకళ్ళను కాదు నలుగుర్ని నియమించాను. కాని నాకు ఏ విధమైన క్లూ దొరకలేదు.

అతని దినచర్య యాంత్రికంగా వుంది. ప్రొద్దున్నే లేచి డామ్‌సైట్‌కి వెళ్ళటం, అక్కడ కొంతసేపు వుండి అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసులకు తిరిగి ఇంటికెళ్ళిపోవటం భోజనం వేళకి. మళ్ళీ మూడు నాలుగయ్యాక వర్క్‌స్పాట్‌కి వెళ్ళటం, రాత్రి ఎనిమిదింటికి చేరటం.

అతని దగ్గర క్లోజ్‌గా మూవ్ అవుతూ ఈ మధ్య ఎవరైనా వెళ్ళిపోయిన వాళ్ళున్నారా అని కూడా ఎంక్వయిరీ చేశాను. అటువంటి వాళ్ళెవరూ తగల్లేదు.

కాలం కలిసివస్తే నడిచివచ్చే పిల్లలు పుడతారని సామెతగా ఈ కేసుకు సంబంధించిన క్లూ దొరికింది నెల రోజుల తర్వాత.

మాధవ్ అని సినిమా డైరెక్టరొకడు నా స్నేహితుడున్నాడు. వాడు లొకేషన్స్ చూడ్డానికి అక్కడికి

వచ్చాడు. నేను అక్కడే వుంటున్నానని తెలిసి నా దగ్గరికి వచ్చి తిట్టవేశాడు.

"గెస్టు హౌస్ కన్నా నీ క్వార్టరు వెయ్యి రెట్లు బాగుందిరా! రేపు షూటింగ్ కి వచ్చినప్పుడు నీ దగ్గరే వుంటాను" అన్నాడు.

"అట్లాగే వుండుగాని, ఆడవాళ్ళని మాత్రం నా కొంపలోకి తీసుకరాకు" అని జోక్ చేశాను.

"ఏం అంత భయం? నిన్నేం కొరుక్కు తినర్లే" అన్నాడు వాడు నవ్వుతూ.

"అందుకు కాదు. సినిమా తారలున్నారని తెలిస్తే జనం నా కొంపచుట్టూ మూగుతారు. వాళ్లని కంట్రోలు చెయ్యలేక నా చావుకొస్తుంది" అన్నాను.

వాడు సినిమా కబుర్లు చెప్తూవుంటే కాలం గడిచి పోయింది. భోజనం క్యారేజీలో తెప్పించాను. భోజనం చేశాక సెకండ్ షో సినిమాకి వెళ్లామని తగులుకున్నాడు.

'సీతారామ కల్యాణం' ఎప్పుడో ఇరవై ఏళ్ళక్రితం చూశాడట, మళ్ళీ దొరకలేదట చూద్దామంటే. రామారావు ఎంత గొప్పగా చేశాడో అందులో అని ఒకటే పొగడ్డం.

"సరే! ఎటూ రెండింటివరకూ మేలుకుని సీతారామ కల్యాణం చెయ్యాలి గనుక సెంటర్లో ఒక స్ట్రాంగ్ టీ తాగిపోదాం" అన్నాను.

"హాల్లో క్యాంటీన్ వుంటుంది గదా! అక్కడ తాగుదాం" అన్నాడు మాధవ్.

"సినిమా హాల్లో టీయా! జన్మలో తాగను. ఇప్పటికి రెండుసార్లు తాగాను. ఒకసారి వాంతులు, రెండోసారి విరోచనాలు" అన్నాను.

"అమ్మ బాబోయ్! అయితే వద్దులే" అన్నాడు.

సెంటర్లో టీ లేదు. కాలనీ చివర లారీలు ఆగేచోట టీ వుంటుందని వెళ్తే అక్కడ టీ దుకాణం లేదు.

ఆ దుకాణం మూసివుంది. దాని ప్రక్కనే వున్న పూరింట్లో నిల్చుని వున్న ఆడమనిషిని చూసి నాకు అనుమానం వచ్చింది ఎందుకో! తేరిపార చూశాను. బ్రోతల్ ఏమో అనిపించింది.

నన్ను చూసి లోపలకు వెళ్ళిపోయింది. నేను ఆ ఇంటి ముందుకు వెళ్ళి కేక పెట్టాను.

ఆమె బైటికి వచ్చింది.

వీధి దీపం కాంతిలో చూశాను. మనిషి నల్లగావున్నా ముఖం కళగానే వుంది. ముప్పై ఏళ్ళుంటాయి ఆమెకు. నీటుగా ముస్తాబై సన్నజాజులు తురుముకునివుంది. విటుల కోసం ఎదురుచూస్తున్నదన్నమాట.

"టీ కొట్టు నీదేనా?" అన్నాను.

"కాదు సారూ! కుట్టీది" అంది.

"కొట్టు కట్టేశాడా?"

"లేదు సారూ! కొట్టు తియ్యడంలేదు" అంది.

"ఏం?" అన్నాను.

"ఏమో సారూ! నెల దాటిపోయింది వెళ్ళిపోయి" అంది.

నెల క్రితం వెళ్ళిపోయాడని చెప్పగానే సూర్య నారాయణ కేసు గుర్తొచ్చింది. అది జరిగి నెలదాటింది.

నేను ఆ మనిషిని మరి కొన్ని ప్రశ్నలు అడుగుదామని అనుకుంటూ వుండగా "వెధవ టీ కోసం ఇంత టైమ్ వేస్టు చెయ్యాలా? మేం మా సినిమా కథ కోసం కూడా

ఇంత టైమ్ వేస్టుచెయ్యం తెలుసా?" అంటూ మాధవ్ నన్ను బరబర లాక్కునిపోయాడు.

# 8

రాత్రి పదిదాటింది.

కాలనీకి చివరగా వుండే ప్రాంతానికి వచ్చాను. అక్కడన్నీ గుడిసెలే వున్నాయి. కల్లు, సారాయి దుకాణాలు రోడ్డు ప్రక్కనే వున్నాయి. కాలనీలో క్వార్టర్లు ఎంత అందంగా వరుసలో వుంటాయో దానికంతా విరుద్ధంగా వుంటుందిక్కడ. చెత్తాచెదారంతో గలీజుగా వుంటుందిక్కడ.

పట్టీ టీ స్టాల్ ప్రక్కన వేపచెట్టు నీడలో నిల్చున్నాను. వెన్నెల చెట్ల కొమ్మల్లోంచి దూసుకుని వస్తోంది.

ప్రక్కన వూరింట్లో తెల్లచీర కట్టుకుని ఆమె గుమ్మంలోకి వచ్చింది.

సన్నజాజుల పరిమళం గుబాళిస్తోంది.

నేను అచ్చం కామంతో దహించుకుపోతున్న విటుడి వేషం వేసుకొచ్చాను. పల్చటి లాల్చీ, పైజామాలకు సెంటు పూసుకొచ్చాను.

ఆమె దగ్గిరింది.

నేను చిటిక వేశాను ఆమె చిటికకు రెస్పాన్సుగా.

"రా...." అంది ఆమె. అచ్చం ఎల్లారీశ్వరి గొంతును అనుకరించినట్లనిపించింది.

నేను కదిలాను. ఆమె లోపలకు వెళ్ళింది. నేను వెళ్ళగానే తడిక తలుపు మూసింది.

"నిన్ననే రావాలనుకున్నాను. కాని మావాడొకడు పడనివ్వలేదు" అన్నాను.

"నిన్న ఇదే టయానికొచ్చారు గదూ! ఆకుపచ్చ కారులో వచ్చారు. టీ కొట్టువాడు ఎక్కడికి పోయాడని అడిగారు. నేను గుర్తుపట్టాలే" అంది ఆమె నవ్వుతూ.

లోపల లాంతరు వెలుగుతోంది. దాన్ని పెద్దది చేసి నన్ను చెయ్యిపట్టుకుని తీసికెళ్ళి మంచంమీద కూర్చోబెట్టింది.

"నాకన్నీ గుర్తుంటాయి. మీరు మళ్ళీ సంవత్సరం తర్వాతొచ్చినా గుర్తుపడ్తాను" అంది.

"అబ్బా! అంత గుర్తుంటుందా నీకు. నువ్వు మా డిపార్టుమెంటులో వుంటే బాగుండునే" అన్నాను.

తర్వాత నాలిక్కరుచుకున్నాను. నేను పోలీసు వాడినని తెలిస్తే ఆమె ఏ విషయమూ చెప్పకపోవచ్చు.

"ఏం డిపార్టుమెంటు మీది?" అని ఆమె నన్ను ప్రశ్నించింది.

"మాది చేపలు పట్టే డిపార్టుమెంటులేగాని నీ పేరు ఏమిటి?"

"చిలకమ్మ" నవ్వింది గలగలా నా భుజాలమీద చేతులు వేస్తూ.

తర్వాత ప్రక్కనే కూర్చుంది.

"మందు కావాలి" అన్నాను.

"ఓహోఁ....అయితే తెల్లార్లూ వుంటావా? పాతిక ఔతుంది" అంది.

"తెల్లారేదాకా వుంటా!" అని ఏభై కాగితం ఆమె కిచ్చాను.

"నేనిప్పుడే పట్టుకొస్తాను" అని ఆమె వైటకు వెళ్ళి పదినిముషాల్లో వచ్చింది.

చేతిలో ఏదో పొట్లాం వుంది.

"ఏమిటి?" అన్నాను.

"మందులోకి గుడ్లు, మిరపకాయ బజ్జీలు" అంది నవ్వుతూ.

రెండు గ్లాసుల్లో మందుపోసి పొట్లాలు విప్పింది.

నేను గ్లాసులో ద్రవాన్ని చూసి "అబ్బే మంచిది కాదు" అన్నాను.

"ఎలా తెలుసు?" అంది.

"నేను వాసనచూసి గుర్తుపట్టగలను" అన్నాను.

"మరి ఎలా?" అంది.

"నువ్వు కానివ్వు. నేను తర్వాత స్వయంగా తెచ్చు కుంటాను" అన్నాను.

ఆమె మొదలుపెట్టింది. కొంచెం సేపట్లోనే ఖాళీ చేసింది.

"నువ్వు నాటు సారా త్రాగే రకంలా వున్నావే" అన్నాను.

ఆమె నవ్వి "అదీ ఇదీ ఒకటే. అది తెల్లగా వుం టుంది. దీనికి రంగు కలుపుతారు" అంది.

చిలకమ్మకు మందు తలకెక్కేదాకా ఓపికపట్టాను. ఆమె ముఖంలో నిషా ఎక్కిన మార్పు గమనించి మొదలుపెట్టాను.

"ప్రక్క హోటల్ వాడి పేరేమిటి కుట్టి గదూ!"

"ఆఁ....శంకరన్ కుట్టి. మళయాళంవాడు."

"ఎన్నాళ్లైంది వాడు పోయి?"

"నెల."

"నీకు బాగా గుర్తుందా?"

"ఆఁ—"

"సూర్యనారాయణ అనే కుర్రాడిని కుర్రాడిని చంపి

గోతాంలో కట్టి మూరంగా పారేశారు గుర్తుందా?"

"అవును. నేనూ చూశాను శవాన్ని."

"షట్టి వెళ్ళింది ఆ రోజు నేనా?"

"అవును. ఆ రోజే. నాకు గుర్తుంది. అంతకుక్రితం రాత్రి సూరిబాబు, ఆదూ పేకాడారు. నేను చూశాను" అంది చిలకమ్మ.

"సూర్యనారాయణ, షట్టి పేకాట ఆడేవాళ్ళా?"

"ఆఁ. అప్పుడప్పుడూ ఆడేవాళ్ళు."

"ఆ రాత్రి పేకాట ఆడారన్నమాట."

"ఔను. ఆ రోజు నాకు బేరాలు తగల్లేదు. రెండు రూపాయలు అప్పు ఇవ్వమని అడగడానికి షట్టీ దగ్గరకు వెళ్ళాను. నేను అప్పు అడిగితే కసురుకున్నాడు. డబ్బులు పోయి నేను చస్తుంటే మధ్యలో నీ గోడవేంటన్నాడు."

"వెరీగుడ్ చిలకమ్మా! ఏభై రూపాయలు పోతే పోయాయిగాని, మంచి ఇన్ఫరమేషన్ చెప్పావు. మరి ఇన్నాళ్ళూ ఈసంగతి చెప్పలేదేం స్టేషన్ కొచ్చి" అన్నాను.

చిలకమ్మ అదిరిపడింది నా పోలీసు భాష విని.

"ఎవరు బాబూ మీరు?" అంది.

"నేను ఇన్స్పెక్టర్నిలే. అది సరేగాని అంతకుముందు రాత్రి సూర్యనారాయణ షట్టీతో పేకాట ఆడిన సంగతి నువ్వు స్టేషన్ కొచ్చి పోలీసులతో ఎందుకు చెప్పలేదు?" అని అడిగాను.

"నా మాట ఎవరు వింటారు బాబూ! నేను వచ్చి చెప్తే ఆడిని నువ్వే చంపావని మీ పోలీసులు నన్ను జైల్లో పడేసేవాళ్ళు. లేనిపోని తద్దినం నాకెందుకని పూరుకున్నాను" అంది చిలకమ్మ.

# 9

మర్నాడు నేను ఎస్.ఐ. జగన్నాథ్, సిబ్బందితో వచ్చి, కుట్టీ హోటల్ తెరిపించి పరిశోధించాను.

లోపల చూరులో చెప్పులు కనిపించాయి. ఒకమూల నెత్తురు గడ్డకట్టుకుపోయిన అనవాళ్ళు దొరికాయి.

సూర్యనారాయణని కుట్టీ మట్టుపెట్టాడనడానికి ఆధారాలు దొరకడంతో నాకు వుత్సాహం వచ్చింది.

మురళీకృష్ణను స్టేషన్‌కి పిలిపించి చూపిస్తే ఆ చెప్పులు తన తమ్ముడివే అని గుర్తుపట్టి చెప్పాడు.

నేను కుట్టీని పట్టుకోవడానికి అక్కడే వున్న మళయాళీలను కలుసుకున్నాను. అందులో కొందరికి కుట్టీ అడ్రస్ తెలుసు.

శంకరన్ కుట్టీని అరెస్టు చేయించమని నేను అతని అడ్రసు, కేసు వివరాలు పై అధికారులకు పంపించాను.

వారం రోజులకు కేరళ పోలీసులు అతన్ని అరెస్టు చేసి ఆంధ్రప్రదేశ్‌కు పంపించారు. కుట్టీ మళ్ళీ చేరవలసిన చోటుకే చేరుకున్నాడు.

కుట్టీ తను అతన్ని చంపినట్టు ఒప్పుకున్నాడు. ఎందుకు చంపిందీ ఇలా వివరించాడు.

"ఆ రోజు రాత్రి పదిగంటలు దాటాక సూరి నా టీ స్టాల్‌కి వచ్చాడు. వరసగా రెండుసార్లు సినిమా చూసి వచ్చానని చెప్పాడు. తర్వాత టీ త్రాగాడు.

కొంచెంసేపట్లో పాలు అయిపోయాయి. నేను కొట్టు కట్టేశాను. పేకాట ఆడదామా? అని అడిగాడు. నేను సరే అన్నాను.

అతని దగ్గర యాభైరూపాయలు వున్నాయి. అర గంటలో ఆ ఏభై నేను గెల్చుకున్నాను. అప్పుడు సూరి

పదిరూపాయలు నన్ను అప్పు అడిగాడు. నేను ఇచ్చాను. అతను వరుసగా ఆటలు గెల్చాడు. అతని యాభై కాక నావి నూటయాభై పోయాయి.

అప్పటికి పన్నెండైంది. నా దగ్గర ఇక పైసా లేదు. నా హేండ్ పూర్తిగా డౌన్ అయిపోయింది. తెల్లవారితే పాలవాళ్ళకి ఇరవై రూపాయలు కట్టాలి. లేకపోతే వాళ్ళు పాలు ఇయ్యరు. పాలు లేకపోతే నా టీ స్టాల్ నడవదు. తెల్లవారుతుంది పాలవాళ్ళు వస్తారు. ఎక్కడికైనా పోయి డబ్బు తెచ్చేందుకు వ్యవధి లేదు. నాకు నూరి డబ్బు ఇస్తేనే గతి.

నేను ఇరవై రూపాయలు అప్పు అడిగాను. మళ్ళీ రేపు రాత్రికి ఇచ్చేస్తానని చెప్పాను. మళ్ళీ పేకాట ఆడితే ఇస్తానన్నాడు. నేనిక ఆడను అని చెప్పాను. ఆడకపోతే ఇవ్వనని అన్నాడు.

నాకు కోపం వచ్చింది. కాని కోపం అణుచుకుని బ్రతిమాలాను. అతను ఎంతకూ ఒప్పుకోలేదు ఇరవై రూపాయలు ఇవ్వడానికి. పైగా మీ మళయాళం వాళ్ళని నమ్మగూడదు అన్నాడు.

నాకు ఆవేశం వచ్చింది. లాగి చెంపమీద కొట్టాను. అతను కొట్టాడు. ఇద్దరం కొట్టుకున్నాం. నేను అతన్ని గొంతు దగ్గర పట్టుకున్నాను. ఊపిరి అందక చచ్చిపోయాడు. గోతాంలో కట్టి కాలనీ చివర పారేశాను. ఒక లారీ ఎక్కి మా ఊరు వెళ్ళిపోయాను."

శంకరన్ కుట్టీ చెప్పినదంతా విని "జూదగాళ్ళ గతి అంతే" అన్నాను నిట్టూరుస్తూ.

"అవును సార్!" అన్నాడు జగన్నాథ్.

—: అయిపోయింది :—

# పారిపోయిన హంతకుడు

## టెంపోరావ్

పట్నానికి చివరగా వున్న దేశాయి నగర్‌లోని చిన్న బంగ్లా ముందు ఆగింది సైకిల్ రిక్షా. అతడు కిందకు దిగకుండా, సీటుమీద కూర్చుని "చంద్రా! చంద్రా!" అని బిగ్గరగా అర్చాడు.

ఎవ్వరూ రాలేదు. పక్కనే నిలబడిన రిక్షావాడు యింటివైపు చూసి అతడి వంక తిరిగాడు.

"ముందు తలుపుకు తాళంవేసుంది సార్" అన్నాడు.

అతడు ఆశ్చర్యంగా కిందకు దిగాడు. నొప్పిగావున్న ఎడంకాలివైపు చూసి మెల్లిగా గుమ్మం ముందుకు నడిచాడు. గాద్రెజ్ తాళం!

"సార్, డబ్బిచ్చి నన్ను పంపేయండి!" అర్చాడు రిక్షావాడు.

అతడు జవాబివ్వలేదు. జేబులోంచి తాళంచెవి తీసి, తెరిచి లోపలకు వెళ్ళాడు. అతడి బాగ్ పట్టుకుని రిక్షా వాడు వచ్చాడు.

రిక్షావాడి చేతిలోని బాగ్‌ను అతడు తీసుకొన్నాడు. జేబులోంచి మూడు రూపాయలు తీసి అతిడికిచ్చాడు.

అతడు మెల్లిగా పడగ్గది వైపు నడిచాడు. గడపదాటి అతడు లోపలకు చూసి అమాంతంగా అర్చాడు.

"చంద్రా!"

ఆ అరుపు విని రిక్షా వాడు పరుగెత్తుకొచ్చాడు. మంచంముందు రక్తం మడుగులో పడున్న స్త్రీ వంక చూశాడతను.

"నా భార్య చంద్రను ఎవరో హత్యచేశారు!" అన్నాడతను.

రిక్షావాడు భయంతో శవంవైపు చూసి వెనక్కు తిరిగాడు.

"బస్ స్టేండ్‌కు వెళ్తున్నావుగా! అక్కడున్న పోలీసు స్టేషన్‌లో రిపోర్టియ్యి. నా పేరు గోపాలరావు. నెంబర్ 8 పదో వీధి, దేశాయి నగర్ నా అడ్రెసు."

"మీరు వుత్తరం రాసి యివ్వండి. పోలీస్ స్టేషన్‌లో యిస్తాను."

గోపాలరావు ఖంగారుగా గదిలో అటూ యిటూ తిరిగాడు. లెటర్ హెడ్ మీద క్లుప్తంగా రాసి రిక్షావాడి కిచ్చాడు.

"ప్లీజ్! ఇది వెంటనే స్టేషన్‌లో ఇయ్యి. ఈ ప్రాంతంలో టెలిఫోన్‌లు లేవు. నేను అక్కడదాకా నడవలేను" అన్నాడతను.

"యిస్తాను సార్" అన్నాడు రిక్షావాడు.

రిక్షావాడికి మరో రూపాయి తీసి యిచ్చాడు గోపాలరావు. రిక్షా వెళ్ళిపోయింది.

హాల్లోని సోఫాలో కూర్చుని గోపాలరావు సిగరెట్

వెలిగించాడు. అతడి కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి. పొగ పీల్చి, బయటకు వదిలి, అతను సిగరెట్‌ను హాల్లో మూలకు విసిరాడు.

అతడు టైమ్‌చూసి మెల్లిగా ఇంటిముందుకు వెళ్ళాడు. సమీపంలో యిళ్ళు లేవు. పక్క స్థలాల్లో పునాదులువేసి వదిలేశారు. జనతా ప్రభుత్వం వచ్చాక దేశాయి నగర్ రూపందాల్చింది. ఆ ప్రభుత్వం పడిపోగానే దేశాయి నగర్‌మీద ప్రజల ఆసక్తి తగ్గిపోయింది. దూరంలో వున్న ఇందిరా నగర్‌కి డిమాండ్ పెరిగింది.

రోడ్డువైపు చూస్తూ నిలబడ్డాడు గోపాలరావు. రోడ్డు మీద ఎక్కువగా జనసంచారంలేదు.

అతడు తన ఎడంకాలు వైపు చూశాడు. బొటన వేలుమీద ప్లాస్టర్ వేసివుంది. అడుగు వేస్తూంటే నొప్పిగా వుంది.

రిక్షావాడు స్టేషన్‌కి వెళ్ళాడో, లేదో! ఆలోచిస్తూ పిట్టగోడ వారగా అతడు నిలబడ్డాడు.

## 2

పడకకుర్చీలో కూర్చుని చుట్ట కాల్చుకుంటూన్న డిటెక్టివ్ వాలి ఎదురుగా ఆశీనుడైన గిరి వంక చూశాడు.

"ఆమె గురించి ఏం తెల్సుకున్నావు?" అడిగాడు వాలి.

గిరి జవాబిచ్చేలోగా టెలిఫోన్ మ్రోగింది. వాలి పక్కనున్న రిసీవర్ని అందుకున్నాడు.

"హలో, వాలి స్పీకింగ్!"

"వాలిగారూ, నేను ఇన్స్పెక్టర్ రామదాస్‌ని."

"రామదాస్ భాయ్, ఏమిటి సంగతి?"

"దేశాయి నగర్‌లో ఏదో హత్య జరిగిందని రిపోర్టు

వచ్చింది. దయచేసి మీరు అక్కడికొస్తే సంతోషిస్తాను."

"ఎక్కడుంది?"

"కామరాజ్ నగర్‌కి కొంచెం దూరంలో వుంది సార్. పదో వీధి, నంబర్ 8 యింట్లో హత్య జరిగిందట."

"ఆల్ రైట్, వస్తాను" అని వాలి రిసీవర్ని పెట్టేశాడు.

పడక కుర్చీలోంచి లేచాడు వాలి.

"గిరీ, వెళ్దాం పద!"

ఇద్దరూ బయటకు నడిచారు. హోటల్ గది తలుపు మూసి గిరి లాక్ చేశాడు.

XYZ కారు దేశాయి నగర్ రోడ్డమ్మట వెళ్తోంది.

"ఇది ఆరో వీధి. పదో వీధి అటువైపు వుండొచ్చు" అన్నాడు వాలి.

గిరి కారును పోనిస్తున్నాడు. అన్నీ చిన్న బంగళాలు. ఎక్కడా మేడలు లేవు. పోలీసు జీప్ దూరంలో కనిపిస్తోంది. అటువైపు కారును పోనిచ్చాడు గిరి.

కొందరు ప్రజలు అక్కడ పోగయ్యారు. జీప్ వెనకనే గిరి కారును ఆపాడు—వాలి కిందకు దిగాడు.

ఇన్‌స్పెక్టర్ రామదాస్ వేగంగా వాలిముందు కొచ్చాడు.

"నమస్కారం, వాలిగారూ! అడగ్గానే యిక్కడకు వచ్చినందుకు మీకు నా ధన్యవాదాలు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

చుట్టపొగ పీల్చివదుల్తూ వాలి నలువైపులా చూశాడు. రోడ్డు వారగా కొందరు ప్రజలు నిలబడి గోపాలరావు యింటివైపు చూస్తున్నారు. ఎనిమిదో నంబరు బంగళా

కిరువైపులా యిళ్ళు లేవు. ఎదురుగా యిళ్ళులేవు.

ఇటువంటి ప్రదేశంలో జీవించేవాళ్ళు ధైర్యవంతులై వుండాలి!

"పదండి లోపలకు!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ రామదాస్.

వాలి లోపలకు వెళ్ళాడు. ఇన్‌స్పెక్టర్ రామదాస్ వెనకనే గిరి హాల్లోకి నడిచాడు. చిన్న హాలు. హాల్లో రెండు చిన్న సోఫాలు, ఒక పెద్ద సోఫా వుంది.

సోఫాలో కూర్చున్న గోపాలరావు లోనకొచ్చిన వారిని చూసి లేచినిలబడ్డాడు.

"ఆయన గోపాలరావుగారు!" ఇన్‌స్పెక్టర్ రామదాస్ పరిచయం చేశాడు.

పడగ్గదిలోకి వాలితో నడుస్తూ ఇన్‌స్పెక్టర్ రామదాస్ చెప్పుకుపోయాడు! "వాలిగారూ, ఆయన భార్య చంద్రమతిని ఎవరో హత్యచేశారు."

పడగ్గదిలో చుట్టూ కాలుస్తూ నిలబడ్డాడు వాలి. మంచంముందు గచ్చు నేలమీద వెల్లకిలా పడున్న స్త్రీ వైపు చూశాడు. ఆమె ధరించిన గుడ్డలు రక్తమయంగా వున్నాయి. ఆమె ఒంటిమీద ఒక నగ కూడా లేదు. మంగళసూత్రం కూడా మాయమైంది!

శవాన్ని వాలి పరీక్షగా చూశాడు. ఆమె మెడ నరికివేయబడింది. ఆమె కాళ్ళవైపు అతడి చూపు వెళ్ళింది. ఆమె కుంటిదని వాలి తెలుసుకున్నాడు.

గది నలువైపులా చూశాడు వాలి. మంచంపైన పరుపు, తలగడలు వున్నాయి. గోడవారగా గాడ్‌రెజ్ బీరువా వుంది. మరోవైపున బట్టల స్టేండ్ వుంది. గోడకు వాళ్ల పెళ్ళి ఫోటో వేళ్ళాడుతోంది.

దగ్గరగా వెళ్ళి ఆ ఫోటో వంక చూశాడు వాలి. హాల్లో కూర్చున్న గోపాలరావు ఫోటోలో వున్నట్టే కనిపిస్తున్నాడు. వాళ్ళ పెళ్ళయి ఎక్కువ కాలం అయి వుండదు.

ఆలోచిస్తూ వాలి శవం పక్కనే గొంతు కూర్చుని పరీక్షగా చూశాడు. ఆమె చెయ్యిని ముట్టుకొని, మెల్లిగా లేచి నిలబడ్డాడు.

చంద్రమతి అంత అందమైన స్త్రీ కాదు. దానికి తోడు కుంటిది. గోపాలరావు అందంగా యవ్వనంలో వున్నాడు. వాళ్ళిద్దర్నీ విధి ఎలా కలిపింది?

ఆలోచిస్తూ వాలి వెనక్కి తిరిగాడు. అప్పుడే వచ్చిన డాక్టర్ సుధాకర్ వాలికి నమస్కరించాడు.

చిరునవ్వుతో వాలి హాల్లోకి వెళ్ళాడు. ఒక కానిస్టేబుల్ గుమ్మం బయట నుంచుని వున్నాడు.

గోపాలరావు లేవబోయాడు.

"అబ్బాయి, కూర్చో!" అన్నాడు వాలి.

గోపాలరావుకు ఎదురుగా వెళ్ళి వాలి నిలబడ్డాడు. అతడి నోట్లో చుట్ట వెలుగుతోంది. మెల్లిగా పొగ బయట కొస్తోంది.

"నువ్వు ఏ కంపెనీలో పనిచేస్తున్నావు?"

"రావు అండ్ రవూఫ్ అడ్వర్టైజింగ్ కంపెనీలో సార్. రవూఫ్, నేనూ ఆ కంపెనీలో భాగస్వాములం" అన్నాడు గోపాలరావు.

"జరిగినదంతా వివరంగా చెప్పు!"

"ఇవాళ పొద్దుట కాఫీ తాగి నేను ఆనంద్ నర్సింగ్ హోమ్‌కి వెళ్ళాను. చాలాకాలంనుంచి ఇన్‌గ్రోన్ గోరుతో నేను బాధ పడుతున్నాను. ఎడం కాలి బొటనవేలు

తీసేశారు. అటుపైన నేను నర్సింగ్ హోమ్ గదిలోనే ఉన్నాను. ఒంటి గంట లోపల చంద్ర భోజనం కేరియర్ లో పంపుతానంది. కాని పంపలేదు. నర్సింగ్ హోమ్ కాంటీన్ లో నేను భోజనం చేశాను. డాక్టర్ ఆనంద్ ఐదింటికి నన్ను చూసి యింటికి పోవచ్చన్నారు. నేను బస్సులో ప్రయాణంచేసి, బస్టేండునుంచి రిక్షాలో యింటికొచ్చాను."

"నువ్వు ఇంటికొచ్చేసరికి టైమ్ ఎంతయింది?"

"5-45 అయింది. ముందు తలుపుకు తాళంవేసివుంది. చంద్ర ఎక్కడికో వెళ్ళి ఉంటుందనుకుని నా జేబులో వున్న తాళంచెవితో తెరిచి లోపలకు వెళ్ళాను. చంద్ర శవాన్ని చూసి హడలిపోయాను. రిక్షావాడి ద్వారా పోలీస్ స్టేషన్ కి రిపోర్టు రాసి పంపాను."

గోపాలరావు ఆగాడు. కన్నీళ్ళు కారుతున్న కళ్ళను తుడుచుకున్నాడు. వెనుక నిలబడిన గిరి అతడి భుజం మీద చెయ్యి వేశాడు.

"గోపాలరావుగారూ, ధైర్యం తెచ్చుకోండి" అన్నాడు గిరి.

క్షణకాలం వాలి చుట్ట పీలుస్తూ మౌనంగా ఉండిపోయాడు. ఎదురుగా ఉన్న బుగ్గమీసాల వ్యక్తివైపు గోపాలరావు గాభరాతో చూశాడు.

"అబ్బాయి, ఈ యింట్లో మీరిద్దరుకాక మరెవరుంటున్నారు?"

ఆ ప్రశ్న విని గోపాలరావు తృళ్ళిపడ్డాడు. "మాతో నాగేష్ అనే నౌకరు ఉంటున్నాడు. వాడు ఎక్కడికెళ్ళాడో!"

గోపాలరావు ఆగాడు.

"నాగేష్ ఎంతకాలంనుంచి యిక్కడ పని చేస్తున్నాడు?"

"వాడు పనిలో చేరి సరిగ్గా వారంరోజులు అయింది, సార్. ఓ రోజు మధ్యాన్నం వాడు యింటికొచ్చాడు. వంటపనీ, తతిమ్మా పనులూ చేస్తానని నా భార్యతో చెప్పాడట. ముక్కూ, మొహం తెలియనివాడికి ఆమె వెంటనే ఉద్యోగమిచ్చింది."

"నాగేష్కి ముందు ఎవరుండేవారు?"

"కన్నయ్య పనిచేసేవాడు. వాడు పెళ్ళిచేసుకుని పని మానేశాడు. నౌఖరు ఉంటేగాని చంద్రకు గడవదు. ఆమె కంటిది. అందువలన నాగేష్కి ఇంటిపని ఇచ్చింది."

కొంచెంసేపు వాలి ఆలోచించాడు.

"ముందు గుమ్మానికి వేసిన తాళానికి రెండు చెవులు ఉన్నాయా?"

"ఉన్నాయి సార్. ఒకటి నేను ఉంచుకుంటాను. రెండోది యింట్లోనే ఉంటుంది."

వాలి సూటిగా గోపాలరావు వంక చూశాడు.

"అబ్బాయి, నీ భార్యను హత్య చేసిన వ్యక్తి ముందు తలుపుమూసి తాళంవేసి పరారీ అయ్యాడు."

గోపాలరావు వొళ్ళు భయంతో వణికింది.

"వాలిగారూ, ఆ దుర్మార్గుడు నాగేష్ యిదంతా చేసుండాలి! నాకు వాడు నచ్చలేదు. ఆ విషయం చంద్రతో కూడా చెప్పాను."

"నాగేష్ నీకెందుకు నచ్చలేదు?"

"పిల్లిలా అడుగులేసేవాడు. వంటచేస్తూ దినపత్రిక చదువుతూ వుండేవాడు! అతడంటే నాకెందుకో భయంగా వుండేది. రాత్రిళ్ళు యింటిముందు వరండా

మీద పడుకోమన్నాను."

"నాగేష్ ఎలా వుంటాడు?"

"మీడియం హైట్. తీగలాంటి నల్లటి శరీరం. నల్లటి గడ్డం. చిరిగిన దుస్తులు ధరించేవాడు. అతడు ఎక్కడ నుంచో పారిపోయివచ్చి, దిక్కులేక మా యింట్లో పనికి చేరాడని నాకనిపించేది."

"అతడిక్కడ ఏం పనులు చేసేవాడు?"

"వంట చేసేవాడు. మార్కెట్ కి వెళ్ళి కూరలూ అవీ తెచ్చేవాడు. నా భార్య ఎక్కువగా తిరగలేదు. ఆమెకు ఆసరాగా ఉండేవాడు."

వంటగది చిందరవందరగా వుంది. గాస్ స్టవ్, పక్కనే సిలిండర్ ఉన్నాయి. పెద్ద అలమారులో ఎన్నో డబ్బాలు, బుడ్డీలు ఉన్నాయి. గోడకు అమర్చిన మెటల్ బుట్టలో గరిటెలు, అట్లకాడలు వగైరా ఉన్నాయి. నేలమీద తెలుగు దినపత్రికలు పడున్నాయి.

స్టీల్ కేరియర్ లో అన్నం, యితర పదార్థాలు పెట్టబడి ఉన్నాయి. కుక్కర్ పాత్రల్లో అన్నం, పప్పు, పులుసు వగైరా ఉన్నాయి. గదిలో ఎంగిలి కంచాలు ఎక్కడా లేవు. వంట అయిందిగాని, ఎవ్వరూ భోజనం చేసిన సూచనలు లేవు.

ఒక బల్లమీద కొన్ని ఫోటోలు పడున్నాయి. వాటి మధ్య మురుగన్ స్టోర్ వాడిచ్చిన కాష్ బిల్లు వుంది.

బిల్లుని వాలి పరీక్షించాడు. 56-15 అయింది బిల్లు ప్రకారం అవన్నీ కొనడానికి! అవన్నీ ఎవరు కొన్నారు? పొట్లాలను విప్పలేదు. ఎవరో వాటిని కొని తెచ్చి అక్కడ పెట్టారు. మరో పనిలో నిమగ్నులై ఉండటం వలన ఆ పొట్లాలు అలాగే ఉండిపోయాయి.

గదిలోకొచ్చిన గిరివైపు చూశాడు వాలి.

"గిరీ, ఈ బిల్లు మురుగన్ స్టోర్సియిచ్చింది. ఈవస్తువులన్నీ ఎవరు కొన్నారో, ఎప్పుడు కొన్నారో కనుక్కో!"

బిల్లు పట్టుకొని గిరి బయటకు వెళ్ళిపోయాడు.

ఆరిపోయిన చుట్టను వాలి లైటర్‌తో వెలిగించాడు. నేలమీద పడున్న దినపత్రికలను తీసుకుని చూడసాగాడు.

మొదటి పేజీలో బాక్స్‌కట్టి ప్రచురించిన వార్త అతడిని ఆకర్షించింది. జనరల్ హాస్పిటల్లో ట్రీట్‌మెంట్ కోసం చేర్చిన నేరస్థుడు అంకినీడు కాన్‌స్టేబుల్‌ను గాయపర్చి పారిపోయాడు. అంకినీడుకోసం పోలీసులు పట్నంలో అన్నిచోట్లా గాలిస్తున్నారు.

పత్రికమీదున్న తారీఖులు చూశాడు వాలి. ఆ పత్రిక వెలువడి వారంరోజులైంది.

మరో దినపత్రికలో అంకినీడు గురించి వివరాలున్నాయి. అంకినీడు రాయపురంలో ఒక స్త్రీని చంపాడు. ఆమె నగలు దోచుకు పారిపోయాడు. వాటిని అమ్ముతూండగా అతడు పోలీసులకు చిక్కాడు. ఇంతకుముందు మరికొన్ని హత్యలు చేసినట్లు పుకార్లు వున్నాయి. అతడి కేసు విచారణ యింకా కోర్టులో సాగుతోంది.

ఇన్‌స్పెక్టర్ రామదాస్ గదిలోకొచ్చాడు.

"వాలిగారూ, పన్నెండూ ఒంటిగంట మధ్య ఆమె మరణించి ఉంటుందని డాక్టర్ సుధాకర్ అంటున్నారు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"రామదాస్ భాయ్, యీ పత్రికలు చూడు!" అన్నాడు వాలి.

"అందులో ఏముంది సార్?"

"పారిపోయిన క్రిమినల్ అంకినీడు గురున్నాడా?"

"అతడి కోసం మేం గాలిస్తున్నాం" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఇన్‌స్పెక్టర్ వైపు సూటిగా చూశాడు వాలి.

"ఈ పట్నంలో తలదాచుకోడానికి యీ యిల్లు కంటె మంచి చోటు అంకినీడికి ఎక్కడ దొరుకుతుంది?" అన్నాడు వాలి.

ఇన్‌స్పెక్టర్ రామదాస్ వులిక్కిపడ్డాడు.

"ఈ యింట్లో అంకినీడుకి ఆశ్రయమిచ్చారంటారా?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"రామదాస్ భాయ్, చంద్రమతికి నౌఖరు కావాలి. పాత నౌఖరు పని మాని వెళ్ళిపోయాడు. పోలీసులకు దొరక్కుండా ఎక్కడో దాగోవాలని ప్రయత్నిస్తూన్న అంకినీడు యిక్కడకు వచ్చి వుండొచ్చు."

"అంకినీడు మొహంచూస్తే వాడికి ఉద్యోగం ఎవ్వరూ యివ్వరు సార్. పేపర్లలో ఏదో చూసి మీరు వూహిస్తున్నారు!"

"ఒక్కోసారి నా వూహాలు నిజాలవుతాయి!" అన్నాడు వాలి క్లుప్తంగా.

కాస్సేపు యిద్దరూ మౌనంగా ఉన్నారు.

"రామదాస్ భాయ్, యీ గదిలో ఎన్నో పాత్రలున్నాయి. ఈ యింట్లో పనిచేసిన నౌఖరు వాటిని ముట్టుకుంటూ ఉండాలి. వేలిముద్రల కోసం పాత్రలనూ, తలుపులనూ చూడమను. అంకినీడు వేలిముద్రలతో వాటిని పోల్చి చూడ్డం మంచిది" అన్నాడు వాలి.

"అలాగే చేయిస్తాను, సార్" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

# 3

చుట్ట పీలుస్తూ వాలి ఇంటి చుట్టూ నడుస్తున్నాడు. ఎలక్ట్రిక్ లైట్లు వెల్గుతున్నాయి.

గిరి గబగబా వచ్చాడు.

"మురుగన్ స్టోర్స్‌కి వెళ్ళి అంతా కనుక్కున్నాను. గోపాలరావుగారి నౌఖరు అవన్నీ కొన్నాడట. వంద రూపాయిల నోటు ఇచ్చి తతిమా చిల్లర తీసుకున్నాడు. 12-30 నుంచి 12-45 దాకా అతడు ఆ షాపు దగ్గర ఉన్నాడట. అతడు వెళ్ళేముందు టైము అడిగితే షాపు యజమాని 12-45 అని చెప్పాడట" అన్నాడు గిరి.

కాలుతున్న చుట్టను వాలి చేత్తో పట్టుకున్నాడు. ఆలోచిస్తూ ఆగాడు.

"వాలిగారూ, మరో విషయం. వస్తువులు తొందరగా యివ్వండి, అయ్యగారికి కేరియర్ తీసుకెళ్ళాలి అని అతడు అన్నాడట!"

"గిరీ, దీన్నిబట్టి 12-45కి అమ్మాయి బ్రతికివుందని మనం వూహించాలి. చంద్రమతిని చంపి అతడు వస్తువులను కొనడానికి కొట్టుకు వెళ్ళడు" అన్నాడు వాలి.

వేగంగా హాల్లోకి పరుగెత్తాడు. ఫ్లోరసెంట్ లైట్ ప్రకాశవంతంగా వెల్గుతోంది. పెద్ద సోఫాలో గోపాలరావు బలహీనంగా పడున్నాడు. వాలిని చూసి అతడు లేచాడు.

"అబ్బాయి, నీ భార్య ఒంటిమీద చాలా నగలు వుండేవా?"

"అర డజను గాజులు, మెళ్ళో రెండు పేట్ల గొలుసు, కమ్మలు, మంగళ సూత్రం ఉండేవి."

ఇన్‌స్పెక్టర్ రామదాస్ అక్కడికొచ్చాడు.

"వాలిగారూ, చంద్రమతి తండ్రి రామ్మూర్తిగారు వస్తున్నారు. టెలిగ్రాం ఇప్పుడే వచ్చింది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"మంచిది రామదాస్ భాయ్, హత్యచేసిన వ్యక్తి నగలను అమ్మడానికి ప్రయత్నించవచ్చు. పాన్ బ్రోకర్లనూ, బంగారం కొనే వారినీ మీరు హెచ్చరించండి. పోయిన వస్తువుల వివరాలు వాళ్ళందరికీ పంపండి" అన్నాడు వాలి.

"అలాగే చేస్తాను సార్" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"హత్యకు ఉపయోగించిన ఆయుధం దొరికిందా?"

"లేదు సార్. యీ సమీపంలో వున్న ముళ్ళ పొదల్లో కూడా వెతికించాను."

"రామదాస్ భాయ్, వెనకవైపు నుయ్యి ఉంది. ఇక్కడికింకా కార్పొరేషన్‌వాళ్ళు మంచినీళ్ళను సరఫరా చేయటంలేదు. ఆ నూతిలో దిగి చూడమను!"

"అలాగే సార్. అది నాకు తట్టలేదు!" అని ఇన్‌స్పెక్టర్ రామదాస్ బయటకు వెళ్ళాడు.

చుట్ట పొగ పీల్చి గాలిలోకి వదులుతూ వాలి సోఫాలో కూర్చున్న గోపాలరావు వైపు చూశాడు.

"అబ్బాయి, నీ పెళ్ళయి ఎన్నేళ్ళయింది?"

"మూడేళ్ళయింది, సార్."

"నీ భార్యకు కంటికాలు ఎలా వచ్చింది?"

"చిన్నతనంలో అటకమీదనుంచి కిందపడిపోయిందని మామగారు చెప్పారు."

"కంటికాలున్నా ఆమెను పెళ్ళాడినందుకు నిన్ను మెచ్చుకుంటున్నాను!" అన్నాడు వాలి.

"వాలిగారూ, చంద్ర హృదయం వెన్నలాంటిది.

అదే నన్ను ఆకర్షించింది" అన్నాడు గోపాలరావు.

వాలి ఆలోచిస్తూ బయటకు నడిచాడు. రోడ్డుమీద నిలబడ్డాడు. నలువైపులా చూశాడు. పిట్టగేటు ప్రాంతంలో ఉన్నాడు గిరి.

"గిరీ!" పిల్చాడు వాలి.

గిరి నవ్వు మొహంతో దగ్గరకొచ్చాడు. ఇద్దరూ రోడ్డమ్మట మెల్లిగా నడుస్తున్నారు.

"ఏవో వస్తువులు కొనమని నౌఖరు నాగేష్‌కి ఆమె వందరూపాయలు ఇచ్చింది. హత్యచేయాలనే ఉద్దేశం ఉంటే నాగేష్ అప్పుడే ఆమెను చంపేసి, నగలూ, డబ్బూ పట్టుకు పారిపోవచ్చుగా?"

"అవును సార్."

"అతడు అలా చెయ్యలేదు. కొట్టుకెళ్ళి వస్తువులు కొని తెచ్చాడు. ఏ 12-55కో అతడు తిరిగి ఇంటికి వచ్చాడు. డాక్టర్ సుధాకర్ చెప్పిన దాన్నిబట్టి ఆమె పన్నెండూ ఒంటిగంట మధ్య మరణించింది. నాగేష్ ఇంటికి తిరిగొచ్చిన ఐదు నిమిషాల్లో యీ హత్య చేయవలసిన అవసరం అతడికి ఎందుకొచ్చింది?" అడిగాడు వాలి.

"అవును, సార్. ఆమె భర్త ఆఫీసుకు పోయాక ఏ క్షణంలోనైనా నాగేష్ చంద్రమతిని చంపొచ్చు. కాని అతడు చంపలేదు. మురుగన్ స్టోర్స్ నుంచి తిరిగొచ్చాక చంపడానికి ఏదో కారణం ఉండాలి" అన్నాడు గిరి.

"వంటగదిలో ఉన్న పేపర్లూ అవీ చూసి అతడు హంతకుడని ఆమె గ్రహించి, అతడిని అడిగిందేమో! తన రహస్యాన్ని బయటపెడ్తుందని భయపడి అతడామెను

చంపాడేమో!"

"తార్కికంగా ఆలోచిస్తే అలా అనుకోవాలి!"

ఇద్దరూ వెనక్కి తిరిగి నడవసాగారు. వాలి అమాంతంగా ఆగాడు. చుట్ట పొగ వదులుతూ నిలబడ్డాడు.

"నాగేష్ కాక మరెవరో ఆమెను చంపివుండొచ్చు. డబ్బుకోసం! ఇక్కడ ఎక్కువ జనసంచారం లేదు. నాగేష్ కొట్టుకెళ్ళినపుడు ఎవరో ఆమెను చంపివుండొచ్చు. ఇంటికి తిరిగొచ్చిన నాగేష్ శవాన్ని చూసి, భయపడి, తలుపు మూసి తాళం వేసి పారిపోయి ఉండొచ్చు."

"ఈ లైన్ ఆఫ్ థాట్ బాగుంది, వాలీగారూ" అన్నాడు గిరి.

ఇన్‌స్పెక్టర్ రామదాస్, ఒక కాన్‌స్టేబుల్ వాళ్ళ దగ్గరకు పరుగెత్తుకొచ్చారు.

"వాలిగారూ, మీ ఐడియా పూర్తిగా ఫలించింది, సార్. నూతిలో యీ కత్తి దొరికింది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

కాన్‌స్టేబుల్ చేతిలోవున్న కత్తివైపు వాలి పరీక్షగా చూశాడు. ఇరవై సెంటీమీటర్లు పొడుగ్గావుందా కత్తి. నల్లటి ప్లాస్టిక్ పిడి.

"కత్తి చాలా పదునుగా ఉంది, సార్" అన్నాడు కాన్‌స్టేబుల్.

అందరూ హాల్లోకి వెళ్ళారు. గోపాలరావు ముందుకు నడిచాడు వాలి.

"అబ్బాయి, ఈ కత్తిని ఇంతకుముందు చూశావా?"

కత్తి వైపు అతడు పరీక్షగా చూశాడు.

"ఈ కత్తి మాది కాదు. ఇంతకుముందు నేను

చూడలేదు” అన్నాడు గోపాలరావు.

“రామదాస్ భాయ్, కత్తిమీద వేలిముద్రలు ఉన్నాయేమో చూడమను. నూతి నీళ్ళలో పడున్నందు వలన వేలిముద్రలు చెదిరిపోవచ్చు. అయినా చూడ్డం మంచిది” అన్నాడు వాలి.

ఇన్‌స్పెక్టర్ రామదాస్ తలాడించాడు.

## 4

రామ్మూర్తి వయస్సు అరవై దాటింది. కూతురి శవాన్ని చూసి అతడు గుండెలు బాదుకుంటూ ఏడ్చాడు.

డిటెక్టివ్ వాలి అతడిని బయటకు తీసుకెళ్ళాడు. పిట్టగోడ ప్రాంతంలో రామ్మూర్తి కెదురుగా వాలి నుంచున్నాడు.

“రామ్మూర్తీ!, నువ్వు ఎంత విచారించినా నీ కూతురు తిరిగిరాదు. కాని ఆమెను హతమార్చిన వ్యక్తిని పట్టుకోడం, శిక్షించటం మన డ్యూటీ. నువ్వు నాతో సహకరించాలి!”

“ఏం కావాలో చెప్పండి, సార్.”

“నీ అల్లుడికి నువ్వు కట్నంగా చాలా ఇచ్చావా?”

“యాభై వేలిచ్చాను. పెళ్ళికి మరో యాభై వేలయింది. లక్షరూపాయిలిచ్చి నా బిడ్డకు చావును కొనిపెట్టాను!”

“నీ కూతురు హాయిగా కాపురం సాగించేదా?”

“ఆమె ఎప్పుడూ తన కష్టాల్ని గురించి నాకు రాయలేదు, సార్. చిన్నతనంలో ఆమె దేనికోసం దెబ్బలాడేదికాదు. చేతికొచ్చినదానితో తృప్తిచెందేది. ఆమె తత్వం అటువంటిది.”

“గోపాలరావు గురించి ఏం చెప్పగలవు?”

“అతడి కంపెనీ బాగా నడుస్తోందని అమ్మాయి నాకు

రాసింది. ఈ ఇంటి గృహప్రవేశం జరిగినపుడే నే నొచ్చాను. నా కూతురుమీద అతడికంతగా ప్రేమ లేదని అనిపించింది."

"ఎందువలన?"

"గృహప్రవేశం సమయంలో చాలామంది వచ్చారు. అతడు తన భార్యను ఎవ్వరికీ పరిచయం చెయ్యటం నేను చూడలేదు. అతడూ, అతడి కంపెనీలో పనిచేసే గీతా ఏవో గుసగుసలాడుతూ ఉండేవారు. ఆమె అందమైన పిల్ల. చలాకీగా ఉంటుంది."

"ఈ విషయం నువ్వు నీ కూతురికి చెప్పావా?"

"లేదు, సార్. ఆమెలో అనుమానం రేకెత్తించటం ఎందుకని వూరుకున్నాను."

"అల్లుడిని అడిగావా?"

"అడగలేదు. అడిగితే అతడికి కోపంరావచ్చు. కోపంతో నా బిడ్డను నా యింటికి పొమ్మనొచ్చు. అందుకని చూసీచూడనట్లు మా ఊరికి వెళ్ళిపోయాను."

కొత్త చుట్టతీసి వాలి వెలిగించాడు. పొగ వదులుతూ రామ్మూర్తి వైపు చూశాడు.

"ఇంకా ఏమైనా నాతో చెప్పాలా?"

"వాలిగారూ, మీ పేరుప్రఖ్యాతులను గురించి చాలా విన్నాను. నా బిడ్డను చంపిన ఆ దుర్మార్గుడిని పట్టుకుని, అతడు ఉరికంబానికి ఎక్కేటట్లు చూడండి."

"చూస్తాను!" అని వాలి లోపలకు వెళ్ళాడు.

ఇన్‌స్పెక్టర్ రామదాస్ ఎదురయ్యాడు.

"వాలిగారూ, కుక్కర్, మరికొన్ని పాత్రలమీద వేలిముద్రలున్నాయి. కొన్ని వేలిముద్రలు చంద్రమతివి. తతిమ్మా ఎవరివో చూడాలి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"మీ రికార్డులో అంకినీడు వేలిముద్రలు ఉంటాయిగా వాటితో పోల్చి చూడండి" అన్నాడు వాలి.

"అదంతా రేపు చేయిస్తాను, సార్. శవాన్ని పోస్టు మార్టమ్‌కు పంపిస్తున్నాను."

"రామదాస్ భాయ్, ఇక్కడ తెలుసుకోవలసింది ప్రస్తుతం ఏమీ లేదు. నా హోటల్‌కి వెళ్ళిపోతాను. ఆ వేలిముద్రల గురించి ఏదేనా తెలిస్తే వెంటనే నాకు చెప్పు" అని వాలి బయటకు నడిచాడు.

ఇన్‌స్పెక్టర్ రామదాస్ అతడి కూడా కారుదాకా వెళ్ళాడు.

## 5

డాక్టర్ ఆనంద్ కెదురుగా వాలి కూర్చున్నాడు.

"వాలిగారూ, నా నర్సింగ్ హోమ్‌కి వచ్చినందుకు చాలా సంతోషం. ఏం కావాలో చెప్పండి" అన్నాడు డాక్టర్ ఆనంద్.

"నిన్న గోపాలరావుకి నువ్వు ఆపరేషన్ చేశావా?"

"అది చాలా మైనర్‌ది, సార్. టోనెయిల్ లోపలకు పెరుగుతోంది. లోకల్ యనస్తీసియా ఇచ్చి గోరు తీసేశాను. రెండుగంటలు నర్సింగ్ హోమ్‌లో రెస్టు తీసుకుని ఇంటికి పొమ్మన్నాను. కాని అతడు వెళ్ళలేదు. ఐదింటికి నేనే ఇంటికి పంపివేశాను."

"అతను ఏ గదిలో ఉన్నాడు?"

"రూమ్ నంబరు 12లో సార్."

"అతడు సాయంత్రం 5దాకా 12 నంబరు గదిలోనే ఉన్నాడని చెప్పగలవా?"

డాక్టర్ ఆనంద్ బజ్జర్ నొక్కాడు. ఒక నర్స్ అతడి ముందుకొచ్చింది.

"రమా, గోపాలరావు నిన్న సాయంత్రం 5దాకా రూమ్ నంబర్ 12లోనే ఉన్నాడా?"

"పన్నెండింటికి ఆయన కాంటీన్ కి వెళ్లారు. మళ్లా ఎప్పుడు తిరిగొచ్చారో నాకు తెలియదు. రెండింటికి అటువైపు వెళ్లాను. అప్పుడాయన గదిలోనే ఉన్నారు."

"గోపాలరావు ఎప్పుడు గదికి తిరిగి వచ్చినదీ మరెవరైనా చూశారేమో!" అన్నాడు వాలి.

"పన్నెండునుంచి రెండుదాకా మాకు లంచవర్, సార్. ఆ సమయంలో నర్సులు ఎవ్వరూ ఉండరు" అందామె.

"డాక్టర్ ఆనంద్, చాలా థాంక్స్" అని వాలి కుర్చీలోంచి లేచి బయటకు నడిచాడు. నర్సింగ్ హోమ్‌లో చాలా గదులున్నాయి. నర్సింగ్ హోమ్ లాడ్జింగ్ హౌస్ గా అగుపిస్తోంది.

మెట్లు దిగి వెనుకనున్న కాంటీన్ లోకి వెళ్లాడు వాలి. కాంటీన్ మేనేజర్ నవ్వుతూ వాలికి నమస్కరించాడు.

"అబ్బాయి, రూమ్ నెంబర్ 12లో ఉండే గోపాలరావు నిన్న ఇక్కడ లంచ్ తీసుకున్నాడా?"

అతడు ఒక పుస్తకం పేజీలు తిప్పి చూశాడు.

"తిన్నారు సార్. ఒంటి గంటదాటాక ఆయన లంచ్ కి వచ్చారు."

"మీరు బయటవాళ్ళకు ఇక్కడ టిఫినూ, భోజనం అమ్ముతారా?"

"అమ్మం సార్. ఈ నర్సింగ్ హోమ్‌లోని వాళ్ళూ, వాళ్ళ అతిథులూ మాత్రం ఇక్కడ తినొచ్చు. ముందుగా ఆర్డరిచ్చిన వాళ్ళకే భోజనం పెడ్తాం, సార్."

"గోపాలరావు ముందుగా ఆర్డరిచ్చాడా?"

"తొమ్మిదింటికి మా బాయ్ ప్రతి గదికీ వెళ్ళి లంచ్ కావాలా అని అడుగుతాడు. అప్పుడు ఆర్డరివ్వాలి."

చుట్ట పొగ పీల్చి వదులుతూ వాలి తన కారువైపు నడిచాడు. తన భార్య కేరియర్ పంపుతుందని తెలిసి కూడా గోపాలరావు లంచ్‌కి ముందుగా ఆర్డరివ్వటం విచిత్రంగా వుంది. కారులో కూర్చుని వాలి తలుపు మూశాడు. పన్నెండింటికి లంచ్‌కి వెళ్తున్నానని నర్సుతో చెప్పిన గోపాలరావు ఒంటిగంట దాటిందాకా ఎందుకు వెళ్ళలేదు?

ఇదంతా అగమ్యగోచరంగా వుంది. తన హోటల్ వైపు వాలి కారును పోనిచ్చాడు.

హోటల్ గదిలోకి వెళ్ళగానే ఇన్‌స్పెక్టర్ రామదాస్ నవ్వుమొహం ప్రత్యక్షమైంది. పక్కనే గిరి ఉన్నాడు.

"వాలిగారూ, యూ ఆరే విజర్డ్! మీరు ఊహించిన దంతా నిజమైంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

పడక కుర్చీలో కూర్చుని చుట్ట పీలుస్తూ వాలి ఇన్‌స్పెక్టర్ వంక చూశాడు.

"రామదాస్ భాయ్, అంకినీడు నాగేష్ అనే పేరుతో చంద్రవతి ఇంట్లో నౌఖరుగా ఉండటం నిజమంటావు!" అన్నాడు వాలి.

"నిజం సార్. వేలిముద్రలు పోల్చిచూసి మా ఫింగర్ ప్రింట్ వాళ్ళు ఆశ్చర్యపోయారు. దానితో ఈ కేసు ముగిసినట్లే, సార్!"

వాలి గంభీరంగా నవ్వాడు.

"రామదాస్ భాయ్, యీ కేసు పరిశోధన ఇప్పటి నుంచే నిజంగా ప్రారంభమైనదనాలి! ఒక మెట్టు ఎక్క

వలసినచోట పదిమెట్లు పైకి దూకటం మనకు మంచిది కాదు!"

"వాలిగారూ, ఏమిటి మీ రనే ది? అంకినీడు హంతకుడు. చంద్రమతిని చంపి ఆమె నగల్తో పారి పోయాడు. సందేహంలేదు!"

"డాక్టర్ రిపోర్టు వచ్చిందా?" అడిగాడు వాలి.

"చంద్రమతి పన్నెండున్నర ప్రాంతంలో మరణించి ఉంటుందని తేలింది. ఆమె లంచ్ తినలేదని డాక్టర్ రిపోర్టులో వుంది."

"రామదాస్ భాయ్, 12-30 నుంచి 12-45 దాకా అంకినీడు వురఫ్ నాగేష్ మురుగన్ స్టోర్స్‌లో ఉన్నాడని నాకు తెలిసింది. అంకినీడు హంతకుడే, కాని ఈ హత్య అతడు చేసుండకపోవచ్చు."

"అయితే ఎవరు చేసుంటారు?"

"ప్రస్తుతం నేను చెప్పలేను. త్వరలో మనకు తెలుస్తుంది" అన్నాడు వాలి క్లుప్తంగా.

# 6

సాయంత్రం ఐదు దాటింది. రిటైర్డు కాలేజి ప్రిన్సిపాల్ సుందరం ముందు వరండాలో కూర్చుని భార్యతో పిచ్చాపాటీ మాట్లాడుతున్నాడు. అతడి చేతిలో దినపత్రిక వుంది.

"సార్!" అన్నారెవరో.

సుందరం అటువైపు చూశాడు. చిరిగిన పంచ, షర్టు ధరించిన వ్యక్తి నిలబడి ఉన్నాడు. నల్లటి గడ్డం.

కళ్ళజోడుగుండా సుందరం అతడివైపు చూశాడు. అలా చూస్తూనే ఉన్నాడు.

"ఏం కావాలి?"

"విజయవాడనుంచి వచ్చానయ్యా. మీరు ఏదేనా పనిచే చేసుకుంటూ జీవిస్తాను. తిండిపడేసి మీకు తోచింది ఇవ్వండి" అన్నాడతను.

"నీ పేరు?"

"గోపాలం, సార్."

ఇందిరానగర్‌లో సుందరం ఇల్లు రోడ్డు చివర్న వుంది. అతడు భార్యవైపు చూశాడు.

"ఏమంటావే?"

భార్య సుమతి దూరంలో నిలబడిన అతడి వైపు చూసింది. అతడు కష్టంలో ఉన్నట్లున్నాడు.

"చూడు వున్నదేదో పెడ్తాం. పనిలో చేరినతర్వాత యిదీ అదీ కావాలని అడక్కూడదు!"

"అడగనమ్మా!"

"అయితే అలా వెనక్కురా. అక్కడ పొయ్యివుంది నీళ్ళు తోడుదువుగాని" అందామె.

అతడు పక్కకు తిరిగి వెళ్ళిపోయాడు. ఆమె లోపలకు వెళ్ళింది. ఏం చెయ్యాలో అంతా చెప్పి ఆమె భర్త దగ్గరకు తిరిగి వచ్చింది.

"పట్నంలోని నౌఖర్లు మరీనె త్తెక్కి కూర్చుంటున్నారు. ఇటువంటివాడు దొరకటం మంచిదే!" అందామె.

"నీ అదృష్టాన్ని చూసి అప్పుడే మురిసిపోకు! ఇప్పుడు వాడు దీనస్థితిలో వున్నాడు. నాలుగు ముద్దలు లోపల వెళ్ళాక తెలుస్తుంది. మూడు రోజులు నువ్వు పెట్టిన తిండి తిన్నాక వీడికి కొమ్ములు వస్తాయి" అన్నాడు సుందరం.

ఆమె కిలకిల నవ్వింది.

"అందరూ అలా ఉండరండీ. ఏదో కష్టంలో

ఇరుక్కుని వీడు ఇంతదూరం వచ్చుంటాడు. శాస్త్ర తిండి పడేసి నెలకో అయిదు రూపాయలు చేతిలో పెడ్తే సంతోషిస్తూ పడుంటాడు."

సుందరం దినపత్రికలను చూస్తూ ఉండిపోయాడు.

"బావిలోంచి నీళ్ళు తోడుతూంటే చేతులు పడిపోతున్నాయి" అని ఆమె లోపలకు పరుగెత్తింది.

# 7

మిస్ గీత రిసీవరున్నందుకుంది.

"హలో! రావు అండ్ రవూఫ్ అడ్వర్టయిజింగ్ కంపెనీ!" అందామె.

"గీతా, నేను!" అందో పురుష కంఠం అటువైపు తగ్గు స్వరంలో.

"హలో, గోపాలా?"

"యస్ డార్లింగ్! నీతో రహస్యంగా అర్జెంటుగా మాట్లాడాలి. ఎక్కువసేపు నీతో ఉండలేను. పరిస్థితులు నీకు తెలుసుగా?"

"తెలుసు."

"రాత్రి ఏడింటికి నువ్వు బుహారీ హోటల్ వైపురా. నేను బ్లూ ఫియట్ కారులో స్టీరింగ్ వీలు వెనుక కూర్చునుంటాను. కారు నంబరు TNM 52487. గుర్తుంటుందా?"

"గోపాల్, నేను రాను. నాకు భయంగా వుంది."

"నాకు భయంగా లేదా? కలుసుకుంటే మనకు ధైర్యంగా ఉంటుంది."

"ఆల్ రైట్ వస్తాలే."

"కారులో తిరుగుతూ మనం కాస్సేపు మాట్లాడుకుందాం."

"గోపాల్, ఆ కారెవరిది?"

"ప్రస్తుతం ఒక ఫ్రెండుది. త్వరలో మనదవుతుంది."

అటువైపు నుంచి రిసీవర్ పెట్టిన శబ్దం వినిపించింది. మిస్ గీత రిసీవర్ని పెట్టేసి తనలో తను నవ్వుకుంది.

రోడ్డు లైట్లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. ఆమె పేవ్ మెంట్ మీద వయ్యారంగా నడుస్తోంది. ఇటూ అటూ కదిలే జనంతో పేవ్ మెంట్ కిటకిటలాడుతోంది.

బుహారీముందు నుంచి వెళ్తూ ఆమె తన వాచ్ వైపు చూసింది. టైము ఏడయింది. ఎన్నో కార్లు పేవ్ మెంట్ వారగా ఆపబడి వున్నాయి. ప్రతీ కార్ని చూస్తూ ఆమె ముందుకి కదులోంది.

బ్లూ ఫియట్! అదే నంబరు!

ఆమె వేగంగా కారువైపు నడిచింది. ముందు తలుపు తెరవబడింది. ఆమె ఎక్కి కూర్చుంది. తటాలున కారు దూసుకుపోయింది.

కారు కదిలాక ఆమె ఓరగా పక్క వ్యక్తి వైపు చూసింది. ఆమె గుండె దడదడలాడింది.

అజానుబాహువైన వ్యక్తి డ్రయివర్ సీటులో ఉన్నాడు. బుగ్గ మీసాలు? నోట్లో చుట్ట!

ఆమె భయంతో అరవబోయింది.

"అమ్మాయి, అరవకు! నేను డిటెక్టివ్ వాలిని!" అన్నాడతను గంభీరంగా.

# 8

ఇంటిముందు కారు, వెనకనే పోలీసు జీప్ ఆగింది. వాలి, గిరి, ఇన్ స్పెక్టర్ రామదాస్, కొందరు కాన్ స్టేబుల్సు కిందకు దిగారు.

సుందరం వాళ్ళకెదురుగా వచ్చాడు.

"నమస్కారాలు మీకు! మీకు కావలసిన వ్యక్తి బాత్ రూమ్‌లో స్నానం చేస్తున్నాడు. బయటవుంటే మిమ్మల్ని చూసి పారిపోతాడని నేనే స్నానం చెయ్యమన్నాను" అన్నాడు సుందరం.

"మంచి పనిచేశారు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

నలుగురు కాన్‌స్టేబులను బాత్ రూమ్ బయట కాపలా ఉండమని పంపాడు ఇన్‌స్పెక్టర్ రామదాస్.

"ఇన్‌స్పెక్టర్ గారూ, ఆ రెండువేల రివార్డునకు వచ్చేటట్లు చూడాలి!" అన్నాడు సుందరం.

"అంకినీడుని పట్టిచ్చినవాళ్ళకు తప్పక రెండువేలూ వస్తాయి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

లోపలనుంచి అరుపులు వినబడ్డాయి. కాస్సేపట్లో అంకినీడుని హాల్లోకి కాన్‌స్టేబుల్సు యీడ్చుకొచ్చారు.

వాలి, ఇన్‌స్పెక్టర్ రామదాస్, గిరి అతడిముందుకు వెళ్ళారు.

"చంద్రమతిని హత్య చేసినందుకు నిన్ను అరెస్టు చేస్తున్నా" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నేనామెను చంపలేదు, సార్" అర్చాడతను.

"ఏం జరిగిందో చెప్పు" అన్నాడు వాలి.

"నేను నేరస్తుడినని మీకు తెలుసు. నేను ఏం చెప్పినా మీరు నమ్మరు!"

"నమ్మినా, నమ్మకపోయినా నిజం తెలియాలి" అని వాలి అతడి వంక చూశాడు.

అతడు వాలి వైపు చూసి చేతులెత్తి నమస్కరించాడు.

"ప్రఖ్యాత డిటెక్టివ్ వాలిగారు మీరే అనుకుంటాను.

మీరీపాటికి నిజం తెల్సుకునే ఉంటారు. జరిగింది మీరే చెప్పండి!"

చుట్టు పీలుస్తూ వాలి నలువైపులా చూశాడు. అందరి చూపు వాలిమీదే వుంది.

"12-30 ప్రాంతంలో చంద్రమతి నిన్ను మురుగన్ స్టోర్స్‌కు పంపింది. నీకు వందరూపాయిలు యిచ్చింది. వస్తువులు కొని నువ్వు తిరిగొచ్చేసరికి ఒంటిగంట అవుతోంది. పడగ్గదిలో ఆమె చచ్చిపడుంది. నువ్వు హడిలిపోయావు. అక్కడ ఉండటం నీకు ప్రమాదకరం. పోలీసులు వస్తారు. తలుపు మూసి తాళంవేసి నువ్వు పారిపోయావు. తాళం వేయటం మూలంగా శవాన్ని ఎవ్వరూ తొందరగా చూడరని నీ ఉద్దేశం. దూరంగా పోడానికి నీకు టైమ్ దొరుకుతుంది" అని వాలి ఆగాడు.

"మీరు చెప్పినదంతా నిజమే. కాని ఒక విషయం మీరు వూహించలేదు. నేను స్టోర్స్‌కు వెళ్ళేముందు ఎవరో ఆమె పడగ్గదిలో ఉన్నారు. ఆ వ్యక్తి ఎవరో నేను చూడలేదు. ఆమె హాల్లోకొచ్చి డబ్బిచ్చి నన్ను పంపేసింది. రోడ్డుమీద ఒక ఆటో ఆగివుంది. అది నేను పనిచేసే ఇంటికి కొంచెం దూరంగా ఆపబడింది. నేను తిరిగొచ్చేసరికి ఆటో లేదు. కొన్న వస్తువులు వంటింట్లోని బల్లమీద పెట్టి మిగిలింది ఇద్దామని పడగ్గది గుమ్మంలో నిలబడి ఆమెను పిల్చాను. ఎంతకీ పలక్కపోతే లోపలకు చూశాను. ఆమె శవం చూసి భయపడిపోయాను. తర్వాత మీరు చెప్పినట్లే అంతా జరిగింది."

"ఆమె ఒంటిమీద నగలున్నాయా?"

"లేవు సార్."

"ఆమె పడగ్గదిలో ఉన్నవాడే హంతకుడై వుండాలి"

అన్నాడు ఇన్ స్పెక్టర్ రామదాస్.

"ఎవరతను?" అన్నాడు గిరి.

"అతడి కోసం మనం మరో చోటకు వెళ్ళాలి!" అన్నాడు వాలి గంభీరంగా.

# 9

ఇంటిముందు XYZ కారు ఆగింది. వెనకనే పోలీస్ వాన్ పార్క్ చేయబడింది.

వాలి, గిరి లోపలకు వెళ్ళారు. పడగ్గదిలోంచి బయటకొచ్చాడు గోపాలరావు.

"నమస్కారం వాలిగారూ! హంతకుడు దొరికాడా?"

"దొరక్కుండా పోతాడా?" అన్నాడు వాలి.

ఇన్ స్పెక్టర్ రామదాస్ బేడీలు వేసిన అంకినీడును హాల్లోకి తీసుకొచ్చాడు. అతడివైపు కసితో చూశాడు గోపాలరావు.

"వాలిగారూ, హంతకుడిని ఇంత తొందరగా పట్టుకున్నందుకు మీకు నా జోహార్లు!" అన్నాడు గోపాలరావు.

అతడి వైపు సూటిగా చూశాడు వాలి. చుట్ట పొగను గుప్పున బయటకు వదిలాడు.

"మిస్టర్ గోపాలరావు! చంద్రమతి హంతకుడెవడో నేను చెప్తే నువ్వు నీ జోహార్లను దిగమింగేస్తావు!"

"వాలిగారూ, ఏమిటి మీరనేది?"

"అమాయకురాలైన నీ భార్యను అమానుషంగా హత మార్చావు! ఆ నేరాన్ని అంకినీడుమీదకు తోయాలని చూశావు!"

"వాలిగారూ, ఈ హత్య గురించి నాకేమీ తెలియదు. నేను నర్సింగ్ హోమ్‌లో వున్నాను!"

"పన్నెండింటికి నర్సింగ్ హోమ్ వదిలి ఆటోలో ఇక్కడికొచ్చావు. అంకినీడు చూడకుండా నీ భార్య గదిలో ప్రవేశించావు. నీ భార్యచేత అంకినీడుకు వంద రూపాయలు ఇప్పించి మురుగన్ స్టోర్స్‌కు పంపేశావు. యింట్లో ఎవ్వరూ లేరు. నీ భార్యను చంపి, కత్తిని నూతిలో పారేశావు. నగలు పట్టుకుని ఆటోలో వెళ్ళిపోయావు!"

"అదంతా అబద్ధం! ఎవ్వరూ నమ్మకండి!"

"గోపాలరావు, ఈ నేరం అంకినీడు మీదకు వెళ్తుందని నువ్వు వూహించావు. నీ ఇంట్లో పనికిచేరిన అంకినీడు హంతకుడని గ్రహించి యీ హత్యావిధానాన్ని ఆలోచించావు!"

"అంతా అబద్ధం! మీరు చెప్పేదానికి ఋజువులు లేవు!"

"రోడ్డుమీద నువ్వు ఉపయోగించిన ఆటో వుంది. పిలిస్తే డ్రయివర్ లోపలకొస్తాడు" అని వాలి బయటకు చూశాడు.

"నా భార్య నగలు ఏమయ్యాయి?"

"నర్సింగ్ హోమ్ కొచ్చిన మిస్ గీతకు అవి నువ్విచ్చావు. ఆమె బయట వున్న పోలీస్ వాన్‌లో వుంది! నగలు ఆమె దగ్గరున్నాయి."

గోపాలరావు నోటమ్మట మాట రాలేదు. అతడు సోఫాలో కూలిపోయాడు.

వాలి సగర్వంగా ఇన్‌స్పెక్టర్ వైపు తిరిగాడు.

"రామదాస్ భాయ్ అదుగో చంద్రమతి హంతకుడు! అరస్టు హిమ్!" గర్జించాడు వాలి.

ఇన్‌స్పెక్టర్ రామదాస్, ఒక కాన్‌స్టేబులు గోపాలరావు వైపు అడుగు లేశారు.

—:ఐపోయింది:—

సీరియల్




(గత సంచిక తరువాయి)

## 21

మంచంమీంచి లేస్తూనే—"వకుళా!" అని అరిచి శారద.

"ఏం పిన్నీ!" అంటూ వచ్చి గుమ్మంలో నిలబడింది వకుళ. ఆమె తలవంచుకుంది. వినయంగా చేతులు నలుపుతోంది.

వకుళనలా చూడగానే శారదకు పాత వకుళ గుర్తొచ్చింది. ఆమె తృప్తిగా నిట్టూర్చి-"ఏమ్మా లేచావా?" అనడిగింది.

"నేను లేచి చాలా సేపయింది పిన్నీ — ఇల్లంతా ఊడ్చేశాను. అంట్లన్నీ తోమేశాను. గుండిగనిండా నీళ్ళు తోడాను. పొయ్యిమీద డికాక్షన్ మరుగుతోంది. పాలు కాగిపోయాయి—" అంది వకుళ. ఆమె కంఠం ఎంతో వినయంగా వుంది.

"అప్పుడే అన్ని పనులు చేసేశావమ్మా—" అంది శారద. తెచ్చిపెట్టుకున్నదే అయినా శారద నటన బాగానే చేసింది. అందులోనూ అప్పటికి వకుళ అన్ని పనులు చేసివుంటుందని ఆమె ఊహించలేదు. అందువల్ల ఆ క్షణంలో వకుళంటే రవంత ఆప్యాయత కూడా కలిగిందామెకు.

"అన్ని పనులేమున్నాయి పిన్నీ — ఎప్పుడూ ఉన్నవేగా?" అంది వకుళ. తర్వాత ఆమె నీళ్ళు నములుతున్నట్లుగా — "రాత్రి — నేను కొంచెం అతిగా ప్రవర్తించాను. నాకేమయిందో నాకే తెలియదు పిన్నీ-" అంది. ఆమె గొంతు దీనంగా వుంది.

"అవును. అసలు రాత్రి నీకేమయిందీ?" అంది శారద. ఆ గొంతు తీవ్రంగా వుంది. జోగారావు ఆమెను కాలిమీద గిల్లి హెచ్చరించాడు.

"ఏమో పిన్నీ! ఆ జబ్బు తగ్గినప్పట్నించీ నాకేదో

అయింది. నన్నెవరైనా ఏదైనా అంటే ఆవేశం వచ్చేస్తుంది. నాలో పశుబలం ప్రవేశిస్తుంది. వళ్ళు చల్లగా అయిపోతుంది. అందర్నీ భయపెట్టాలనిపిస్తుంది. పిశాచంలా నవ్వాలనిపిస్తుంది. అదైనా పగలంతగా ఉండదు. సాయంత్రమయ్యేసరికి పెరిగిపోతుంది. ఒకోసారి నాకు పిచ్చిపట్టిందేమోనని భయంగా కూడా వుంటుంది. రాత్రి నిన్నేమైనా అంటే క్షమించు పిన్నీ!" అంది వకుళ మళ్ళీ.

శారద మనసు తేలికపడింది—"పిచ్చి పిల్లా—వెళ్ళి నీ పన్లు చేసుకో—నేను నిన్ను క్షమించడమేమిటి? నువ్వు నా కూతురివి కాదూ?" అంది.

వకుళ వెళ్ళిపోయింది.

"నువ్వు నీ పాత అలవాట్లను మార్చుకోవాలి. దాంతో సౌమ్యంగా మాట్లాడ్డం అలవాటు చేసుకో. అదే చెబుతోందిగా—అవన్నీ జబ్బు లక్షణాలు. పరిస్థితి దాని అదుపులో వుంటే — అది నిన్నెదిరించగలగడం కల్ల! దాని జబ్బు తగ్గేదాకా నువ్వు జాగ్రత్తగా వుండు. లేకపోతే నువ్వు మంచమెక్కుతావు!" అన్నాడు జోగారావు.

"జబ్బు సంగతి బాగానే ఉందండీ—కానీ...." అంది శారద.

"ఊఁ .... కానీ .... ఏమిటో చెప్పు!" అన్నాడు జోగారావు.

"ఆ జబ్బు దానికి మళ్ళీ ఈ సాయంత్రం కూడా వస్తుందంటారా?" అంది శారద.

"అది నీ ప్రవర్తనలోనే వున్నదని నా అనుమానం-" అన్నాడు జోగారావు.

జోగారావు ఆఫీసుకు వెళ్ళిపోయాడు. పిల్లలు స్కూలుకు వెళ్ళిపోయారు. శారద భయపడే విశేషలేమీ యింట్లో జరగలేదు. వకుళ బుద్ధిగానే వున్నది. చెప్పిన పనులన్నీ చేసింది. ఎదిరించి మాట్లాడే లక్షణాలు కనబడ లేదు.

పని లేనప్పుడు వకుళ తన గదిలోకి పోయి తలుపులు వేసుకునేది. ఆ గదిలోకి వెళ్ళడానికి మాత్రం శారద సాహసించలేదు. ఏ మూలనో ఆమెలో భీతి రగు ల్కొన్నది.

మధ్యాహ్నం వకుళ తన గదిలో తలుపులు వేసుకుని పడుకుంది. శారద తన పడగ్గదిలో పడుకుంది. అప్పుడు ఎవరో ఇంటి తలుపులు తట్టారు.

"వకుళా! వెళ్ళి తలుపు తీయమ్మా—" అంటూ అరి చింది శారద.

హాల్లో ఏం జరుగుతోందో శారదకు తెలియదు.

తలుపు గడియ దానంతటదే వీడింది.

తలుపులు తోసుకుని లోపలకు ప్రవేశించాడు కోదండం. హాల్లో ఎవరూ లేకపోవడం అతడికి చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది.

తలుపు గడియ తీసిన చప్పుడతను స్పష్టంగా విన్నాడు. తలుపు దగ్గర్నుంచి పరుగెత్తిన అడుగుల చప్పుడేమీ అతడికి వినబడలేదు. క్షణాలమీద తలుపు తీసిన వ్యక్తి మాయంకావడం ఆశ్చర్యంగా వుందే? — అనుకున్నా డతను.

కోదండం మళ్ళీ తలుపు గడియవేస్తూంటే-"ఎవరూ?" అని గదిలోంచే అరిచింది శారద.

"నేనక్కా—" అంటూ కోదండం ఆ గదిలోకి

వెళ్ళాడు.

శారద మంచంమీంచి లేచి — "ఎలా వుందిరా నీకిప్పుడు?" అనడిగింది.

"ఈ రోజే డిశ్చార్జయ్యానక్కా — మీరూర్నించి ఎప్పుడొచ్చారు?" అనడిగాడు కోదండం.

"నిన్న వచ్చాంరా-వెళ్లేటప్పుడు వకుళని అనుకోకుండా ఇక్కడ వదిలేసి వెళ్ళాం. అప్పుడు దానికి కాస్త జ్వరంగా వుంది. తిరిగొచ్చేసరికి దానికి జ్వరం తగ్గింది కానీ ఏదో కొత్త జబ్బు పట్టుకుంది. ఏమిటోలా నవ్వడం-ఆ నవ్వు వింటే గుండెలవిసిపోతున్నాయి. ఎదిరించి మాట్లాడ్డం—అదెప్పుడూ అలాంటివి ఎరుగదు! మనుషుల్ని భయపెట్టడం .... నిన్న రాత్రంతా నిద్రపట్టక హడిలి చచ్చాననుకో-" అంటూ శారద గతరాత్రి తన అనుభవాలు చెప్పింది.

అంతా విని కోదండం—"వకుళలో ఏదో మార్పు వొచ్చినమాట నిజం. కానీ దానికి జబ్బుందని నేననుకోను. ఏదో నాటకమాడుతోంది. అది హాస్పిటల్‌కు వచ్చి మరీ నన్ను బెదిరించింది. నాకూ, జగ్గూకీ కూడా బుద్ధి చెబుతానని హెచ్చరించి కూడా వెళ్ళింది—" అన్నాడు.

కోదండం మాటలు శారదకు నచ్చాయి. వకుళ పెంకి చేష్టలన్నీ జబ్బుకు సంబంధించినవనుకుంటే రెండువిధాల ఇబ్బంది. ఒకటి ఆ చేష్టలన్నీ విధిగా భరించాలి. రెండు అన్నీ భరిస్తూ ఆమెపై జాలిపడాలి. అలాకాక ఆమె కావాలని నాటకమాడుతున్నదనుకుంటే ఏదోవిధంగా బుద్ధి చెప్పే మార్గం చూడొచ్చు. అందుకు కోదండమే ఉపాయం చెప్పగలడు.

"అయితే దాన్నేం చేయమంటావ్?" అంది శారద.

"ఇప్పుడది ఇంట్లోనే వుందా?" అన్నాడు కోదండం.

"వుంది—మాట్లాడతావా? నేను మాత్రం రాను. దాని గదంటే నాకు భయంగా వుంది—"

"సరే—నేను వెళ్ళి మాట్లాడతాను—" అన్నాడు కోదండం.

అతను వెనుదిరగ్గానే—"ఒరేయ్ జాగ్రత్తరోయ్—ఆ గదిలో ఏం కనబడ్డా కెవ్వుమంటూ కేక మాత్రం పెట్టకు. నా ప్రాణం పోయినా పోతుంది. గుండె నిబ్బరంతో వ్యవహరించు—" అంది.

కోదండం నిర్లక్ష్యంగా నవ్వి హాల్లోకి వెళ్ళి—వకుళ గదివైపు తిరిగాడు. దూరమైపోతున్న అతడి అడుగుల చప్పుడు వింటూ గుండె చిక్కబట్టుకుందుకు ప్రయత్నిస్తోంది శారద.

కోదండం వకుళ గది తలుపులు తీశాడు.

"ఎవరూ—లోపలకు రాకండి—" అన్న వకుళ కంఠం వినపడిందతనికి.

అయినా కోదండం చనువుగా గదిలో అడుగుపెట్టి అక్కడి దృశ్యం చూసి ఆగిపోయాడు.

అక్కడ ఒక ప్రక్కగా వకుళ నిలబడివున్నది. ఆమె శరీరంపై లంగా మాత్రం వున్నది. అప్పుడే బ్రాసరీ హుక్స్ పెట్టుకుంటూ—కోదండాన్ని చూసి చటుక్కున వెనక్కు తిరిగిందామె.

మిసమిసలాడే ఆ నవయవ్వనవతి శరీర లావణ్యం కోదండం శరీరంలో వేడిపుట్టించింది.

"ముందు గదిలోంచి బయటకు వెళ్ళు—" అంది వకుళ.

"నీతో మాట్లాడాలి!" అన్నాడు కోదండం.

"ముందు గదిలోంచి బయటకు వెళ్ళు!" అంది వకుళ మళ్ళీ.

"నేను నీకు పరాయివాణ్ని కాదు. నువ్వు బట్టలు కట్టుకుంటూండు. నేను మాట్లాడుతూంటాను-" అన్నాడు కోదండం.

వకుళ మాట్లాడలేదు. ఆమె రవిక వేసుకుని—చీర కట్టుకుంది. కోదండం కళ్ళప్పగించి చూస్తూ — "ఒంపు సొంపుల్లో, అందచందాల్లో నిన్ను మించినవారుంటారని నేననుకోను—" అన్నాడు.

"అందుకేగా నన్ను జగ్గూకి అప్పగించావు. వాడు నన్ను తనతోపాటు మరో నలుగురితో పంచుకున్నాడు. ఇప్పుడు నువ్వెందుకొచ్చావ్?" అంది వకుళ.

"వకుళా—నేనెంత మంచివాణ్నో నీకు తెలియదు. నాలో దుర్మార్గం లేకపోలేదు. ఎటొచ్చీ మిగతా దుర్మార్గులకీ నాకూ తేడా వుంది. నేను చేసిన తప్పు దిద్దుకోగలను. నన్ను కొట్టావన్న కసితో జగ్గూను నీ మీద కసి గొల్పాను. అది తప్పే! అంతమాత్రాన నీ కన్యాయం జరగనిస్తానా? నిన్ను నేను పెళ్ళిచేసుకుంటాను—...."
అన్నాడు కోదండం.

"ఈ మాటనడానికి నీకు సిగ్గులేదూ?" అంది వకుళ.

"మగాణ్ని నాకు సిగ్గెందుకు? నేనన్న మాటలకు ఆడదానివి కాబట్టి — నువ్వు సంబరపడిపోవాలి. ఎంత అదృష్టం నీది?" అన్నాడు కోదండం.

వకుళ కోదండాన్ని ఎగాదిగా చూసి—"నీ ఒంట్లో ఎలా వుంది?" అనడిగింది.

"హాస్పిటల్లోంచి డిశ్చార్జయి వచ్చాను. నిక్షేపం

లాగున్నాను. నువ్వు అనుమతిస్తే....” అని ఏదో అనబోగా వకుళ వారించింది.

“అలా కంగారుపడకు. నీతో చాలా మాట్లాడాలి. సాయంత్రం ఆరుగంటలకు మనం గుండువారి సందులో కలుసుకుందాం. నా గురించి కూడా పిన్ని దగ్గర్నుంచి అనుమతి సంపాదించు—” అంది వకుళ.

“గుండువారి సందులోనా? అక్కడెందుకు?” అన్నాడు కోదండం ఆశ్చర్యంగా.

“మన పెళ్ళి గురించి నేనో నిర్ణయం తీసుకునేముందు ఓసారి జగ్గూని కూడా పలకరించడం అవసరం. అదీ మనిద్దరం కలసి—ఏమంటావ్?” అంది వకుళ.

గుండువారి సందులోనే జగ్గూ వుంటాడని అప్పుడే కోదండానికి గుర్తొచ్చింది. అయితే ఆ సందు రౌడీలకీ, గూండాలకీ, సంఘ విద్రోహులకీ నిలయమని చెప్పు కుంటారు. పరువుగలవారెవ్వరూ ఆ వీధిలో అడుగు పెట్టరు. వకుళ ఏం చేయదల్చుకుందో అర్థంకాక కోదండం ఆశ్చర్యపడ్డాడు. కానీ అతడింకేమీ మాట్లాడకుండా కదిలొంచి వెళ్ళిపోయాడు.

## 22

“ష్” అన్నాడు రఘు.

రాగిణి చేతిలోని పేకముక్కలు క్రింద గిరవాటేసి—“ఇంక నేను పేకాడను బాబూ!” అంది.

అక్కడ కూర్చున్న శ్రీకాంత్, లక్ష్మి పకపకా నవ్వారు.

రాగిణికి సిగ్గు, కోపం కలిసిరాగా చటుక్కున అక్కణ్ణించి లేచి లోపలకు వెళ్ళిపోయింది.

శ్రీకాంత్ కలవారి బిడ్డ. తండ్రి ఆర్జించిన డిపాజిట్ల

వడ్డీలమీద బ్రతుకుతున్న అదృష్టవంతుడు. రెండు వ్యాపారాలున్నాయి. వాటిని మేనేజర్స్ కప్పగించి స్వల్ప లాభాలలో తృప్తిపడుతున్నాడు. అతడి భార్య లక్ష్మి. లక్ష్మి చెల్లెలు రాగిణి కొన్నాళ్ళు సరదాగా అక్కాబావలతో గడపడానికి వచ్చింది. లక్ష్మి ఆరోగ్యంకూడా అంత బాగుండడం లేదు. ఆమె వంటింటి పనులు చేయకూడదని డాక్టర్లు సలహా ఇచ్చారు. అందుకని ఆ విధంగా కూడా పనికొస్తుందని రాగిణి వచ్చింది. రఘు శ్రీకాంత్ స్నేహితుడు. వారం రోజుల క్రితం రాగిణిని చూసి ఆకర్షితుడై—రోజూ వీళ్ళింటికి రావడం ప్రారంభించాడు. అతని ఉద్దేశం కొంతలో కొంత శ్రీకాంత్ పట్టాడు. రఘు గురించి తెలిసిన వాడవడంచేత అతను వారి పరిచయాన్ని ప్రోత్సహిస్తున్నాడు.

రాగిణి లోపలకు వెళ్ళి మళ్ళీ రాలేదు.

"కోపం ఎంతసేపు? త్వరగా రా మరదాలా—" అంటూ కేకపెట్టాడు శ్రీకాంత్.

లోపల అసలు అలికిడే లేదు.

"మనం ముగ్గురే ఆడుకుందాం?" అంది విసుగ్గా లక్ష్మి — "దీనికి ఏళ్ళొస్తున్నకొద్దీ మరీ చిన్నతనం వస్తోంది—"

"ఓ వయసులో ఆడపిల్లలకి పెంకితనమే అందమండీ" అన్నాడు రఘు.

"అలా అంటే నిజమేననుకుని మోసపోయి ఈయన్ని పెళ్ళిచేసుకున్నాను. తీరా పెళ్ళయ్యాక—ఆడదానికి కోపమేమిటని విసుక్కుంటున్నారు—" అంది లక్ష్మి.

"వెళ్ళి చాలా సేపయింది. తనింకా రాదేం?" అన్నాడు రఘు.

"అందుకే మనమో ఆట వేద్దాం—" అంది లక్ష్మి.

"అబ్బే—చిన్న పిల్లలతో పంతమేమిటండీ—మీరు కాకపోతే నేనైనా ఆమెను పిల్చుకుని వస్తాను—" అంటూ లేచాడు రఘు. అతడికి శ్రమివ్వడమెందుకని లక్ష్మి లేవబోయింది. శ్రీకాంత్ ఆమెను నడ్డిమీద గోకి వారించాడు.

"ఏమిటండీ—" అంది లక్ష్మి నెమ్మదిగా.

"వాళ్ళిద్దరికీ ఏకాంతం ఏర్పడితే ఎంతసేపుంటారో చూద్దాం—" అన్నాడు శ్రీకాంత్.

అయితే కొంచెంసేపట్లోనే రఘు కేకపెట్టాడు— "ఈమె లోపలెక్కడా లేదండీ—...." అని.

"ఏమాతుంది? మనల్నేడిపించడానికి ఎక్కడైనా దాక్కుందేమో—" అంటూ తనూ లేచాడు శ్రీకాంత్.

అయితే రాగిణి ఇంట్లో ఎక్కడా దాక్కోలేదు. ఆమె వంటింట్లోకి వెళ్ళి ఒక గ్లాసెడు మంచినీళ్ళు త్రాగి అక్కణ్ణించి పెరట్లోకి వెళ్ళి—పెరటి తలుపులు తీసుకుని రోడ్డెక్కింది. ఒకసారి రోడ్డెక్కాక ఆమె వెనకాముందు చూడకుండా గమ్యం తనకు తెలిసినదానిలా వెళ్ళిపోతోంది.

అలా ఆమె చాలాదూరం నడిచి ఓ సందుముందాగి పేరు రెండు మూడుసార్లు మననం చేసుకుంది.

అది గుండువారి సందు!

ఆమె ఆ సందులో అడుగుపెట్టి వరుసగా ఒకో యిల్లే చూసుకుంటూ ఓ ఇంటిముందు ఆగింది. ఇంటి నంబరు చూసుకుని రెండుమూడుసార్లు తలతాటించి—నెమ్మదిగా మెట్లెక్కి ఇంటి తలుపులు తట్టింది.

అదో చిన్న బంగాళా పెంకు ఇల్లు. రాగిణి తలుపు

తట్టగానే ఓ ఆడమనిషి వచ్చి తలుపుతీసి — ఎదురుగా వున్న ఆడమనిషిని చూసి—"ఎవరమ్మా మీరు?" అనడిగింది.

"నా పేరు రాగిణి. జగ్గూ యింట్లో వున్నాడా?" అంది రాగిణి.

"వున్నాడమ్మా—"

"ఓసారి అర్జంటుగా పిలు—"

ఆమె తటపటాయించింది.

"అర్జంటుగా జగ్గూని పిలు. నేను అలా కుర్చీలో కూర్చుంటాను—" అంటూ ఆమె చనువుగా వెళ్ళి అక్కడున్న ఇనుప కుర్చీలో కూర్చుంది.

తలుపుతీసి నామె ఇంకా తటపటాయిస్తూనే—"ఎలా పిలిచేదమ్మా?" అంది.

"జగ్గూ—అని పిలు" అంది రాగిణి చిరాగ్గా.

"అది కాదమ్మా — వాడు చిత్తుగా తాగి పడుకుని వున్నాడు. ఇలాంటి సమయంలో వాణ్ని లేపడం మంచిదికాదు. ఏంచేస్తాడో, ఎలా ప్రవర్తిస్తాడో వాడికే తెలియదు. వాడికేమైనా చెప్పాల్సిందుంటే నేను చెబుతాను—"

"చిత్తుగా తాగాడా? ఆ మత్తంతా నన్ను చూస్తే విడిపోతుందిలేకానీ వెళ్ళి వాణ్ని లేపు—" అంది రాగిణి హుందాగా.

తలుపు తీసినామెకు రాగిణి ఎవరో ఆమెకు జగ్గూతో ఏం అవసరమో తెలియదు. తప్పనిసరై ఆమె లోపలికి వెళ్ళి నిద్రపోతున్న జగ్గూని లేపిరిది. రెండుమూడుసార్లు జగ్గూ ఆమెను విదిలించికొట్టాడు.

"ఎవరో ఆడపిల్ల మంచి వయసులో వుంది. చాలా

అందంగా వుంది. నువ్వే కావాలంటోంది—" అందా ఆడమనిషి ఆఖరికి.

జగ్గూ చటుక్కున మంచంమీంచి లేచాడు. లుంగీని వంటిమీద గట్టిగా బిగించాడు. నాలుగంగల్లో రాగిణి వున్న గదిలోకి వచ్చాడు.

"నువ్వేనా జగ్గూ?" అంది రాగిణి.

"ఊఁ నువ్వెవరు—పంచదార చిలకలాగున్నావు—" అన్నాడు జగ్గూ.

"నా పేరు రాగిణి. గుండువారి సందులో ఓ గుండుగాడున్నాడని ఎవరో చెబితే చూడాలనిపించి వచ్చాను-" అంది రాగిణి.

జగ్గూ తెల్లబోయి—"ఏమన్నావ్?" అన్నాడు.

"ఒకసారి చెబితే చాలదుట్రా — తాగుబోతు చచ్చినోడా—" అంది రాగిణి.

జగ్గూకి ముందు ఏమీ తెలియలేదు. ఉత్త పుణ్యాన రాగిణి వచ్చి తనను తిడుతోందని అతడు గ్రహించడానికి కొంతసేపు పట్టింది. గ్రహించడమేమిటి—వాడి కళ్ళు ఎర్రబడ్డాయి. మరో అడుగు ముందుకేసి రాగిణి చెయ్యి పట్టుకొని — "నా యింటికి వచ్చి నన్నే తిడతావా— ఇప్పుడు నీ గతేమవుతోందో తెలుసా?" అన్నాడు.

"నీ యింటికొచ్చే నిన్ను తిట్టకపోతే—నా యింట్లో కూర్చుని తిట్టుకోమంటావా?—" అంది రాగిణి.

"తిడితే తిట్టు. నీ కంఠం ఎంచక్కా వుంది. మంచి టైముకే వచ్చావు. గబగబా తిట్టేసుకో. కాసేపటికి నీకు తిట్టడం మాటటుంచి మంచినీళ్ళడగడాని క్కూడా ఓపి కుండదు—" అన్నాడు జగ్గు. ఈసారి వాడామె పైట కొంగు పట్టుకున్నాడు.

రాగిణి వాణ్ని తిట్టడం ప్రారంభించింది. వాడామెను పెట పట్టుకు లాగాడు. ఆమె గుంజుకుంది. పెనగులాటలో చీర కాస చిరిగింది. రాగిణి వీధిలోకి పరుగెత్తింది.

"ఈ వీధి నాది. ఇక్కడ నన్నెవరూ ఆపలేరు—" అంటూ జగ్గూ వీధిలోకి వచ్చాడు.

రాగిణి అటూ యిటూ చూసి — "రక్షించండి, రక్షించండి - ఈ దుర్మార్గుడు నన్ను బలవంతం చేస్తున్నాడు-" అంటూ కేకలు వేయసాగింది. మధ్యలో ఆమె జగ్గూని తిడుతోంది.

జగ్గు కూడా—"రండిరారండి—కానీ ఖర్చులేకుండా అసలు సిసలు రేప్ సీను చూడండి. మా జగ్గు ప్రతాపం చూడండి. ఎవరైనా రాకుండా ఇళ్ళల్లో కూర్చున్నారంటే తంతాను. తొందరగా రండి—" అంటూ వీధిలోకి వచ్చి కేకలు పెట్టాడు.

క్రమంగా వీధిలో జనం పోగయ్యారు. అందులో ఆడవాళ్ళు, మగవాళ్ళు, పిల్లలు కూడా వున్నారు. వారిలో కొందర్ని జగ్గు రాగిణి చుట్టూ చేరి ఆమె పారిపోకుండా చూడమన్నాడు.

అయితే రాగిణి అసలు పారిపోయే ప్రయత్నమే చేయడంలేదు. ఆమె జగ్గును ఆగకుండా తిట్టిపోస్తూనే వున్నది. అప్పుడు కొంతమంది జనం ఆమె చుట్టూ వలయాకారంలో మూగారు.

జగ్గు అక్కడున్న జనాన్ని చూసి — "ఒరేయ్ చంద్రిగా—మనమేంచేసినా అంతా రూల్ ప్రకారం చేయ్యాలి. రేప్ సీను పద్దెనిమిదేళ్ళలోపు పిల్లలు చూడకూడదు. అలాంటివాళ్ళందర్నీ ఇళ్ళల్లో వుంచే బాధ్యత నీది—" అన్నాడు.

చంద్రగాడికా బాధ్యత ఇష్టం లేదు. రేవ్ నీను మిస్సవడం వాడికిష్టంలేదు. జగ్గు మాట కాదనలేక వాడా బాధ్యత స్వీకరించాడు. క్రమంగా రాగిణి చుట్టూ వందలకొద్దీ జనం వలయాకారంలో చేరారు.

అప్పుడు జగ్గు వలయం మధ్యలో ప్రవేశించాడు. రాగిణి వంక షోగ్గా చూసి—"ఏర్పాట్లెలా వున్నాయే పిల్లా!" అంటూ వీధి అదిరిపోయేలా నవ్వాడు.

రాగిణి ఓసారి గుంపునంతటినీ కలయజూసి—"ఇంత మంది వున్నారు. ఒక్కరంటే ఒక్కరు ముందుకు వచ్చి నన్ను రక్షించలేరా?" అనడిగింది. ఎవ్వరూ మాట్లాడ లేదు.

జగ్గు మళ్ళీ నవ్వాడు — "ఈ జగ్గు అంటే ఏమను కున్నావే—ఈ వీధికే రాజు. అసలే వీధిలో ఎవర్నేం చేసినా నాకెదురు లేదు. అలాంటిది నా వీధిలో నాకెవరైనా ఎదురొస్తారనుకున్నావా?....అసలు నేను నీ జోలికి రాలేదు. నువ్వే నా జోలికి వచ్చావు. అందుకు తగ్గట్టుగా నీకు బుద్ధి చెప్పకపోతే — నా పరువు మిగ లొద్దూ-" అంటూ వాడామెను చీర పట్టుకుని లాగాడు.

రాగిణి అటూ యిటూ పరుగెత్తాలని ప్రయత్నించింది. ఎవరైనా తనకు సాయం వస్తారేమోనని చూసింది. ఆ ప్రయత్నంలో ఆమె చీర జగ్గుకి చిక్కింది. లంగా, రవికలలో నడివీధిలో నిలబడిందామె.

జగ్గు విజయగర్వంతో వికటాట్టహాసం చేశాడు. చీరను జనం మధ్యకు విసిరేసి—"ఈ చీర ఖరీదైనది. మీలో ఎవరికి దొరికితే వాళ్ళు తీసుకోండి—" అన్నాడు.

అయితే జనాలకక్కడి నాటకం చూడ్డంలో వున్న ఉత్సాహం చీర తీసుకోవడంలో వున్నట్లు లేదు. అంతా

నిశ్శబ్దంగా అక్కడ జరుగుతున్నది చూస్తున్నారు.

జగ్గు ఈసారి రాగిణిని సమీపించి జాకెట్ పట్టు కున్నాడు. పెనుగులాటలో అది పర్రున చిరిగిపోయింది.

జనం ఉత్సాహంగా చూస్తున్నారు. జగ్గు విజయ గర్వంలో నవ్వుతున్నాడు.

వున్నట్టుండి రాగిణి—జగ్గు పొట్టలో ఒక్క పిడికిలి పోటు యిచ్చింది. ఊహించని ఈ అఘాతానికి జగ్గు, విలకిలలా పడిపోయాడు.

"లేరా, లే!" అంది రాగిణి. వాడు లేవగానే ఆమె మళ్ళీ మరో పిడికిలిపోటు ఇచ్చింది.

ఈ పర్యాయం జగ్గు ఆమె దెబ్బ కాచుకొనడానికి సిద్ధ పడి వున్నాడు. అయినా పడిపోయాడు.

రాగిణి వాణ్ని చేయిపట్టుకుని లేవదీసి ఎడాపెడా గుద్దులు గుద్దింది.

జగ్గు ఆశ్చర్యపోతున్నాడు. పిట్టలా కనబడే ఈ పిల్లలో ఎంత బలం? తనామెను ఒక్క ఎదురు దెబ్బ కూడా తియ్యలేకపోతున్నాదేమిటి? తన బలం ఏమైంది?

రాగిణి జగ్గును చావగొట్టేస్తోంది. జగ్గు ఆమె దెబ్బలు తట్టుకోలేక గోల పెట్టేస్తున్నాడు. అఖరిసారిగా యిచ్చిన ముష్టిఘాతానికి—రక్తం కక్కుకున్నాడు జగ్గు.

"ఇంకా కొడతాను. కానీ నువ్వు నా కాళ్ళమీదపడి క్షమించమంటే వదిలిపెడతాను—" అంది రాగిణి.

జగ్గు ఆమె కాళ్ళమీదపడి క్షమించమన్నాడు. రాగిణి వాణ్ణి ఒక్కతాపు తన్నింది. వాడు బంతిలా గాలిలోకి లేచి అల్లంత దూరాన పడ్డాడు.

ఆ క్షణంలో రాగిణి భద్రకాళిలాగున్నది. ఆమెను చూసి చుట్టూ జనం హడలిపోయారు. ఒక్కరూ ఆమెను

సమీపించడానికి సాహసించలేదు. వాళ్ళలో ఒకణ్ని పిలిచి—"నాకో రిక్షా పిల్చుకునిరా—" అంది రాగిణి.

వాడు వినయంగా రిక్షాను పిల్చుకుని వచ్చాడు. రాగిణి అందులో ఎక్కి—అక్కడి జనంవంక చూస్తూ— "మీ సందులోని వాళ్ళెవరైనా సరే—ఎప్పుడైనా ఎక్కడైనా ఆడపిల్లల జోలికెళ్ళారా—జగ్గూకి పట్టిన గతే పడుతుంది—" అని— రిక్షాను పోనివ్వమంది.

రిక్షాలో ఆమె ఇల్లు చేరేసరికి ఇంట్లో లక్ష్మి ఒక్కర్తే వున్నది. రాగిణి అవతారం చూసి ఆమె హడలిపోయింది. "ఏం జరిగిందే?" అంది కంగారుగా.

"అక్కా—జగ్గూ తెలుసా నీకు?" అనడిగింది రాగిణి.

"చెప్పుకుంటారు ఓ, రౌడీ వెధవ గురించి. నీకు వాడు గానీ తారసపడ్డాడా?" అంది లక్ష్మి కంగారుగా.

"వాడే నా చీర లాగాడు. రవిక చించాడు. అంతే వాడు చేయగలిగింది. ఆ తర్వాత నేను.... వాణ్ని...."

"ఊఁ ఏం చేశావ్!"

"చంపేశాను" అంది రాగిణి,

"నీకు పిచ్చిగానీ పట్టలేదుగదా—" అంది లక్ష్మి.

"లేదక్కా-వాడు నిజంగా నే సంఘానికి చీడపురుగు. ఒక నడివీధిలో వాడు ఆడదాన్ని చెయ్యి పట్టుకుని లాగి గుడ్డలు తీస్తూంటే కొన్ని వందలమంది ఆడా, మగా చోద్యంగా చూస్తున్నారు తప్పితే ఒక్కరూ వాణ్ని ఆపలేదు. అలాంటవాణ్ని బ్రతకనివ్వటం ఎంత ప్రమాదం?" అంది రాగిణి.

"అలాంటివాళ్ళెకరేం కర్మ—లక్షల్లో వున్నారు. మనమేం చేయగలం? నువ్వసలు ఇలాంటి విషయాల్లో జోక్యం చేసుకోవడమెందుకు? అసలా జగ్గూ ఎలా

తగిలాడు నీకు?" అంది లక్ష్మి.

రాగిణి ఒక్కసారి తల విదిల్చి తన అవతారం చూసుకుని — "ఉండక్కా — నన్ను ముందు బట్టలు కట్టుకురానీ —" అంది. త్వరగా ఆ పని చేసివచ్చి— "బావ ఏడి?" అనడిగింది.

"బావ, రఘు కలిసి నిన్ను వెతకడానికి వెళ్ళారు. యింట్లోంచి హాఠాత్తుగా ఎలా మాయమయ్యావో చెప్పు?"

"అంతా విచిత్రంగా వుంది. ఎవరో నా చెవిలో — ముందుకి పద—అన్నట్లయింది. వంటింట్లో మంచినీళ్ళు తాగుతున్నదాన్నల్లా అక్కణ్ణుంచి చెవిలో ఏం చెబితే అది చేశాను. ఆ చెప్పినదెవరో మహాశక్తి అయుండాలి. లేకపోతే జగ్గూలాంటి భయంకరాకారుణ్ని నే నొక్కర్తినీ చిత్తుచేయటం అసాధ్యం—" అంటూ రాగిణి మొత్తం జరిగిందంతా అక్కకు చెప్పింది. ఆమె కథ పూర్తయ్యేసరికి శ్రీకాంత్, రఘు కూడా నీరసంగా ఇల్లు చేరారు.

# 23

రాగిణి వెళ్ళిపోగానే అక్కడే గుంపులోవున్న కవుశ కోదండంతో—"జగ్గూ కథ అప్పుడే అయిపోలేదు— అదిగో అటు చూడు—" అంది.

కోదండం అటు చూశాడు.

నలుగురమ్మాయిలు—అంతా పదారేళ్ళ వయసువాళ్ళు- క్రిందపడివున్న జగ్గూ చుట్టూ మూగారు. నలుగురి చేతుల్లోనూ కొరడాలున్నాయి. ఒకరి తర్వాత ఒకరు అగకుండా జగ్గూని కొరడాలతో బాదుతున్నారు వాళ్ళు. ఎవరైనా వారించడానికి వస్తే అవలీలగా గెంటే

స్తున్నారు వాళ్ళు.

జగ్గూ కదలలేని స్థితిలో అతికష్టంమీద వాళ్ళకు చేతులు జోడించాడు. కానీ వాళ్ళ గుండెలు కరగడంలేదు. కోదండం ఆ దృశ్యం చూడలేక కళ్ళు మూసుకున్నాడు.

"ఇలా జగ్గూ ఎంతమందిని హింసించాడు. తన ఎదుట ఉన్నది ఆడది అనీ, అబల అనీ కనికరించలేదు. చేతులెత్తి ప్రొక్కుకున్నా జాలి తలవలేదు. వాడు చేసిన పాపాల్లో వెయ్యోవంతుకూడా ఇప్పుడు విధించిన శిక్ష చాలదు" అంది వకుళ.

"జగ్గూ బలం నాకు తెలుసు. కానీ వాడిశక్తి అంతా ఏమైపోయింది? ఆడపిల్లల చేతుల్లో దెబ్బలు తింటూ వాడెలా సహించి ఊరుకోగల్గుతున్నాడు—" అన్నాడు కోదండం.

"జగ్గూకిన అనుభవం నీకూ రాసిపెట్టి వుంది. ముహూర్తం ఒక్కటే నిర్ణయించాలి—" అంది వకుళ.

"ఏమన్నావ్?" అన్నాడు కోదండం—ఉలిక్కిపడి!

"పద ఇక్కణ్ణించి పోదాం!" అంది వకుళ. ఇద్దరూ అక్కణ్ణించి కదిలాక దారిలో అంది వకుళ—"జగ్గూ లాంటి వాళ్ళను ప్రోత్సహించే నీలాంటివాళ్ళకు జగ్గూతో సమంగా శిక్షపడొద్దూ—"

"మహా—అన్నీ నువ్వే చేసేదానిలా చెబుతున్నావ్?" అన్నాడు కోదండం.

"నేను। కాకపోతే ఇదంతా ఇంకెవరు చేస్తున్నారనుకున్నావ్? జరిగేది ముందుగా తెలుసు కాబట్టే నేను నిన్ను ఆ సమయంలో గుండువారి సందుకు తీసుకువెళ్ళాను...." అంది వకుళ.

కోదండం భయంగా వకుళవంక చూసి — "జగ్గాను శిక్షిస్తానని హాస్పిటల్లో నే చెప్పావ్ నువ్వు. కానీ నీ కిది ఎలా సాధ్యపడింది?" అన్నాడు.

"అదంతా నీ కనవసరం. ఈ వేళనుంచి సరిగ్గా ఎనిమిది రోజులు లెక్క పెట్టుకో-ఎనిమిదో రోజు రాత్రి పన్నెండు గంటలకు నువ్వు చస్తావు. ఈ ప్రపంచంలో ఎవ్వరూ కూడా నిన్ను రక్షించలేరు. జగ్గా ఎలా చచ్చాడో చూశావుగా. నీ చావూ అలాగే ఉంటుంది. ఈ భూమ్మీద నీకు మిగిలినవి ఇక ఎనిమిది రోజులే—!" అంది వకుళ.

"వకుళా—ఏమిటి నువ్వనేది?" అన్నాడు కోదండం కంగారుగా.

"ఇంక నీ టైము వృధా చేసుకోకు. ఇకనుంచి ప్రతి క్షణం అమూల్యం. వెళ్ళి అనుభవాలు వెతుక్కో. కానీ క్షణం క్షణం రాబోయే చావు గురించి తల్చుకుని భయపడుతూ బ్రతుకు. ఎనిమిదోరోజు రాత్రి పన్నెండు గంటలు. అంతవరకూ సెలవు. వెళ్ళు...." అంది వకుళ.

కోదండం ఎక్కడికీ వెళ్ళలేదు. ఆమె ననుసరించే వస్తున్నాడు.

"నీకు నా మాటల్లో నమ్మకం కుదరలేదా?" అనడిగింది వకుళ.

"లేదు—" అన్నాడు కోదండం.

"అయితే అనుభవించు—" అంటూ ఆమె అతడి పొట్టలో బలంగా గుద్దింది. మెలికలు తిరుగుతూ పడిపోయిన కోదండం—"ఇది ఆడదా, రాక్షసా—" అనుకున్నాడు. అతడు లేవాలని ప్రయత్నించాడు కానీ శక్తి చాలలేదు.

వకుళ తిన్నగా ఇంటికి వెళ్ళింది.

"అయ్యో — పెత్తనాలు, కోదండం ఏడీ?" అంది శారద.

"పెత్తనం అయిపోయింది. కోదండం దార్లో వుండి పోయాడు—" అంది వకుళ.

రమ, సూర్యం ఎక్కడికో ఆడుకుందుకు వెళ్ళారు. జోగారావు పేపరు చదువుకుంటున్నాడు.

"సరే—పద—నీతో చిన్న పని వుంది—" అంది శారద.

"చెప్పు పిన్నీ—నువ్వేం చెప్పినా చేస్తాను—" అంది వకుళ.

"గుండిగలో నీళ్ళన్నీ అయిపోయాయి. ఇంట్లో ఒక్క చుక్క నీరు లేదు. కాసిని నీళ్ళు తోడు తల్లీ—" అంది శారద అర్థింపునూ, విసుగునూ జోడించి.

"అలాగే—అదెంతసేపు పిన్నీ—" అంటూ వకుళ దొడ్లో నూతి దగ్గరకు వెళ్ళింది. అక్కడ ఆడవాళ్ళు తోడటం కోసం ఒక చేద—మగవాళ్ళు తోడటంకోసం ఒక మోకు ఉన్నాయి.

వకుళ ఓసారి చుట్టూ చూసింది. మోకును గుండిగకు బిగించింది. గుండిగను నూతిలోకి దింపి సునాయాసంగా పైకి లాగేసింది. ఆమె గుండిగ ఎత్తి క్రింద దింపే సమయానికి శారద అక్కడకు వచ్చింది. ఆ దృశ్యం ఆమెకు చూసినట్లే అనిపించింది. కానీ చీకట్లో పొరబడ్డానేమో ననుకుంది. కానీ క్షణాల్లో గుండిగ ఎలా నిండిందీ అన్న అనుమానం ఆమెకు వచ్చింది.

"అప్పుడే ఎలా తోడేశావే గుండిగెడు నీళ్ళు—" అంది శారద ఆశ్చర్యంగా.

"ఏమో పిన్నీ—గుండిగలో నీళ్ళు లేవని నువ్వన్నావు. తీరా చూస్తే గుండిగనిండా నీళ్ళున్నాయి. నేనో బకెట్ నీళ్ళు తోడాను—అంతే!" అంది వకుళ.

శారద తన బంగారు దుద్దులు కుంకుడుకాయ పులుసులో మెరుగు పెడదామని అక్కడకు వచ్చింది. ఆమె సరంజామా బైటకు తీసి — "నీళ్ళుంటే లేదని ఎందు కంటాను—" అంది.

"దీనికి వాదనెందుకులే — పిన్నీ నేనే గుండిగను నూతిలో ఒక్కసారిగా వేసి తోడేశాననుకో—" అంది వకుళ.

శారద ఉలిక్కిపడింది. సరిగ్గా అలాంటి దృశ్యమే తను చూశాననీ అనుకుంటోంది, వకుళేమో ఇప్పుడిలా గంటోంది. అసలేం జరిగింది? ఇది సాధ్యమా?

కంగారులో శారద చేయిపట్టు తప్పి చేతిలోని దుద్దులు చటుక్కున నూతిలోకి జారవిడిచి—వెంటనే—"అయ్యో! నా దుద్దులు—నూతిలో పడిపోయాయి—" అంది.

వకుళ క్షణం వృథా చేయలేదు. ఆమె చటుక్కున గాలిలోకి లేచి నూతిలోకి దిగి మరుక్షణంలో దుద్దుల్ని పట్టి మళ్ళీ ఎగిరి పైకివచ్చి శారద పక్క నిలబడి— దుద్దుల్ని ఆమె చేతిలో పెట్టింది.

శారదకు షాక్ తగిలినట్లయి ఒక్క క్షణం నోట మాట రాలేదు. వకుళ దుద్దులు తన చేతిలో పెట్టగానే ఆమె జరిగిన విషయం గుర్తించి—కెవ్వుమని కేక పెట్టింది.

ఆ కేకకు ఇంట్లోంచి జోగారావు పరుగెత్తుకుంటూ వచ్చాడు.

శారదకు ఇంకా మాట రావటంలేదు. జోగారావు కంగారుగా—"ఏం జరిగిందే?" అంటే ఆమె జవాబివ్వ

డానికి ఆశ్చర్యం కురాలయింది. వకుళ మాత్రం తనే కలగ జేసుకుని—"ఎందుకో పిన్ని జడుసుకుంది నాన్నా—తన దుద్దులు నూతిలోకి పొరపాటున జారవిడిస్తే నేను కాస్త లోపలికి వంగి నూతిలో పడిపోకుండా పట్టుకున్నాను. సంతోషించడానికి బదులు పిన్ని అరుస్తోంది—" అంది. జోగారావుకు విషయం అర్థంకాలేదు.

"ఇంతకూ బంగారం పోయిందనుకునా నువ్వు అరిచావు?" అన్నాడు జోగారావు.

శారద కాస్త కుదుటపడింది. భర్తను చూడగానే ఆమెకు ధైర్యం వచ్చింది. అప్పుడామె—"ఈ వకుళ—దీనికేమో అయిందండీ — నూతిలోంచి గుండిగను లాగి కిందపెడుతుంటే నేను కళ్ళారా చూశాను. అలాగే ఇది నూతిలోకి దూకి దుద్దులు తీసుకుని ఎగిరి పైకి వచ్చింది. నా గుండెలవిసిపోయాయి—" అంది.

"దూకడమూ—ఎగరటమూ ఏమిటి నాన్నా—నా బట్టలు తడైనా అవలేదే? పిన్ని ఏదో భ్రమపడుతోంది" అంది వకుళ.

"ముందు అంతా లోపలకు పదండి—" అన్నాడు జోగారావు. అతను శారదను తన గదికి తీసుకువెళ్ళి—"నీకు మతుందా, లేదా—నువ్వు చెప్పేమాటను ఎవరైనా విన్నారంటే నిన్ను పిచ్చాసుపత్రిలో వేస్తారు—" అన్నాడు.

"కానీ— నేను చెప్పేది అక్షరాలా నిజమండీ— ఇప్పుడు నాకెంతో భయంగా వుంది. అసలే మా అక్కయ్యను కూడా రమ్మన్నాను. అదేమో చంటి పిల్లాడితో వస్తుంది. ఈ దెయ్యప్పిడుగుతో ఎలా బ్రతుకుతామో ఏమిటో—" అంది శారద.

"శారదా-అసలు దెయ్యాల నేవే మనం కల్పించుకున్న భ్రమ. మనలోని భయం—దెయ్యం రూపంలో మనల్ని భయ పెడుతుంది. అలాంటిది నువ్వు మనిషి నే దెయ్య మంటున్నావ్?" అన్నాడు జోగారావు.

"అది మనిషని ఎవరన్నారండీ—అదే దెయ్యం—" అంది శారద.

"ఛీ—ఊరుకో—" అన్నాడు జోగారావు చిరాగ్గా. భార్యనామాత్రం మాట అనగల ధైర్యం ఇదివరలో అతడికి లేదు.

అప్పటికి ఊరుకుంది శారద. అందరి భోజనాలూ అయ్యాక—పిల్లలిద్దర్నీ తన గదిలో పడుకోమంది వకుళ.

"ఆ గదిలోనా—వద్దు!" అంది శారద.

అయితే వకుళ అప్పటికి కథలు చెబుతానని వాళ్ళిద్దర్నీ బాగా ఊరించింది. అందువల్ల వాళ్ళు వకుళ గదిలోనే పడుకుంటామని మొరాయించారు.

"సరే—మీ కర్మ!" అని ఊరుకుంది శారద.

ముగ్గురూ పక్కలు వేసుకున్నాక గది తలుపులు వేసింది వకుళ.

"కథ చెప్పక్కా—" అన్నాడు సూర్యం.

"కథలు చెప్పడానికి మూడ్ కావాలి. మూడ్ కోసం కళాకారులేం చేస్తారో తెలుసా — కాఫీ తాగుతారు, సిగరెట్లు తాగుతారు, బ్రాందీ తాగుతారు. అలాగే నేను కూడా మీ కోసం ఒకటి తాగుతాను. అదేంటో మీకు తెలుసా?" అంది వకుళ.

"నువ్వే చెప్పు—" అన్నాడు సత్యం.

"రక్తం!" అంది వకుళ.

రమ కంగారుగా — "అలా చెప్పి భయ పెట్టా

ద్దకా్క—" అంది.

"నేను భయపెడితే భయపడ్డానికి నువ్వు నాకంటే ఎంత చిన్నదానివే — మహా అయితే మూడున్న రేళ్ళు. అంతేగా! అయినా నేనేం అబద్ధం చెప్పటంలేదు. ఇందాకా భోజనాలప్పుడు మధు నాకు బాటిల్ ఇచ్చి వెళ్ళాడు. కావాలంటే చూడండి—" అంటూ ఎక్క డ్నించో ఓ బాటిల్ తీసుకొచ్చింది. అందులో ఎర్రటి ద్రవం — చూడ్డానికి రక్తంలా చిక్కగానే వుంది. వకుళ అది గటగటా తాగేసి — "పెదాల కంటుకుందంటే చెప్పండి—మూతి తుడుచుకుంటాను—" అంది.

సూర్యం, రమ వణికిపోతూ — "మాకు భయం వేస్తోంది!" అన్నారు నెమ్మదిగా.

"అలా కంగారుపడకండి—ఊరికే తమాషాకి అలా గన్నాను. మీరు కూడా మీ స్నేహితుల్ని అలా తమాషా చెయ్యొచ్చు—నేను తాగింది టమేటా జ్యూస్—అంతే!" అంది వకుళ.

పిల్లల కళ్ళలో కాస్త మెరుపు కనిపించింది-"ముందు నువ్వు మూతి తుడుచుకో—" అంది రమ. వకుళ మూతి తుడుచుకుని—"మంచి కథ చెప్పనా?" అంది.

"ఊఁ" అన్నాడు సూర్యం ఉత్సాహంగా.

"అనగా అనగా ఒక ఊళ్ళో ఓ రాజకుమారుడు. ఆ రాజకుమారుణ్ని ఓ పిశాచం ప్రేమించింది—" అంది వకుళ.

"పిశాచాల కథలొద్దు. నాకు భయం—" అంది రమ.

"నాకిష్టం. అదే చెప్పు—" అన్నాడు సూర్యం.

"వద్దన్నా కావాలన్నా నా కిష్టమైన కథే చెబుతాను...." అంది వకుళ. ఆమె కథ చెప్పబోపో

సాగింది.

పిశాచం అందమైన అమ్మాయి వేషంలో రాజకుమారుడి దగ్గరకు వెళ్ళిందిట. రాజకుమారుడా అమ్మాయిని ప్రేమించేశాట్ట. ఇద్దరూ కొంతకాలం ప్రేమగీతాలు పాడుకున్నారుట. కొన్నాళ్ళయ్యాక రాజకుమారుడా అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానన్నాట్ట. అప్పుడా అమ్మాయి విచారంగా—"నేను నిజంగా అమ్మాయిని కాదు. పిశాచాన్ని — నన్నెలా పెళ్ళిచేసుకుంటావు?" అనడిగిందట. రాజకుమారుడా మాటలు నమ్మలేదుట. అప్పుడా అమ్మాయి—కావాలంటే చూడు—నా నాలిక మోకాళ్ళు తాకేలా పెంచుతాను — అన్నదట. ఏదీ పెంచు చూద్దాం అన్నాడట రాజకుమారుడు. అప్పుడా అమ్మాయి లేచి నిలబడి తన నాలికను పెంచేసరికి అది పాదాలు కూడా తాకిందిట.

వకుళ చెబుతున్న కథను ఊహాలోకంలో చూస్తున్న రమ, సూర్యం ఇద్దరూ ఒక్కసారి వకుళ వంక చూసి కవ్వుమనబోయారు. కానీ వాళ్ళకు నోళ్ళు పెగలలేదు.

వకుళ నిలబడి వున్నది. ఆమె నాలిక పాదాలవరకూ వ్రేలాడుతున్నది.

"అక్కా—భయం—" అన్నాడు సూర్యం అతి కష్టంమీద.

వకుళ తన నాలికను వెంటనే నోట్లోకి లాగేసుకుని—"ఛీ—అలా భయపడతావేమిటి? ఇదంతా తమాషా—కావాలంటే నువ్వూ నీ నాలిక పెంచొచ్చు—ఈ మందు వేసుకుంటే—" అంది. ఆమె సూర్యంచేత ఓ బిళ్ళ మింగించింది. తర్వాత సూర్యాన్ని లేచి నిలబడమంది. అతగాడి నాలిక కూడా పాదాలను తాకింది.

రమ మాత్రం భయంతో వణికిపోతూ-"నాకిలాంటివి ఇష్టంలేదు. కధా వద్దు. ప్రయోగాలూ వద్దు. వెళ్ళి పడుకుంటాను...." అంది.

సూర్యం నాలిక మళ్ళీ మామూలుగా అయిపోయింది. "నా నాలిక చూస్తే నాకే భయం వేసింది-" అన్నాడు సూర్యం.

"పద తమ్ముడూ—మనిద్దరం వెళ్ళి అమ్మదగ్గర పడుకుందాం—" అంది రమ.

"వెళ్ళండి—" అంది వకుళ హేళనగా నవ్వుతూ.

ఇద్దరూ కదిలి వెళ్ళారు. అయితే వాళ్ళెంత ప్రయత్నించినా గది తలుపు గడియ విడలేదు.

"ఇలా వచ్చి బుద్ధిగా కూర్చోండి—" అంది వకుళ- "ఆ తలుపు నేను చెప్పినట్లు వింటుంది—"

రమ, సూర్యం భయంగా-"మమ్మల్ని పోనియ్యక్కా—మాకు భయమేస్తోంది—" అన్నారు.

"నాకూ భయమే-మీరు నాకు సాయం. మీకంతగా నేనంటే ఇష్టంలేకపోతే నేను మంచంమీద పడుకోనులెండి—" అంటూ వకుళ గాలిలోకి ఎగిరి ఇంటికప్పుకు అంటుకుని—వాళ్ళ వైపు తిరిగి — "నేను కనబడుతున్నానా?" అనడిగింది.

"అక్కా — నువ్వు మనిషివి కాదు. దెయ్యానివి. మమ్మల్ని వదిలిపెట్టు—" అంటూ అరిచింది రమ.

"అరవకండి. మీ మాటలు బయటకు వినిపించవు-" అంది వకుళ.

"ప్లీజ్—అక్కా—మమ్మల్ని వదిలిపెట్టు—అక్కా-ప్లీజ్ మమ్మల్ని వదిలిపెట్టు—" అంటూ గోలపెట్టసాగింది రమ. సూర్యం నోటమాటరాకుండా గుడ్లు పెద్దవి

చేసుకుని వకుళ వంక చూడసాగాడు.

వకుళ నేలమీద వాలి పకపకా నవ్వసాగింది. నెమ్మదిగా, భయంకరంగా వున్న ఆ నవ్వు వింటూంటే పిల్లలిద్దరికీ గుండెలవిసిపోతున్నాయి.

ఇద్దరూ పెద్దగా అరిచి స్పృహతప్పి పడిపోయారు.

కాసేపాగి వకుళ ఇద్దర్నీ చెరో భుజంమీదా వేసుకుంది. ఆమె ముందుకు నడుస్తూంటే తలుపులన్నీ వాటంతటవే తెరుచుకున్నాయి. ఆమె వీధిలోకి వెళ్ళి ఇద్దర్నీ అరుగుమీద పడుకోబెట్టి—మధు ఇంటికి వెళ్ళింది. కిటికీ దగ్గర నిలబడి—"మధూ!" అని పిలిచింది.

మధు బయటకు వచ్చాడు. పిల్లలిద్దర్నీ ఏం చేయాలో ఆమె మధుకు చెప్పింది. మధు తలూపాడు.

"అన్నట్లు మన ఇల్లు సిద్ధంగా వుందా?" అనడిగింది వకుళ.

"ఆహా — అడ్వాన్స్ కూడా ఇచ్చాను .... ఎప్పుడు కావాలంటే అప్పుడు వెళ్ళొచ్చు—" అన్నాడు మధు.

"నేనెప్పుడు రమ్మంటే అప్పుడు రావడానికి నువ్వు సిద్ధంగా ఉన్నావా?" అనడిగింది వకుళ.

"ఉన్నాను—" అన్నాడు మధు.

"మనింటి గురించి అంతా రహస్యంగా ఉండాలి—" అంది వకుళ.

"అంతా రహస్యంగానే ఉంది—" అన్నాడు మధు.

"సరే—వెళ్ళి పనిచూడు—" అంది వకుళ.

## 24

"పిన్నీ!"

తెలతెలవారుతూండగా ఎవరో చెవుల దగ్గర గుసగుసలాడినట్లు వినబడి కళ్ళు విప్పింది శారద.

గుమ్మం దగ్గర వకుళ నిలబడి వుంది. ఆమె శారదను సైగ చేసి పిలుస్తోంది.

శారద మంచంమీంచి లేచి వెళ్ళి—"ఏమిటీ?" అంది. వకుళ ఆమెను హాల్లోకి తీసుకువెళ్ళి—"పిల్లలిద్దరికీ రాత్రి వళ్ళెరుగని జ్వరం వచ్చింది. కాసేపు నాకు ఏంచేయాలో పాలుపోలేదు—" అంది.

"ఏరీ వాళ్ళు?" అంది కంగారుగా శారద.

"మధు వాళ్ళని హాస్పిటల్ కు తీసుకువెళ్ళాడు—" అంది వకుళ.

"మరి నన్నెందుకు లేపలేదు?" అంది శారద కోపంగా.

"ఇంత చిన్న విషయానికి లేపడమెందుకులే అని ఊరుకున్నాను. మధు వాళ్ళిద్దర్నీ ధర్మాసుపత్రిలో చేర్పించి వచ్చాడు—" అంది వకుళ.

"ధర్మాసుపత్రిలోనా—పాపిష్టిదానా—నా మీద ఇలా పగబట్టావేమే—" అంటూ అరిచింది శారద.

"అదేంటి పిన్నీ—నేను వళ్ళెరక్కుండా పడుంటే నువ్వు నన్నక్కడేగా చేర్చింది—" అంది వకుళ.

శారద ఉలిక్కిపడింది. అయినా రాత్రికి రాత్రి ఒకే సారిగా పిల్లలిద్దరికీ జ్వరం ఎలా వచ్చింది? ఈ పాపిష్టిది వాళ్ళిద్దర్నీ హడలగొట్టలేదు కదా! అయినా ఇది—ఇన్ని మాయలెలా నేర్చింది?....నీళ్ళలో మునిగి ఈదుతోంది. గోడకు అంటిపెట్టుకుని ఉంటోంది. గాల్లోకి ఎగురుతోంది. నూతిలోకి దిగుతోంది. గుండిగను ఒక్క చేత్తో మోస్తోంది. భయంకరంగా నవ్వుతోంది.

అసలిది మనిషేనా?

శారద పరుగున వెళ్ళి భర్తను లేపి—"రాత్రి పిల్ల

లిద్దరూ జడుసుకున్నారుట. వళ్ళెరుగని జ్వరం వచ్చిందిట. వకుళ వాళ్ళను ధర్మాసుపత్రిలో జేర్పించిందిట. అర్జంటుగా వెళ్ళి ఎలా ఉన్నారో చూసి రావాలి. రండి—పోదాం—" అంది.

జోగారావుకు విషయం అర్థంకావడానికి కాసేపు పట్టింది. భార్య చెప్పింది వినగానే అతడికీ కోపం వచ్చింది. మంచి ఊపుతో అతడు కూతురి దగ్గరకు వచ్చి — "ఇదేమైనా బాగుందా? పిల్లల్ని బెదర గొడతావా? వాళ్ళు వళ్ళెరక్కుండా పడుంటే పెద్దాళ్ళకి చెప్పకుండా ధర్మాసుపత్రిలో జేరుస్తావా-వాళ్ళు చావా లనుకున్నావా, బ్రతకాలనుకున్నావా?" అన్నాడు.

"మిస్టర్ జోగారావ్! నీ పెళ్ళాం నీ కూతురు వకుళ మీదకు జగ్గా అనే గుండాని ఉసిగొల్పి నానా హింసలు పెడితే ఆ విషయం తెలుసుకోగలిగావా? ఒక రోజు నీ కూతురు ఉన్నపళంగా వళ్ళెరక్కుండా పడుంటే అందుక్కారణం ఊహించగలిగావా? నీ భార్య నీ కూతుర్ని ధర్మాసుపత్రిలో జేరుస్తూంటే ఆపగలిగావా? దిక్కులేని పక్షిలా ఆమె అస్పత్రిలో పడుంటే ఊరి ప్రయాణం మానగలిగావా? ఇవేమీ చెయ్యలేనివాడివి— ఈ రోజు నన్నిన్ని ప్రశ్నలెలా వేయగలిగావ్?—చేసిం దానికి అనుభవించక తప్పదు. నీ పిల్లలు బ్రతకరు. పరుగున వెళ్ళి ఆఖరు చూపులు దక్కితే యేమో చూసుకో—" అంది వకుళ. ఆమె నోటినుండి ప్రతి మాటా కూడా ఉరుముతున్నట్లుగా వచ్చింది.

జోగారావు అప్రతిభుడై కూతురి మాటలు వింటూండి పోయాడు. ఆమె మాటలు ఆతడికి సగం అర్థమయ్యాయి. సగం అర్థంకావటంలేదు. అతడు శారద వద్దకు పరుగెత్తి

"అది జగ్గూ—అంటుందేమిటి?" అన్నాడు.

"ముందు ఆస్పత్రికి పోదాం పదండి—" అంది శారద.

ఇద్దరూ ఇల్లు గురించి పట్టించుకోకుండా ఆస్పత్రికి పరుగులెత్తారు. వాళ్ళలా వెళ్ళగానే ఇంటిముందు పెద్ద ట్రక్కు ఆగింది. కొందరు మనుషులు అందులోంచి దిగారు. వకుళ గదిలోని సామానంతా ఆ ట్రక్కులోకి తరలించబడింది. తర్వాత ట్రక్కు వెళ్ళిపోయింది.

ఆ తర్వాత వకుళ కూడా ఇంట్లోంచి బయటపడింది.

## 25

"లింగం—మొదటి ఇంజక్షన్ అలా వృథా అయి పోయింది. ఈ రెండో ఇంజక్షన్ అయినా మనం జాగ్రత్తగా ఉపయోగించాలి-" అన్నాడు మహాదేవుడు.

"అవునండి. సాయంత్రానికల్లా మందు తయారవుతుంది. ఈసారి మనద్దరిలో ఒకరం శవాన్ని కాగలించుకుని పడుకుందాం. ఒకరేమో ఇంజక్షనివ్వాలి—" అన్నాడు లింగం.

"ఇంతకీ ఆ శవం ఏమయిందంటావ్?" అన్నాడు మహాదేవుడు.

"తనకు వచ్చిన కొత్త శక్తికి అబ్బురపడి చాలా దూరం నడిచి—ఎక్కడో హఠాత్తుగా గుండె ఆగి పడి పోయుండాలి. అనుకోకుండా శవాలెదురైతే పోలీసులకు భయపడి—ఎవరైనా సరే మాఫ్ చేయడానికే చూస్తారు" అన్నాడు లింగం.

"ఒకవేళ ఆ శవానికింకా ఆయుష్షుందేమో—" అన్నాడు మహాదేవుడు.

"ఉండేవుండొచ్చు. ఆ పిల్ల ముఖం నాకు బాగా

గుర్తుంది. ఎప్పుడు ఎక్కడ కనబడినా తక్షణం గుర్తిస్తాను. కానీ ఆ పిల్ల ఎక్కడుందో, ఎలాగుందో—మనకెలా తెలుస్తుంది సార్!" అన్నాడు లింగం నీరసంగా.

"మన పరిశోధనలోని లోపం అదే! మనం బ్రతికించిన శవం ట్రాక్ కీప్ చేసేపద్ధతి చూడాలి—ఈ రోజు ఎలాగైనా సరే మనం ప్రత్యేకమైన జాగ్రత్తలు తీసుకోవాలి—" అన్నాడు మహాదేవుడు.

"ఇంతకీ శవం ఎక్కడ?" అన్నాడు లింగం.

సరిగ్గా అప్పుడే కాలింగ్ బెల్ మ్రోగింది.

"శవం అనగానే కాలింగ్ బెల్ మ్రోగింది. కొంపదీసి శవమే మ్రోగించడం లేదుగదా—" అన్నాడు మహాదేవుడు.

లింగం ఏదో అనేలోగానే గదిలో శివశంకరం అడుగు పెట్టాడు.

"నువ్వా అన్నయ్యా!" అన్నాడు మహాదేవుడు. ఆయన్ను చూడగానే మహాదేవుడికీ, లింగానికి కూడా శక్త్యోపాఖ్యానం పుస్తకం గురించి గుర్తుకొచ్చింది. వెంటనే లింగం లేచి గదిలోంచి పరుగెత్తాడు.

"ఏమిటతను అలా పరిగెడుతున్నాడు?" అన్నాడు శివశంకరం ఆశ్చర్యంగా.

"ఏమీ లేదు. శక్త్యోపాఖ్యానం గురించి గుర్తొచ్చింది" అన్నాడు మహాదేవుడు.

"మీరింకా ఆ పుస్తకం గురించి ప్రయత్నించలేదా?" అన్నాడు శివశంకరం.

"మరిచిపోయి ఇంకేదో గొడవలో పడ్డాం—ఇప్పుడు తెస్తాడుగా—" అన్నాడు మహాదేవుడు.

సరిగ్గా అరగంటలో లింగం తిరిగి వచ్చాడు. అతడి చేతిలో ఓ పుస్తకముంది. అది సదానంద విరచిత శక్త్యుపాఖ్యానం.

"తమ్ముడూ—ఈ ఒక్క రోజుకూ మీరు నాతో సహకరించాలి. ఎట్టకేలకు ఈ పుస్తకం మనకు లభించింది. ఇందులోని శ్లోకాలు నేను చదువుతుంటాను. అర్థం గురించి మనం ముగ్గురం చర్చిద్దాం.... ఈ రోజుకు మీకు ఇంకేమైనా పనులుంటే వాయిదా వేసుకోక తప్పదు—" అన్నాడు శివశంకరం.

"నాకు సంస్కృతం రాదే—" అన్నాడు లింగం.

"తమ్ముడికొచ్చు. మేమిద్దరం భావాలు చర్చిస్తూంటే ఉడతా భక్తిగా నువ్వూ సాయపడొచ్చు. అదీకాక ఎప్పటికప్పుడు వివరాలు కాగితాల మీద ఎలాగూ రాయాలి—" అన్నాడు శివశంకరం.

"లింగం—మన ప్రయోగం మరో రోజుకి వాయిదా" అన్నాడు మహాదేవుడు.

అప్పుడు శక్త్యుపాసన పారాయణం ప్రారంభమైంది. శివశంకరం పురాణం చెబుతున్న విధంగా ఒకో శ్లోకమే చదివి అర్థం చెప్పసాగాడు. అనుమానాలు వచ్చిన చోట మహాదేవుడు అడుగుతున్నాడు. సారాంశమంతా లింగం రాస్తున్నాడు. కథ రసవత్తరంగా కొనసాగుతోంది.

అది భద్రుడి కథ. అతడొక శాస్త్ర పరిశోధకుడు. ఈ ప్రపంచాన్ని తన గుప్పెట్లో వుంచుకోవాలన్న కోరికతో పరిశోధనలు జరుపుతున్నాడతడు. తన అనుభవంలో ఒక మూల సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడతను. ఈ ప్రపంచమంతా దుష్ట శక్తి, మంచి శక్తితో నిండి

వుంది. మనిషి చేసే ప్రతి పని వెనకా ఈ రెండు శక్తుల ప్రేరేపణ వుంటుంది. అయితే మనిషికి వివేచనవుంది. అది ఉపయోగించి మనిషి ఏదో ఒక శక్తి ప్రేరేపణను ఆధారంగా తీసుకుంటాడు. ఒకే మనిషి ఎల్లవేళలా ఒకే శక్తి ప్రేరేపణపై ఆధారపడడు. ప్రతి మనిషీ కూడా ఇటు దుష్ట శక్తినీ, అటు మంచి శక్తినీ కొంతవరకూనైనా ఆదరిస్తూంటాడు. సామాన్య మానవులంతా సాధారణంగా ఎక్కువగా మంచి శక్తి ప్రేరేపణకూ, అప్పుడప్పుడు దుష్ట శక్తి ప్రేరేపణకు లోబడతారు. కేవలం మంచి శక్తి, కేవలం దుష్ట శక్తి ప్రేరేపణలకు లోబడే వారి సంఖ్య ప్రపంచంలో అతి స్వల్పంగా ఉంటుంది. ఆ కారణంగానే ఎంతో గొప్పవాళ్ళు, పరమ దుర్మార్గులు అయినవారి సంఖ్య ప్రపంచంలో ఎప్పుడూ పరిమితంగానే ఉంటోంది. అయితే దుష్ట శక్తిగానీ, మంచి శక్తిగానీ ఏ మనిషినీ పూర్తిగా అదుపులోనికి తీసుకోలేవు. అతడి వివేచన అందుకు అడ్డం వస్తుంది. వివేచన లేని మనిషిని అవి పూర్తిగా స్వాధీనం చేసుకోగల్గుతాయి. అవతార పురుషులు, దుష్ట మాంత్రికులు ఆ విధంగా తయారైన వారే! వారికి మానవాతీత శక్తులు లభిస్తాయి. అయితే మనిషిగా పుట్టిన వాడికి ఎంతో కొంత వివేచన వుంటుంది. అఖరికి పిచ్చివాడికి కూడా కొంత వివేచన వుంటుంది.

వివేచన లేని మనిషి—ప్రాణంలేని శవం మాత్రమే!

ప్రాణంలేని శవాన్ని మానవాతీత శక్తులు వశంచేసుకుంటాయి. అయితే ప్రాణంలేని శవాన్ని అవేమీ చేయలేవు. దాంట్లోకి మళ్ళీ ప్రాణం వస్తుందేమోనని అవి ఎదురుచూస్తూంటాయి.

మనిషి పెరిగిన వాతావరణాన్ని బట్టి అతడి మనసు ఏదో ఒక శక్తివైపే మొగ్గు చూపుతూంటుంది. మనిషి చనిపోతే అతడి శవాన్ని ఆ శక్తి తాత్కాలికంగా పూర్తిగా స్వాధీనం చేసుకుంటుంది ఆ శవం కుళ్ళి వాసన వచ్చేవరకూ ఆ శక్తులు దాన్ని అంటిపెట్టుకుని ఉంటాయి. ఎవరైనా శవానికి ప్రాణంపోయగలిగితే—ఆ శవం దుష్టశక్తి లేక మంచి శక్తికి ప్రతీకగా తయారవుతుంది. దాని ప్రవర్తన చాలావరకూ చావుకుముందు దాని అనుభవాలపైన ఆధారపడి వుంటుంది. ఆ శవానికి మానవాతీత శక్తులుంటాయి.

భద్రుడు చచ్చిన మనిషిని కొద్ది క్షణాల్లో తిరిగి బ్రతికించే మందును కనిపెట్టి ఓ దుష్టశక్తిని తయారు చేశాడు. ఆ మందు ఎలా తయారయిందో వివరాలున్నాయి.

మహాదేవుడు వివరాలు వింటూ—"వాటం చూస్తూంటే ఇది నేను తయారుచేసిన మందులాగే వున్నది. అతడు ఉపయోగించిన మూలికల్లోని ముఖ్య రసాయనాలనే నేను కూడా నా మందుకుపయోగించాను. కొంపదీసి నేను ఏదైనా దుష్టశక్తిని తయారుచేయలేదుగదా!" అన్నాడు.

"నువ్వు శవాన్ని బ్రతికించావా?" అన్నాడు శివశంకరం ఆశ్చర్యంగా.

"ఆఁ బ్రతికించాననే అనుకుంటున్నాను. ధర్మాసుపత్రిలో ఓ పిల్ల కాళ్ళూ చేతులూ వెలవేసింది. కళ్ళు తేలేసింది. నాడి ఆగిపోయింది. శ్వాస ఆగిపోయింది. గుండె ఆగిపోయింది. చచ్చిందని నిర్ధారణ చేసుకుని నేను

తయారుచేసిన మందు ఇంజక్షన్ రూపంలో ఇచ్చాను. అంతే — ఆ శవం కళ్ళు తెరిచింది. మాట్లాడింది—" అన్నాడు మహాదేవుడు.

"అంటే నువ్వు శవాన్ని బ్రతికించావన్న మాట— అప్పుడేమయింది?"

"ఏమయింది? శవం బ్రతికింది. రెండు మాటలు మాట్లాడింది. అప్పుడు కరెంట్ పోయింది. కొద్ది క్షణాల్లోనే కరెంట్ వచ్చింది. కానీ శవం మాయమైంది—" అన్నాడు మహాదేవుడు.

"ప్రాణం పోసుకున్న శవం లేచి ఎక్కడికో వెళ్ళి పోయింది. ఆ అమ్మాయి ముఖం నాకింకా గుర్తుంది. కానీ ఊళ్ళో ఎక్కడా ఎంత వెదికినా కనబడలేదు—" అన్నాడు లింగం.

"అంటే మీరో శక్తిని తయారు చేశారు. అది దుష్ట శక్తో, మంచి శక్తో తెలియదు—" అన్నాడు శివశంకరం.

"దుష్ట శక్తి అయితే నగరంలో దుష్పరిణామాలు వుండాలికదా—అసలు వారంలో చెప్పుకోదగ్గ విచిత్రమే జరగలేదీ వారం రోజుల్లో—" అన్నాడు మహాదేవుడు.

"సరే—ఆ శక్తి వివరాలు తెలుసుకుందాం—" అన్నాడు శివశంకరం.

పుస్తకంలో మంచి శక్తికి సంబంధించిన వివరాలు లేవు. దుష్ట శక్తి గురించి చాలా వ్రాసివుంది.

దుష్ట శక్తికి మానవాతీత శక్తులు చాలా వుంటాయి. దాని బలం అపారం. దానికి రోజూ కనీసం రెండు ఔన్సుల రక్తం కావాలి. మనుషులనుంచి అది సరాసరి రక్తాన్ని పీల్చగలదు. ఒకసారి అది ఎవరి రక్తాన్నైనా పీల్చితే వారు దానికి కలకాలం బానిసలుగా వుంటారు.

అది రూపాలు మార్చగలదు. గాలిలో ఎగరగలదు. దాని శరీరం మంచుకన్నా చల్లగా ఉంటుంది. మనిషి కళ్ళను మోసం చేయగలదు. కానీ జంతువుల కళ్ళకది అసలు రూపంలోనే కనబడుతుంది. దాని అసలు రూపాన్ని అద్దంలో చూడవచ్చు.

దుష్టశక్తి శరీరం ఎప్పుడూ తాజాగానే వుంటుంది. అయితే అది పగటి వెలుగును భరించలేదు. పగటి వెలుగును భరించాలంటే దానికి ప్రత్యేకమైన స్నానం కావాలి. శవాల్ని నిలువ ఉంచగల ద్రావకాల్నూ, పదార్థాలూ దాని శరీరానికి కొత్త శక్తినిచ్చి పగటి వెలుగునుంచి రక్షణ కల్పిస్తాయి.

దుష్టశక్తిని జయించటం కష్టం. మానవశరీరాన్నావహించుకుని వున్నంతసేపూ అది కొన్ని భ్రమలకు లోనవుతుంది. మనిషి పెరిగిన వాతావరణాన్నిబట్టి కొందరు దేవుళ్ళకు అది భయపడుతుంది. సాధారణంగా ఆంజనేయుడి పేరు చెబితే దాని గుండెల్లో బెదురుంటుంది. ఆంజనేయుణ్ని అర్చించిన కుంకుమను అది తాకదు. దాని శక్తులకు ఆ కుంకుమ విరుగుడు. అయితే ఆ కుంకుమ దాని చేష్టలకు విరుగుడుగా మాత్రమే పనిచేస్తుంది. కుంకుమ దుష్టశక్తిని తాకదు. ఆ రెండూ ఒకదానినొకటి అంటుకోవు.

నిస్స్వార్థపరుడు, కేవలం లోకకళ్యాణం కోరేవాడు-అయిన వ్యక్తిని ఈ దుష్టశక్తి ఏమీ చేయలేదు. అలాంటివాడు దుష్టశక్తిని గుర్తించటమేకాక ప్రతిక్రియ చేయగలడు కూడా. కానీ అలాంటివారు చాలా అరుదుగా వుంటారు. అందువల్ల దుష్టశక్తికి ఎదురులేదనే చెప్పవచ్చు.

దుష్ట శక్తి ఎవడి రక్తమైతే తాగుతుందో—వాడి రక్తం తనూ తాగగలిగిన మనిషి వుంటే—దుష్ట శక్తి వాడికి వశమవుతుంది. వాడేం చెబితే అది చేస్తుంది. దుష్ట శక్తి సాయంతో ఈ ప్రపంచాన్నేలవచ్చు. దుష్ట శక్తికి మానవ శరీరం దొరకగానే ముందా శరీరానికి సంబంధించిన ద్వేషాన్ని ఆధారంగా పనిచేస్తుంది. ఆ తర్వాత తనను ఆజ్ఞాపించగలిగే మనిషి కోసం వెతుక్కుంటుంది. దుష్ట శక్తికి మనిషి సాయం అవసరం. అప్పుడే దానికి తృప్తికరంగా వ్యవహరించగల్గుతుంది.

దుష్ట శక్తికి నాశనంలేదు. శవాలను తాజాగావుంచే రసాయనాలందుబాటులో లేక పోతే అది కేవలం రాత్రిళ్ళు మాత్రమే చరిస్తుంది. తాగడానికి రక్తం దొరక్కపోతే దానిలో దుష్ట స్వభావం తగ్గుతుంది. ఏ మాత్రమూ రక్తం దొరక్కపోతే అది కొంతకాలానికి ఇల్లు కదలలేదు. అయితే ఆ తర్వాత మొదటిసారిగా దొరికిన మనిషిలోంచి ఒక్క చుక్క కూడా రక్తం లేకుండా పీల్చేస్తుంది. అది రక్తం పీలుస్తూంటే మనిషికి సంతోషంగా వుంటుంది తప్పితే బాధ వుండదు.

దుష్ట శక్తిని బంధించడానికి ఒక్కటే మార్గం. ఆంజనేయ దండకం చదువుతూ దానిచుట్టూ ఆంజనేయ చక్రం వెయ్యాలి. అప్పుడది నిద్రపోతుంది. మళ్ళీ మనిషి రక్తం దాని నోట్లో పోసేవరకూ అది లేవదు.

దుష్ట శక్తిని శాశ్వతంగా నాశనం చెయ్యాలంటే ఒకే ఒక్క మార్గముంది. దానిపై మంచి శక్తిని ప్రయోగించాలి. కానీ మంచి శక్తిని తయారుచేయటం చాలా కష్టం. ఎందుకంటే సర్వోత్తముడైన మానవుడి శవాన్ని ప్రతిష్ఠించినపుడే మంచి శక్తి తయారవుతుంది. సాధా

రణంగా మంచి శక్తిని తయారు చేయబోతే—మరో దుష్టశక్తి తయారవడమే జరుగుతుంది. అందువల్ల ఆ ప్రయత్నం అత్యంత ప్రమాదకరమైనది.

"అయితే మనం దుష్టశక్తినే తయారుచేసివుంటాం-" అన్నాడు మహాదేవుడు.

"అవును—ఇప్పుడా శక్తి ఏం చేస్తోందో, ఏమిటో" అన్నాడు లింగం.

"ఒకందుకు నేనీ పుస్తకం చూడాలనుకుంటే వ్యవహారమింకోలాగయింది. మీరు ఈ పుస్తకాన్ని ఒక వారం రోజులు ముందుగా సంపాదించివుంటే—ఇంత ప్రమాదం జరిగివుండేది కాదేమో—ఎవరైనా దుష్టశక్తిని తయారుచేస్తారేమోనని భయపడి అది ఆపటం కోసం ఈ పుస్తకాన్ని వెతుకుతూంటే—ఈలోగా మీరు నిర్విఘ్నంగా దుష్టశక్తిని తయారుచేశారు. అదృష్టవశాత్తూ మనకు దుష్టశక్తి గురించి చాలా ముఖ్య విశేషాలు తెలిశాయి. ఇప్పుడు మనం దాన్ని స్వాధీనం చేసుకుందుకు ప్రయత్నించాలి—" అన్నాడు శివశంకరం.

"ఎలా—మనిషి రక్తం తాగా?" అన్నాడు లింగం.

"అవసరమైతే అదీ చేయక తప్పదు. అయినా ముందు దాని ఉనికి తెలుసుకోవాలిగదా—అది చాలా కష్టమైన పని—" అన్నాడు మహాదేవుడు.

"అసలా అమ్మాయెవరో—ఆమె వివరాలేమిటో—, బొత్తిగా ఏమీ తెలియలేదు. అన్నీ ఆ దుష్టశక్తికి అనుకూలంగా వచ్చాయి—" అన్నాడు లింగం.

ఉన్నట్టుండి మహాదేవుడు పకపకా నవ్వి—"రజ్జు సర్ప భ్రాంతి అంటారు—ఇదేనేమో—" అన్నాడు.

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 60 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.





# త్రైమేత్రో తమాషాలు

(ఈ శీర్షికలో ప్రచురితమయ్యే ప్రతి రచనకూ రూ. 5 పారితోషికం ఇవ్వబడును.)

## ఆమె ఎవరట?

ఇంటి ఇల్లాలు పనిపిల్లమీద ఎగిరిపడింది,

"నువ్వు బరితెగించావు. నా యింట్లో చేరావు. అభం శుభం తెలియని నా పెద్దపిల్లవాడికి ముద్దులు నేర్పుతున్నావ్" గంయ్ మంది ఇంటి యిల్లాలు.

"ఎన్నిగంటలకు?" అడిగింది పనిపిల్ల.

"నిన్నరాత్రి ఏడు గంటలకు....వరండాలో....చీకట్లో"

"అయితే పెద్దబ్బాయికాదు!"

"మరి?...."

"వాళ్ళ నాన్నగారు!"

"అవ్వ! అంత వయసున్న అతడితో నువ్వు...."

"అది నేనుకాదు!"

"మరి?"

"మీ చెల్లెలు!"

—ఎమ్. ఎస్. దేవి, విశాఖపట్నం.

## గుడ్డి ప్రేమ!

క్రొత్తగా పెళ్ళయిన జంట బస్సులో వెళ్తూ చాలా పరవశంగా ప్రేమ కబుర్లు చెప్పుకుంటున్నారు.

"ప్రేమ గుడ్డిదన్నారు కదా! అందుకని కళ్ళుమూసుకొని

ముద్దు పెట్టుకుని చూద్దామా?" అన్నాడు భర్త.

"అవునవును! చూద్దాం!" అంది భార్య సంబర పడుతూ.

"కాని, లోకం గుడ్డిది కాదు బాబూ! కాస్త ఏదన్నా అద్దం చూసుకొని మరీ ముద్దుపెట్టుకోండి" అన్నాడు వెనకనుండి వాళ్ళనే గమనిస్తున్న ఓ తాతగారు.

—డి. మహబూబ్ బాషా, ఆదోని.

## జేబు దొంగ!

"అమెరికా బహు విచిత్రమైన దేశం!"

"ఏం?"

"నేరాలు చిత్రంగా వుంటాయి. శిక్షలూ అంతే.... సంచలనం సృష్టిస్తాయి!"

"ఇప్పుడు ఏం జరిగింది?"

"ఒక అత్తగారు అల్లుడి జేబులో డబ్బు కొట్టేస్తోందట. కోర్టువారు ఆమెకు నెల రోజులు జైలు శిక్ష వేశారు."

"అంతేనా!"

"ఆ దెబ్బతో అతడు తన భార్యమీద విడాకుల పిటీషన్ పడేశాడు."

"నెగ్గాడా?"

"దివ్యంగా!"

"ఈనాటి పేపర్లో వచ్చిందా ఈ వార్త!"

"అవును."

"ప్లీజ్, కటింగ్ నాకు సంపాదించిపెట్టు."

"ఎందుకు!"

"నా జేబులో పెట్టుకుంటాను."

—ఎమ్. ఎస్. దేవి, విశాఖపట్నం.

